సాహిత్య ప్రస్థానం
అక్టోబర్-డిసెంబర్ 2005
సంపుటి : 3 సంచిక : 13

# ఒక వీడ్కోలు, ఒక స్వాగతం...

ఒక సంవత్సరం ముగుస్తున్నది. మరో సంవత్సరం రానున్నది. కరిగి పోయే కాలానికి వీడ్కోలు పలికి, కదలి వస్తున్న భావికి స్వాగతం పలకవలసిన తరుణం. ప్రస్థానం మూడేళ్లు పూర్తి చేసుకుంటున్న సందర్భం. అందుకే పాఠకులకు, సాహితీ మిత్రులకు, శ్రేయోభిలాషులకు శుభాభినందనలు.

వాస్తవంలో ఈ ఏడాది సాహిత్య రంగాన్ని సమీక్షించుకోవలసిన సమయం ఇది. కాల పరిమితి దృష్ట్యా ఆ పనిని వచ్చే సంచికకు వాయిదా వేద్దాం. ప్రగతిశీల సాహిత్య సృజన, సమీకరణ ఈ ఏడాది కొత్త పుంతలు తొక్కాయన్నది యదార్థం. సాహితీ స్రవంతి మూడు చోట్ల నిర్వహించిన సాహిత్యశాలలు, జిల్లాలలో జరిగిన విస్తృత కార్యక్రమాలు అందుకు ఎంతగానో దోహదపడ్డాయి. ఔత్సాహికులే గాక పరిణత రచయితలు కవులు, విమర్శకులు, సాహిత్యాభిమానులు ఈ కృషికి ఇచ్చిన సహకారం అమూల్యమైనది: చూపిన స్పందన అపూర్వమైంది. ప్రపంచీకరణ, మతోన్మాదం, మార్కెట్ సృష్టించిన పద్మవ్యూహాలను మన ప్రజలు అర్థం చేసుకోవడానికి ఈ కృషి ఉపయోగపడింది. జనకవనాలు వాస్తవానికి ప్రజాస్వామిక వ్యక్తీకరణకు వినూత్న రూపాలు. ప్రస్థానం యంత్రాంగం, హంగులు సంపూర్ణం కాకున్నా ప్రగతిశీల లౌకిక సాహితీ మిత్రుల వేదికగా అందించిన సేవ అందరి మన్నన పొందడం హర్షదాయకం. ఈ పరవడిని ఇక ముందు మరింత శక్తివంతంగా మరింత సమర్థంగా కొనసాగించడానికి కీలకం మీ వితరణలు, విమర్శలే.

.... .... ....

నిషేధాలు నిషిద్ధమే అని గత సంచిక సంపాదకీయం. దీనిపై నిరసనలోనూ, విమర్శలలోనూ సాహితీ స్రవంతి స్పష్టమైన వైఖరి తీసుకుంది. ఇతర ప్రజాస్వామిక సంఘాలూ నిషేధాన్ని వ్యతిరేకించాయి. ఎట్టకేలకు ప్రభుత్వం విరసంపై నిషేధాన్ని ఎత్తివేసింది. భావ ప్రకటనా స్వేచ్ఛను సంఘ స్వాతంత్ర్యాన్ని తొక్కిపట్టే ప్రయత్నాలను ఇక ముందు కూడా నిర్ద్వంద్వంగా ఖండించవలసి వుంటుంది.

....

ఇదే తరుణంలో కుష్బూ వ్యాఖ్యలపై చెలరేగిన దుమారం అవాంఛనీయమైంది. ఆమె అభిప్రాయాలు ఆమెవి: ఆమె వ్యాఖ్యలపైనా ఎవరి భావాలు వారికి వుండొచ్చు. కాని మాట్లాడ్డమే తప్పయినట్టు ఆమెపై దాడి చేయడం, తమిళనాడు ప్రభుత్వం, పోలీసులు కేసులు బనాయించడం దారుణం. అలాగే సుహాసిని, సానియా మీర్జాల వ్యాఖ్యలపైన కూడా అనవసర వివాదం లేవనెత్తి అసహనం చాటుకున్నారు. అయితే గతంలో కాషాయ కూటమి హయాంలో క్రికెట్ ఆటపైనా, చిత్రకారులు రచయితలపైనా అమానుష దాడులు సాగిన వాతావరణంతో పోలిస్తే ఇప్పుడు ప్రజాస్వామిక వాణి బలంగానే వినిపించిందని చెప్పొచ్చు.

....

ఈ కాలంలో సాహిత్య రంగానికి సంబంధించిన ప్రముఖులు పలువురు మనకు దూరమైనారు. అమృతా ప్రీతమ్, నిర్మల్ వర్మ మహీధర నళినీ మోహన్, వై. విజయకుమార్, అరుణా పబ్లిషింగ్ హౌస్ బెల్లం బాబూరావు కన్నుమూశారు. తమ తమ పరిధుల్లో తమ పద్ధతుల్లో కళా సాహిత్య రంగాలను సేవ చేసిన వీరందరికీ ప్రస్థానం జోహారులర్పిస్తోంది. సంచిక పూర్తవుతున్న తరుణంలో బోయి భీమన్న అస్తమించారు. ఆ సాహితీ భీష్ముడికిదే నివాళి.

....

హెరాల్డ్ పింటర్ నోబుల్ బహుమతి పొందడం, ఆ సందర్భంగా అమెరికా సామ్రాజ్య వాదంపై అక్షర శతఘ్నులు కురిపించడం ప్రపంచ మంతటా ప్రగతిశీల సాహిత్యకారులకు ఉత్తేజకరమైన విషయం. బహుమతి పొందినందుకన్నా ఇంత గొప్ప సందేశం ఇచ్చినందుకు ఆయనకు జేజేలు. నేటి సాహిత్యకారుల కర్తవ్యానికి ఇదే దిక్సూచి.

ముఖపత్ర సృష్టి : ఎం. గణేష్

## ఈ సంచికలో...

ధిక్కార స్వరానికి నోబుల్ పురస్కారం .............. 2
కళ, సత్యం, రాజకీయాలు .............. 4
సాహిత్య సభలంటే చిన్న చూపేల? .............. 6
మనిషి (కథ) .............. 9
ఒకానొక అగంతకుని ప్రస్థానం (కవిత) .............. 15
పిల్లి మెడలో గంట (మీమాంస) .............. 16
ఈగలు (కథ) .............. 17
విశాఖ... నా.. విశాఖా!
తూర్పు తీరపు దీపశిఖా!(కవిత) .............. 20
మల్లెపువ్వు ఏ దేశం మట్టిలోనైనా
తెల్లగా నవ్వుతుంది .............. 21
సమీక్షాపర్వం .............. 24
తొలి తెలుగు పరిశోధకులపై జాతీయ సదస్సు ... 29
నానీల ఎనిమిదో వార్షికోత్సవం .............. 30
సామాజికోద్యమాలు - తెలుగు సాహిత్యం ...... 33
లాటరీ (కథ) .............. 35
స్త్రీత్వపు అఖిలత్వాన్ని నిరూపించిన 'తొలెరుక' .... 39
శరత్‌బాబు 'భారతి'లో టెర్రరిస్టు ఉద్యమం ....... 41
సాహిత్య శిల్పం లోతు చూపిన నవీన్ .............. 45
డైరీ .............. 50
కుంచనం (కథ) .............. 55
దీర్ఘాక్షరం (కవిత) .............. 60
ఖమ్మం జిల్లాలో సాహితీ స్రవంతి ప్రస్థానం ...... 62
స్వీకారం .............. 64

సంపాదకుడు
తెలకపల్లి రవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

ఎడిటోరియల్ బోర్డ్ అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136

# ధిక్కార స్వరానికి నోబుల్ పురస్కారం



**నోబుల్ పురస్కారం అంతర్జాతీయంగా అమెరికా రాజకీయ వ్యూహాలకు అనుబంధంగా వుండే మాట నిజమే. అందుకు అనుకూలమైన వారికే అది దక్కుతుంటుంది. కాని సాహిత్య రంగంలో మాత్రం దాదాపు దశాబ్ది కాలం నుంచి వామపక్ష ప్రగతిశీల దృక్పథం గలవారికే అది లభిస్తుండడం విశేషం. దివాళా ఎత్తిన పాశ్చాత్య సాహిత్య సాంస్కృతిక రంగాల పరిస్థితికి ఇది ఒక ప్రతిబింబం అనొచ్చు. ఆఫ్రికా, లాటిన్ అమెరికా, ఆ పైన ఆసియా వాసులనే ఈ పురస్కారం ఎక్కువగా వరిస్తున్నది. పింటర్ ఎంపిక కూడా ఈ ధోరణికి అనుగుణమైన విషయమే.**

2005 నోబుల్ సాహిత్య పురస్కారం అందుకొన్న హరోల్డ్ పింటర్ విశ్వవిఖ్యాతుడైన నాటకకర్త. గతంలో ఈ గౌరవం పొందిన వి.ఎస్.నైపూల్ జన్మత: భారతీయుడు గనక పింటర్ ఈ జాబితాలో చోటు సంపాదించిన తొలి బ్రిటిష్ రచయిత అనొచ్చు. భారతీయుడైన నైపూల్ వర్ధమాన దేశాల ప్రయోజనాలకు ప్రతినిధి కానట్టే పింటర్ బ్రిటిష్ జాతీయుడైనా బ్రిటిష్ సామ్రాజ్యవాద సమర్థకుడు మాత్రం కాదు. వాస్తవానికి అమెరికా ఆధిపత్యాన్ని చీల్చి చెండాడే నామ్ చామ్‌స్కీ ఆయన అభిమాన రచయిత!

మొదట్లోనే ఒక వాస్తవం చెప్పుకోవచ్చు. నోబుల్ పురస్కారం అంతర్జాతీయంగా అమెరికా రాజకీయ వ్యూహాలకు అనుబంధంగా వుండే మాట నిజమే. అందుకు అనుకూలమైన వారికే అది దక్కుతుంటుంది. కాని సాహిత్య రంగంలో మాత్రం దాదాపు దశాబ్ది కాలం నుంచి వామపక్ష ప్రగతిశీల దృక్పథం గలవారికే అది లభిస్తుండడం విశేషం. దివాళా ఎత్తిన పాశ్చాత్య సాహిత్య సాంస్కృతిక రంగాల పరిస్థితికి ఇది ఒక ప్రతిబింబం అనొచ్చు. ఆఫ్రికా, లాటిన్ అమెరికా, ఆ పైన ఆసియా వాసులనే ఈ పురస్కారం ఎక్కువగా వరిస్తున్నది. పింటర్ ఎంపిక కూడా ఈ ధోరణికి అనుగుణమైన విషయమే.

హారోల్డ్ పింటర్ 1930 అక్టోబరు 10 వ తేదీన తూర్పు లండన్‌లో పుట్టాడు. తండ్రి యూదు మతస్తుడు. దుస్తుల తయారీ చేసేవాడు. హిట్లర్ ఫాసిజం యూదులను వేటాడి నరమేధం సాగించిన నేపథ్యం పింటర్ రచనలకు ప్రేరణ. ఆ బీభత్సం, హింసాకాండ, రెండవ ప్రపంచ యుద్ధపు బాంబుల వర్షం పింటర్‌పై ప్రభావం చూపాయి. రష్యన్ చిత్రం 'ఒడిస్సీ ఫైల్' ద్వారా ప్రసిద్ధికెక్కిన ఒడిస్సీ( దాన్నే కొందరు హంగరీ అంటారు ) తన తాతల నివాసమై వుండొచ్చని పింటర్ అంటుంటారు. అయితే కథలు తప్ప ఇందులో పూర్తి నిజానిజాలు తెలియవంటారు. వీధులలో యూదు వ్యతిరేకులతో ముఖాముఖి తలపడ్డ అనుభవాలు, యుద్ధ సంఘటనలు ఆయనలో హింసపట్ల భయం పోగొట్టాయి.

ఈ కారణంగానే ఆయన ఇరాక్‌పై దురాక్రమణను నిశితంగా ఖండించారు. 'అమెరికా అడుగులకు మడుగులొత్తే బ్లెయిర్ కారణంగా తాను బ్రిటిష్ పౌరుడనైనందుకు సిగ్గుపడుతున్నానని ప్రకటించారు. బ్లెయిర్ నరహంతకుడని, క్రైస్తవ ధగ్గు అని ధ్వజమెత్తారు. తమ దేశాన్ని యుద్ధ నేరాల కింద శిక్షించాలని కూడా కోరారు. వీటన్నిటితర్వాత ఆయనకు నోబుల్ పురస్కారం లభించడం ఆశ్చర్యం అనిపించవచ్చు. పింటర్ నాటకకర్తగా ప్రదర్శించిన అసమాన ప్రతిభా విశేషాలు, సృజన శీలతలే అందుకు మూలం. ఆయన ఇంతకు ముందే అనేక అంతర్జాతీయ అవార్డులు పొందారు. షేక్స్‌పియర్ ప్రైజ్ (హాంబర్గ్), ఐరోపా సాహిత్య పురస్కారం (ఫియున్నా) పరండిలో ప్రైజ్( పాలెమారో) డేవిడ్ కోహెన్ బ్రిటిష్ సాహిత్య పురస్కారం (లండన్) జీవిత కాలపు కృషికి గాను లారెన్స్ ఆలివర్ అవార్డు, మాలిరీ గౌరవం వాటిలో కొన్ని మాత్రమే. 1999లో పింటర్‌ను రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ కూడా ప్రత్యేకంగా గౌరవించింది.

హారోల్డ్ పింటర్ మొత్తం 29 నాటకాలు రాశాడు. అంతకు ముందు మారుమూల గ్రామాల్లోనూ పట్టణాల్లోనూ కూడా నాటక ప్రదర్శనల్లో ప్రత్యక్షంగా పాల్గొనడం వల్ల ఆయనకు ప్రజల స్పందనలు, మనోభావాలు బాగా పట్టుబడ్డాయి.

27వ ఏట 'ద రూం' అన్న నాటికతో ఆయన రంగ(స్థల) ప్రవేశం చేశారు. అదే ఏడాది వచ్చిన బర్త్‌డే పార్టీ ఆయనకు ఎనలేని ఖ్యాతి తెచ్చిపెట్టింది. 1958లో అది మొదట ప్రదర్శించినప్పుడు విమర్శకులు విపరీతంగా గేలి చేశారు. పరమ చెత్త అని తిట్టిపోశారు. ప్రేక్షకుల స్పందన కూడా మొదట్లో అంతంత మాత్రంగానే వుండింది. కాని తోటి నాటక కర్తలు మాత్రం అతనిలోని ప్రతిభను ఎంతగానో శ్లాఘించారు. తనకు ఎంతో ఇష్టుడైన నవలా రచయిత శామ్యూల్ బెకెట్ కూడా అనుకోని విధంగా మెచ్చుకోవడంతో పింటర్‌కు చాలా ఆత్మవిశ్వాసం కలిగింది.

తర్వాత కేర్ టేకర్, హోమ్ కమింగ్, డంబ్ వైటర్, స్లైట్ ఏక్, ద

హాట్‌హౌస్, ఎ నైట్ ఔట్, ద డ్వార్ఫ్స్, ద బేస్‌మెంట్, లాండ్ స్కేప్ తదితర నాటకాలు రాశాడు. 'ద సర్వెంట్', ద గో బిట్వీన్, ద ఫ్రెంచ్ లెఫ్టినెంట్స్ వుమన్, తదితర 29 స్క్రీన్‌ప్లేలు రాశాడు.

బర్త్‌డే పార్టీ, సెలబ్రేషన్, యాషెస్ టు యాషెస్ ఇలా ఒక్కో నాటకం రూపు దాల్చేకొద్దీ పింటర్ స్థాయి పెరిగింది. తూర్పు లండన్ నుంచి లండన్ రెస్టారెంట్లలో వాటిని చూసి ఆనందించే స్థితి వచ్చింది. కాని ఆయన నాటకాలన్నిటిలోనూ సూటిగా నాటుగా సాగే సంభాషణలు, గుండెల్లో గుచ్చుకునే మౌనం వుంటాయి. ఆయన నాటకాల్లో నిగూఢత నిండి ఒక పట్టాన అంతుపట్టవు. ఆయన కావాలనే అంతా గందరగోళం చేస్తాడన్న ఆరోపణ వినిపిస్తుంటుంది. కాని అదే వాటిపై ఆసక్తిని సజీవంగా వుంచుతుంది. ఆయన నాటకాలు 'ఒక నిర్మాణ వ్యవస్థ కలిగించే భావ ప్రతిమలుగా, విభిన్న పరిస్థితులకు ప్రతిబింబాలుగా, అలంకారాలుగా వుంటాయి. నాటకాలలో సంభాషణలు, భాష కూడా ప్రత్యేక తరహాలో సాగుతాయి. పాత్రలతో విచిత్రమైన మాటలు పలికించి దిగ్భ్రాంత పరుస్తాడు. నాటకాలలో మాటలు మాత్రమే కాక మౌనం కూడా కీలకపాత్ర వహిస్తుంది. అది మానవ సంబంధాలలో శూన్యాన్ని స్తబ్ధతను ప్రతిబింబిస్తుందంటాడు పింటర్. ఉదాహరణకు బాగా తమాషా సృష్టించాలనుకున్నప్పుడు ఒక తెర లేదా పొగ మంచు వచ్చేస్తుంది. (ఈ విషయంలో ఇవోన్ సాంకోతోనూ, అమెరికా నాటకకర్త ఎడ్వర్డ్ ఎల్బీతోనూ పింటర్‌కు పోలికలున్నాయంటారు.) ఈ ప్రత్యేకత పిక్చరిస్క్ అన్నట్టే పింకరిస్క్ అన్న పదబంధాన్ని సృష్టించింది. సంభాషణలు సంక్షిప్తమైన ఆత్మభాషణల్లా వుంటాయి. 'మనకు వినిపించే భాషణలు మనకు వినిపించని దాని సూచనలు' అంటాడు పింటర్. మామూలుగా వినిపించని మౌన శబ్దాలను వినాలంటే మనం మరింత సావధానం కావాలి. మానవత్వంతో చూడాలి. గొప్ప రచయితలందరూ చేసే ఈ పనినే పింటర్ మరింత బాగా చేశాడు.

బయిటి ప్రపంచంతో వ్యవహరించే ముందు మనతో మనం మాట్లాడుకోవాలనే దృష్టి ఆయనది. (తన అస్తిత్వం ప్రమాదంలో పడుతుందేమోననే ఆందోళన మనిషిలో ప్రాథమికంగానే వుంటుందన్న మార్టిన్ హైడ్గర్ ప్రభావం కూడా ఇందులో వుందంటారు.) కాని పింటర్‌లో ఆ భయం నైరూప్యంగా వుండదు. ఉదాహరణకు బర్త్‌డే పార్టీలో ఇద్దరు ఆగంతుకుల రాకను భయానికి సంకేతంగా ఆయన ఉపయోగిస్తాడు." తలుపు దగ్గర ఎవరో వచ్చి నిలబడడమనేది గత ఇరవయ్యేళ్లుగా గత రెండేళ్లుగా రెండు వందల ఏళ్లుగా ఐరోపాలో జరుగుతూనే వుంది' అని పింటర్ వ్యాఖ్యానిస్తాడు.

పింటర్ రచన 'హోం కమింగ్' లో సెక్స్, వ్యభిచార వృత్తి వంటి సమస్యలను బ్రిటిష్ కార్మిక వర్గ జీవిత వాస్తవాల పరిధిలో చర్చించడం చూస్తాం. ఈ నాటకం ఇండియాతో సహా ప్రపంచమంతటా యువతరం సాహిత్యాభిమానులను విశేషంగా ఆకర్షించింది. మొదట్లో అవి అందరినీ దిగ్భ్రాంతికి గురిచేశాయి. ఇప్పుడు మీడియా బాగా అందుబాటులోకి వచ్చాక ఆ తీవ్రత తగ్గినా వాటి ఆకర్షణ ప్రత్యేకత ఏ మాత్రం తగ్గలేదు. తను ఏ దేశాన్ని దృష్టిలో పెట్టుకుని రాస్తానో అక్కడి నేలకు హత్తుకునేలా జాగ్రత్తపడతానంటాడు పింటర్. ఆయన రాసిన దాన్ని 'అసంగత నాటకం'(థియేటర్ ఆఫ్ ద అబ్సర్డ్) అన్నప్పటికీ దేశదేశాలను ఆకర్షించడానికి అదో కారణం.

ద ఫ్రెంచ్ లెఫ్టినెంట్స్ వుమన్, ద సర్వెంట్, గో బిట్వీన్ వంటి సినిమా రచనలు పింటర్‌కు ప్రత్యేక స్థానం సంపాదించి పెట్టాయి. ఆయన నవల ద డ్వార్ఫ్స్ 1990లో వెలువడింది. అలాగే ఆయన పందొమ్మిదవ ఏట కవిత్వం మొదలెట్టి మొత్తం అరడజను కవితా సంపుటాలు వెలువరించారు. ఇరాక్ యుద్ధ నేపథ్యంలో కూడా ద వార్, ఎయిట్ పోయెమ్స్ అండ్ వన్ స్పీచ్ అన్న కవితా సంపుటాలు ప్రచురించారు.

రచయితగా ఎంత ప్రసిద్ధుడో సామాజిక కార్యకర్తగానూ, సామ్రాజ్యవాద వ్యతిరేకిగానూ ఆయన అంత శక్తిమంతుడు. ఆయన 1958లో నేను నిజానికి నిజం కానిదానికి మధ్య అభేద్యమైన తేడాలేమీ లేవని రాశాను. అలాగే నిజం కాని దానికి నిజమైన దానికి మధ్య కూడా. ఒక విషయం తప్పని సరిగా వాస్తవమో అవాస్తవమో అయి వుండాలని ఏమీ లేదు. అయినా ఇలాంటివి నొక్కి చెప్పడంలో విజ్ఞత వుంది. కళలో సత్యాన్వేషణ చేయడానికి అవి దోహద పడతాయి. కనక ఒక రచయితగా నేను వారితో నిలబడతాను. పౌరుడుగా నిలబడలేను. పౌరుడుగా నేను ఏది నిజం? ఏది బూటకం? అనే ప్రశ్న వేయక తప్పదు" పౌరుడుగానే తాను పాశ్చాత్య దేశాల ఆధిపత్యంపై నిప్పులు చెరుగుతానన్నది ఆయన భావం. తన సైనిక బలంతో అమెరికా మిగిలిన ప్రపంచంపై ఆర్థిక పెత్తనం సాగించడం అన్యాయమని ఆయన నిశ్చితాభిప్రాయం. బ్లెయిర్, బిల్ క్లింటన్, బుష్‌లను యుద్ధ నేరస్తులుగా శిక్షించాలని ఆయన డిమాండ్ చేశాడు. నామ్ చామ్‌స్కీ, ఆర్థర్ మిల్లర్‌లు అమెరికా చైతన్య స్వరూపాలని కొనియాడాడు. తన మాటలను తప్పుగా ప్రకటించినందుకు గార్డియన్, ఇండిపెండెంట్ వంటి బ్రిటిష్ పత్రికలు క్షమాపణ చెప్పాలని ఆయన డిమాండ్ చేశాడు.' మీరు నా నోరు నొక్కలేరు' అన్నది ఆయన శంఖారావం.

వయసు పైబడినా, కాన్సర్ తినేస్తున్నా పింటర్ ఇరాక్‌లో సామ్రాజ్యవాదుల దురాగతాలను పింటర్ సహించలేకపోయాడు. అడుగడుగునా ఖండించాడు. ఆఖరుకు నోబుల్ బహుమతి స్వీకరిస్తూ ఆయన చేసిన ప్రసంగం కూడా అమెరికాపై నిప్పులు చెరిగింది. కాన్సర్ శస్త్ర చికిత్స అనంతరం దుర్బల దేహంతో వణికే కంఠంతో తన చక్రాల కుర్చీలోనే రికార్డు చేసిన సందేశంలో పింటర్ అమెరికాను, ప్రత్యేకించి బుష్‌ను చీల్చి చెండాడాడు. అస్వస్థుడైనప్పటికీ అభినయంలో వ్యక్తీకరణలో ఆరితేరిన పింటర్ వీడియో సందేశం ప్రేక్షకులను పరిశీలకులను మంత్ర ముగ్ధులను చేసింది. వాస్తవానికి వీడియో షూటర్ కూడా కాస్సేపు సూచనలు చేసినా తర్వాత అంతా ఆయన ఇష్టానికే వదిలేశాడట.

పింటర్ సందేశం మొత్తం ప్రధానంగా అమెరికా విదేశాంగ విధానంపై దాడి. కాని ఆయన దాన్ని అందించిన తీరులో ఒక మహానాటకకర్త నైపుణ్యం తొణికిసలాడింది. బుష్ ఉపన్యాసాలు రాసేందుకు తనను పెట్టుకుంటే బాగుంటుందని అంటూ 'మా దేవుడు మంచివాడు. వాళ్ల (లాడెన్) దేవుడు చెడ్డవాడు. అతను చెడ్డ దేవుడు. సద్దాం దేవుడు చెడ్డవాడు. కాకపోతే అసలు అతనికి దేవుడే లేడు. అతనో బర్బరుడు. మేం బర్బరులం కాము." ఇలా సాగుతుందంటాడు. పింటర్ ఈ మాటలు చెప్పేతీరు దానిలోని వ్యంగ్యాన్ని మరింతగా పండించింది.

'ఇక్కడ ఈ మనిషి అమెరికా విదేశాంగ విధానంపైన,దానికి బ్రిటన్ వంత పాడడంపైన దాడి చేస్తున్నాడు. నియంత్రిత ఆగ్రహంతో భయంకరమైన వ్యంగ్యంతో ఆ పని చేస్తున్నాడు. విడ్డూరమేమంటే ఇదంతా అయిన తర్వాత మనకు పింటర్ ఎంత గొప్ప నాటకకారుడో అర్థమవుతుంది.' అని గార్డియన్ నాటక విమర్శకుడు మైకెల్ బిలింగ్టన్ రాశాడు.

ఆ గుణమే ఆయనకు నోబుల్ తెచ్చిపెట్టింది మరి!

*



# కళ, సత్యం, రాజకీయాలు

ఈ ఏడాది నోబెల్ సాహిత్య పురస్కార గ్రహీత **హెరాల్డ్ పింటర్** స్టాక్‌హోమ్‌లో వీడియో ద్వారా డిసెంబర్ 7వ తేదీ చేసిన ప్రసంగ భాగాలు. పింటర్ తరఫున ఆయన ప్రచురణకర్త శనివారం స్వీడన్ రాజు నుంచి నోబెల్ పురస్కారాన్ని స్వీకరించారు.

'యథార్థము, అవాస్తవమూ మధ్య కానీ, సత్యము, అసత్యము నడుమ కానీ అభేద్యమైన తేడాలేవీ లేవు. ఏదైనా విషయం తప్పనిసరిగా సత్యమో, అసత్యమో కావాలని లేదు. అది యథార్థమూ, మిధ్యా రెండూ కావచ్చు.' ఇది నేను 1958లో రాశాను. ఈ వక్కాణింపు ఇప్పుడూ అర్థవంతమైనదేనని, కళ ద్వారా వాస్తవాన్వేషణకు ఇప్పటికీ వర్తిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. నలభై ఏడు సంవత్సరాల క్రితం చేసిన ఈ ఉద్ఘాటనకు ఒక రచయితగా నేను నిబద్ధమై ఉన్నాను, ఒక పౌరుడుగా మాత్రం కాదు. ఒక పౌరుడుగా నేను అడిగి తీరాలి. ఏది సత్యం? ఏది అసత్యం?

నాటకంలో సత్యం ఎప్పటికీ అంతు చిక్కదు. నీవు దానిని కనుగొనలేవు. అయితే సత్యాన్వేషణ విధిగా చేయ్యాలి. సత్యశోధన నీ కర్తవ్యం. అంధకారంలో అస్తుబిస్తుగా సత్యం నీకు తారస పడుతుంది. నీవు దానిని ఢీకొంటావు లేదా సత్యాన్ని పోలిన ఒక ప్రతి కృతిని, ఒక రూపును కాంచుతావు – నీవు చేసినదేమిటో గ్రహించకుండానే. అయితే అసలు నిజం ఏమిటంటే నాటక కళలో ఒక సత్యంగా కనుగొనబడే విషయమేదీ లేదు. చాలా సత్యాలు ఉన్నాయి. ఆ సత్యాలు పరస్పరం సవాళ్ళు విసురుకుంటాయి, వివర్తనం చెందుతాయి, ప్రతిబింబిస్తాయి. అలక్ష్యానికి పాల్పడుతాయి, వేధించుకుంటాయి. అవి పరస్పరం గుర్తుంచుకోవు. కొన్నిసార్లు ఒక మహత్వపు సత్యం నీ చేతుల్లోకి వచ్చిందని భావిస్తావు. అంతలోనే అది నీ హస్తాల్లోంచి జారిపోతుంది. నీ నుంచి నిష్క్రమిస్తుంది. నా రూపకాలు ఎలా వచ్చాయని నన్ను తరచు అడుగుతుంటారు. నేను చెప్పలేను. నా నాటకాలను సంక్షేపించలేను – జరిగింది ఇది, అదీ వారు (పాత్రలు) చెప్పిందీ, అదీ వారు చేసింది అని చెప్పడం మినహా.

అప్పటి వరకు ఉనికే లేని పాత్రలను సృష్టించిన క్షణం ఒక అసాధారణ భ్రామకం. ఆ తరువాత సంభవించేది ఔచిత్యపూర్వకమే. అనిశ్చితమే. భ్రాంతికరం కూడా. అయినప్పటికీ కొన్నిసార్లు పాత్రల సృష్టి ఆపలేని ప్రవాహ సదృశ్యమే. రచయిత స్థితి విచిత్రమైనది. ఒక విధంగా పాత్రలు అతన్ని హర్షించవు. ఆహ్వానించవు. అవి ప్రతిఘటిస్తాయి. రచయితతో సహ జీవనం చేయలేవు. నిర్వచించడానికి అసాధ్యంగా పాత్రలు పరిణమిస్తాయి. ఖచ్చితంగా నీవు వాటిని ఆదేశించలేవు. కొంతవరకు వాటితో నీవు ఎప్పటికీ పూర్తికాని ఆటకు దిగుతావు. దాగుడు మూతలు ఆడతావు. అంతిమంగా నిలువెత్తు సజీవమూర్తులు – సంకల్పమూ, వ్యక్తిగత అనుభూతులు ఉన్న వ్యక్తులు – నీ ఎదుట ఉన్నట్లు కనుగొంటావు. నీవు మార్చలేని, విరూపం చేయలేని, లొంగదీసు కోలేని మనుష్యులు వారు!

కనుక కళలో భాష పూర్తిగా సందిగ్ధ వ్యవహారంగా మిగిలిపోతుంది. అది ఒక ఊబి. ఘనీభవించిన సరస్సులాంటిది. అది ఏ క్షణమైనా నీ (రచయిత) కాళ్ళ కింద నుంచి తొలగిపోతుంది. అయితే నేను చెప్పినట్టు సత్యాన్వేషణ నిలిచిపోదు. అది ముగియ కూడదు. దాన్ని వాయిదా వేయకూడదు. సత్యంతో తలపడాలి – అక్కడికక్కడే, ఆ క్షణాన్నే.

రాజకీయ యవనిక పూర్తిగా భిన్నమైన సమస్యలను ప్రదర్శిస్తుంది. ఎట్టి పరిస్థితులలోను ధర్మోపదేశాలు చేయకూడదు. నిష్పాక్షికత ముఖ్యం. పాత్రలు స్వంత ఉచ్ఛ్వాసనిశ్వాసలు తీసేలా పాత్రలకు అనుమతి ఇచ్చి తీరాలి. తన సొంత అభిరుచులు, దృక్పథం, దురభిప్రాయాలకు అనుగుణంగా వాటిని పరిమితం చేయడానికి, మలచడానికి రచయిత ప్రయత్నించకూడదు. వివిధ కోణాల నుంచి వాటిని సృజించడానికి అతడు సిద్ధం కావాలి. అవి రూపుదిద్దుకుంటున్న తీరు క్వాచిత్కంగానైనా ఆశ్చర్యపరచవచ్చు. అయినప్పటికీ అవి తమ సంకల్పానుసారం వెళ్ళేలా వాటికి స్వేచ్ఛనివ్వాలి. అన్ని సృజనల లోను ఇలా చేయడం కుదరదు. రాజకీయ ప్రహసనం ఈ సృజన సూత్రాలలో దేనికీ కట్టు బడదు. నిజం చెప్పాలంటే దానిది ఖచ్చితంగా భిన్న దృష్టి. ఏమంటే అదే దాని సరైన విధి.

'ది బర్త్‌డే పార్టీ' అనే నా నాటకంలో పాత్రలను అంతిమంగా లోబరచుకొనే ముందు వాటికి అవకాశాల చిట్టడవిలో అన్ని ప్రత్యామ్నాయ మార్గాలలోను ప్రవర్తించడానికి, స్వేచ్ఛనిచ్చానని భావిస్తున్నాను. 'మౌంటెన్ లాంగ్వేజ్'లో ప్రత్యామ్నాయ కార్యకలాపాలకు అవకాశమివ్వలేదు. దానిలోని పాత్రలు క్రూరంగా వ్యవహరిస్తాయి. ఆ నాటకంలోని సైనికులు తమ ప్రవర్తన ద్వారా వినోదం పొందుతారు. చిత్రవధలు పెట్టడమనేది తేలిగ్గా విసుగుపుట్టిస్తాయని కొన్నిసార్లు మరచి పోతుంటారు. తమ పైశాచికత్వానికి ఉత్తేజం పొందడానికి అవి నవ్వుకోవాల్సిన అవసర మెంతైనా ఉంది. బాగ్దాద్‌లోని అబూ గరీబ్ జైలులోని పరిణామాలు ఈ విషయాన్ని ధ్రువీకరించాయి. 'మౌంటెన్ లాంగ్వేజ్' 20 నిమిషాల పాటు మాత్రమే కొనసాగే నాటకం. అయితే అది అలా అదే పద్ధతిలో మళ్ళీ మళ్ళీ కొనసాగుతూనే ఉంటుంది.

సద్దాం హుస్సేన్ పెద్ద ఎత్తున భారీ విధ్వంసక మారణాయుధాలను సమకూర్చు కున్నాడనే సాకుతో ఇరాక్‌ను ఆక్రమించు

...ం జరిగిందన్న విషయం ఈ సమావేశం లోని ప్రతి ఒక్కరికి తెలుసు. సద్దాం వద్ద అణ్వస్త్రాలు, రసాయన, క్రిమి ఆయుధాలున్నాయని మనకు చెప్పారు. అది నిజం కాదు. ఆల్-ఖైదాతో ఇరాక్‌కు సంబంధాలు ఉన్నాయని, సెప్టెంబర్ 11 దాడులకు సహకరించిందని చెప్పారు. ఇది నిజమని మనకు నమ్మబలికారు. కాని ఇది నిజం కాదు. ప్రపంచ భద్రతకు ఇరాక్ ప్రమాదకారిగా పరిణమించిందని చెప్పారు. ఇది నిజం కాదు. సత్యం పూర్తిగా భిన్నమైనది. ప్రపంచ వ్యవహారాలలో తన పాత్రను అమెరికా ఏ విధంగా అర్థం చేసుకొంది. దానినే విధంగా నిర్వర్తించడానికి నిర్ణయించుకుంది అనేదానితో సత్యం ముడిపడి ఉంది.

వర్తమానాన్ని విలోకించే ముందు ఇటీవలి గతం అంటే ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా విదేశాంగ విధానం పోకడలపై నిశిత దృక్కులు సారించదలిచాను. ప్రపంచ యుద్ధానంతరం సోవియట్ యూనియన్ తూర్పు యూరప్‌లలో ఏమి జరిగిందో అందరికీ తెలుసు. వ్యవస్థీకృత క్రూరత్వం, అంతులేని దురాగతాలు, స్వతంత్ర ఆలోచన అణచివేత, ఈ విషాదాలకు సంపూర్ణ సాక్ష్యాధారాలు ఉన్నాయి? అవి ధ్రువీకరింపబడ్డాయి. అయితే నా వాదన ఏమిటంటే ఇదే కాలంలో అమెరికా పాల్పడిన నేరాలు సరిగా రికార్డు కాలేదు. అమెరికా నేరాలు చేసినట్టు అంగీకరించడం కాదు కదా, అసలు వాటిని నేరాలుగా గుర్తించడమే జరగలేదు! ఈ విషయంపై మనం దృష్టి నిలపాల్సిన అవసరమెంతైనా ఉందని నేను విశ్వసిస్తున్నాను. ఏమంటే ప్రపంచం నేడున్న విధంగా ఉండటానికి, ఈ వాస్తవాలకు మధ్య అవినాభావ సంబంధం ఎంతైనా ఉంది.

ఒక సార్వభౌమదేశాన్ని ప్రత్యక్షంగా ఆక్రమించుకోవడం ఎప్పుడూ అమెరికాకు ఏమంత ఇష్టమైన విధానం కాదు. ప్రధానంగా అది తక్కువ స్థాయి ఘర్షణ అనేదాన్ని ఇష్టపడుతుంది. దీని అర్థం ఏమంటే వేలాది మంది చనిపోతారు గాని ఒక్కసారిగా బాంబు వేసిన దానికంటే నెమ్మదిగా చనిపోవడం జరుగుతుంది. అంటే మీరు ఆ దేశాన్ని విషపూరితం చేస్తారు. ఒక కాన్సర్ వ్యాధి క్రిమిని సృష్టించి వదులుతారు. జనం లొంగిపోయాక లేదా చంపివేయబడ్డాక మీ స్నేహితులు అంటే సైనికాధికారులు, బడా

— — — — * * * — — — —

**నా వాదన ఏమిటంటే ఇదే కాలంలో అమెరికా పాల్పడిన నేరాలు సరిగా రికార్డు కాలేదు. అమెరికా నేరాలు చేసినట్టు అంగీకరించడం కాదు కదా, అసలు వాటిని నేరాలుగా గుర్తించడమే జరగలేదు! ఈ విషయంపై మనం దృష్టి నిలపాల్సిన అవసరమెంతైనా ఉందని నేను విశ్వసిస్తున్నాను. ఏమంటే ప్రపంచం నేడున్న విధంగా ఉండటానికి, ఈ వాస్తవాలకు మధ్య అవినాభావ సంబంధం ఎంతైనా ఉంది.**

— — — — * * * — — — —

కార్పొరేషన్లు రంగ ప్రవేశం చేసి సుఖంగా అధికార పీఠాలపై కూచుని కెమెరాల ముందుకెళ్లి ప్రజాస్వామ్యం పరిఢవిల్లిందంటూ ప్రకటనలు చేస్తారు. ఇది అమెరికా విదేశాంగ విధానంలో సర్వసాధారణమైన విషయం.

నికరాగ్వాలో జరిగిన విషాదం ఈ విషయంలో ప్రత్యేకంగా చెప్పుకోదగినది.. 1980లో లండన్‌లోని అమెరికా రాయబార కార్యాలయంలో నేను వున్నాను. అక్కడి వామపక్ష ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న కాంట్రా విప్లవ ప్రతీఘాతకులకు మరింత డబ్బు ఇవ్వాలా అనే విషయమై అమెరికా కాంగ్రెస్ ఆలోచిస్తున్నది. నికరాగ్వా తరఫున మాట్లాడేందుకు వెళ్లిన ప్రతినిధి వర్గంలో నేనూ వున్నాను. అయితే ఆ ప్రతినిధి వర్గంలో అత్యంత ముఖ్యుడు ఫాదర్ జాన్ మెట్కాఫ్. అమెరికా పక్షానికి నాయకుడు రేమాండ్ సిట్జ్. తాము నిర్వహించే పాఠశాలను, ఆరోగ్య కేంద్రాన్ని కాంట్రాలు ధ్వంసం చేశారని, నర్సులపై అత్యాచారాలు జరిపారని చెబుతూ వారికి మీ సహాయం నిలిపి వేయండి అని ఫాదర్ మనవి చేశారు. చాలా మర్యాదస్తుడుగా, బాధ్యతాయుతమైన ఆధునికుడుగా పేరు పొందిన రేమాండ్ ఏమన్నాడంటే' ఫాదర్, మీకో మాట చెబుతాను. యుద్ధంలో అమాయకులు నష్టపోవడం ఎప్పుడూ జరుగుతుంటుంది' అని. ఆ మాటలతో అక్కడ ఒక్కసారిగా మౌనం రాజ్యం చేసింది.

నిజమే, అమాయకులు ఎప్పుడూ బలవుతుంటారు.

చివరకు ఎవరో అన్నారు. ఇక్కడ అమాయకులు మీ సహాయం పొందుతున్నవారి వల్ల బలవుతున్నారు అని. మీరు చెప్పిన విషయాలు వాస్తవాలని నేను అంగీకరించడం లేదు అన్నాడు రేమాండ్. మేము ఆ రాయబార కార్యాలయం నుంచి వచ్చేస్తుండగా అక్కడి అధికారి ఒకరు నా నాటకాలు తాను చూసి ఆనందిస్తుంటానని అన్నాడు. నేనేమీ మాట్లాడలేదు. నికరాగ్వాను పాలించిన వామపక్ష శాండినిస్టాలు లోపరహితులని నేను చెప్పడం లేదు. కాని వారు తెలివైన వారు, హేతుబద్ధమైన వారు. నాగరికులు. ఒక స్థిరమైన బహుళత్వం గల, హుందా అయిన వ్యవస్థను నెలకొల్పేందుకు ప్రయత్నించారు. గొప్ప అక్షరాస్యతా ఉద్యమం నడిపారు. లక్ష కుటుంబాలకు భూమిపై హక్కులిచ్చారు. ఇలాటి అనేక మంచి చర్యలు చేపట్టారు. కాని అమెరికా మార్క్సిస్టు లెనినిస్టు కుట్రగా దాన్ని ఖండించింది. వారి ఉద్దేశంలో నికరాగ్వా చూపుతున్న ఆదర్శం ప్రమాదకరమైంది! చుట్టుపక్కల దేశాలు కూడా అదే మార్గం అనుసరించాలని చూస్తాయి. అప్పటికే పక్కనున్న ఎల్‌సాల్వడార్‌లో యథాతథ స్థితి వద్దంటూ తీవ్రమైన ప్రతిఘటన మొదలైంది. మన చుట్టూ వున్న అబద్ధాలను గురించి నేను చెప్పాను. అధ్యక్షుడు రీగన్ నికరాగ్వా నిరంకుశ కుహరం అని తిట్టిపోశాడు. మీడియా కూడా మొత్తంపైన అదే ప్రచారం చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం సరేసరి. కాని అందుకు ఎలాటి ఆధారాలు లేవు. అక్కడ హంతక దళాలు లేవు. చిత్ర హింసల తాలూకూ చిట్టాలు లేవు... నిజంగా చెప్పాలంటే అలాటివి పక్కనే ఎల్‌శాల్వడార్‌లో, గ్వాటిమాలాలో వున్నాయి. గ్వాటిమాలాలో ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని అమెరికా 1954లో కూలదోసింది. ఆ తర్వాత వెంట వెంట వచ్చిన సైనిక నియంతల చేతుల్లో 2 లక్షల మంది బలయ్యారు. ప్రపంచంలో అత్యంత ప్రతిభావంతులైన ఆరుగురు జెసూట్లను 1989లో అమెరికాలో శిక్షణ పొందిన సాయుధ దళాలు శాన్‌శాల్వడార్ విశ్వ విద్యాలయంలో దారుణంగా కాల్చిచంపారు. సాహసవంతుడైన ఆర్కిబిషప్ రోమిరోను సామూహిక ప్రార్థన చేస్తుండగానే చంపేశారు. వారినెందుకు చంపేశారు? ఎందుకంటే వారు మరింత మెరుగైన జీవితం సాధ్యమేనని,అందుకోసం కృషి చేయాలని చెప్పారు గనక. అలా అనుకున్న మరుక్షణం వారు కమ్యూనిస్టుల్లా కనిపించడం మొదలెట్టారు... చివరకు ఎట్టకేలకు అమెరికా శాండినిస్టా ప్రభుత్వాన్ని గద్దెదించగలిగింది. దానిపై మొదట్లో కొంత

ప్రతిఘటన వచ్చినా కొన్నేళ్ల తర్వాత ముప్పైవేల మందిని బలి,ఆర్థిక వేధింపులు సాగిన తర్వాత చివరకు నికరాగ్వా ప్రజల స్థయిర్యం దెబ్బ తినింది... అలసిపోయి మరో సారి దారిద్ర్యం కోరల్లో చిక్కారు. ఆ వెంటనే కాసినోలు వచ్చేశాయి. ఉచిత విద్య వైద్యం అదృశ్యం. బడా వ్యాపారం మరింత కక్షగా పున:ప్రవేశం చేసింది. ప్రజాస్వామ్యం ప్రవర్థిల్లింది!

అయితే ఈవిధానం మధ్య అమెరికాకే పరిమితమైంది కాదు. ప్రపంచ మంతటా సాగుతున్న ఒక నిరంతర పోకడ.

ద్వితీయ ప్రపంచ యుద్ధమనంతరం ప్రపంచవ్యాప్తంగా మితవాద సైనిక నియంతృత్వాలన్నిటికీ అమెరికా మద్దతు నిచ్చింది. నియంతలు అధికారంలోకి రావడానికి తోడ్పడింది. ఇండోనేషియా, గ్రీస్, ఉరుగ్వే, బ్రెజిల్, పరాగ్వే, హైతీ, టర్కీ ఫిలిప్పీన్స్, గ్వాటెమాల, ఎల్ సాల్వడార్, చిలీల గురించి నేను ప్రస్తావిస్తున్నాను. 1973లో చిలీ సైనిక నియంతల పాలు కావడంతో అమెరికా పాత్రను చరిత్ర ఎన్నటికీ క్షమించదు. ఈ దేశాలలో వేలాది ప్రజలు హతమారిపోయారు. మరెందరో మటుమాయమయ్యారు. ఇది వాస్తవం కాదా? అమెరికా విదేశాంగ విధానమే ఇందుకు కారణమా? అవును. అయితే ఈ విషయం మీకు తెలియకపోవచ్చు. అది సంభవించదు. ఏదీ ఎన్నడూ సంభవించదు. సంభవించినప్పుడు కూడా అది సంభవించడం జరగదు. ఇది చెప్పుకోదగిన విషయం కాదు. ఆసక్తి కలిగించని విషయం అమెరికా నేరాలు ఉద్దేశపూర్వకమైనవి. నిరంతరాయమైనవి. పశ్చాత్తాపం లేనివి. అయినప్పటికీ కొద్దిమంది మాత్రమే వాస్తవంగా వాటి గురించి మాట్లాడారు. మానవాళి శ్రేయస్సు పేరిట ప్రపంచవ్యాప్తంగా పలు దేశాలను తన నియంత్రణ లోకి తెచ్చుకొంది. అమెరికా విజయం ప్రతిభావంతమైనది, చమత్కార మైనది, సమ్మోహనపూరితమైనది.

అమెరికన్ అధ్యక్షులు చేసే ప్రసంగాలు వినండి. 'అమెరికన్ ప్రజలు' గురించి వారి ఉద్ఘాటనలను నిశితంగా గమనించండి. 'అమెరికన్ ప్రజల హక్కులను రక్షించు కోవాల్సిన సమయమాసన్నమయిందని అమెరికన్ ప్రజలకు చెబుతున్నారు. మీ అధ్యక్షుడిని విశ్వసించండని అమెరికన్ ప్రజలను అడుగుతున్నాను. అమెరికన్ ప్రజల తరఫున ఆయన తీసుకొనే చర్యలను

— — — — — * * * — — — — —

**మనం నైతిక స్పృహను కోల్పోయామా? అసలు మనకు వివేక ముందా? అంతరాత్మ అనేది ఉందా? మన స్వంత చర్యల గురించి కాక, ఇతరుల చర్యలలో మన పాలు గురించి కూడా అంతరాత్మ పట్టించుకోదేం? గ్వాంటెనామో బే జైలును చూడండి. వందలాది ఖైదీలు గత మూడేళ్ళుగా ఎటువంటి ఆరోపణలు లేకుండానే ఆ జైలులో మగ్గుతున్నారు. ఆ జైలు జెనీవా ఒప్పందానికి పూర్తిగా విరుద్ధం. అయినా దానిని సహిస్తున్నాము. 'అంతర్జాతీయ సమాజం' గురించి అమెరికా ఆలోచిస్తుందా? లేదు. 'స్వేచ్ఛా ప్రపంచానికి నేత'నని చెప్పుకొంటున్న దేశం పాల్పడుతున్న ఘోరమిది.**

— — — — — * * * — — — — —

విశ్వసించం డని అమెరికన్ ప్రజలను కోరు తున్నాను.' ఆలోచించే శక్తిని రూపుమాపడానికే వాస్తవంగా ఇటువంటి భాషను ఉపయోగించడం జరుగుతుంది. 'అమెరికన్ ప్రజలు' అనే పదాన్ని పదే పదే పునశ్చరణ చేయడం ద్వారా వారికొక భరోసా కల్పిస్తు న్నారు. ఇక ఆలోచించనవసరమే లేదు. ఆ భరోసాతో హాయిగా ఉండవచ్చు. అయితే ఇది దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్న నాలుగు కోట్ల మంది ప్రజలకు, అమెరికా వ్యాప్తంగా వివిధ జైళ్ళలో ఉన్న ఇరవై లక్షల మంది ఖైదీలకు ఈ భరోసా వర్తించదు.

మనం నైతిక స్పృహను కోల్పోయామా? అసలు మనకు వివేకముందా? అంతరాత్మ అనేది ఉందా? మన స్వంత చర్యల గురించి కాక, ఇతరుల చర్యలలో మన పాలు గురించి కూడా అంతరాత్మ పట్టించుకోదేం? గ్వాంటెనామో బే జైలును చూడండి. వందలాది ఖైదీలు గత మూడేళ్ళుగా ఎటువంటి ఆరోపణలు లేకుండానే ఆ జైలులో మగ్గుతున్నారు. ఆ జైలు జెనీవా ఒప్పందానికి పూర్తిగా విరుద్ధం. అయినా దానిని సహిస్తున్నాము. 'అంతర్జాతీయ సమాజం' గురించి అమెరికా ఆలోచిస్తుందా? లేదు. 'స్వేచ్ఛా ప్రపంచానికి నేత'నని చెప్పుకొంటున్న దేశం పాల్పడుతున్న ఘోరమిది. గ్వాంటనామో బే వాసుల గురించి మనమెప్పుడైనా ఆలోచించామా? మీడియా వారి గురించి చెబుతున్నదేమైనా ఉందా? ఆ ఖైదీలు ఇక తిరిగి రాని వారుగానే పరిగణించడం లేదా? ఆ ఖైదీలను చి[illegible] గురిచేస్తున్నారు. వారిలో బ్రిటిష్ పౌ[illegible] ఉన్నారు. మరి బ్రిటిష్ విదేశాంగ మంత్రి వా[illegible] గురించి ఏమి చెప్పారు? ఏమీ చెప్పలేదు. బ్రిటిష్ ప్రధానమంత్రి ఏమి చెప్పారు. ఏమీ చెప్పలేదు. ఎందుకని? గ్వాంటెనామో బేలో తమ వ్యవహారాలను విమర్శించడం స్నేహపూరిత చర్య కాబోదని అమెరికా స్పష్టంగా చెప్పింది. మీరు మాతో ఉండకపోతే మాకు వ్యతిరేకంగా ఉన్నట్లేనని తేల్చివేసింది. కనుకనే టోనీ బ్లెయిర్ నోరు మూసుకున్నారు.

ఇరాక్ ఆక్రమణ ఒక బందిపోటు చర్య. ఉగ్రవాద దాడి. అంతర్జాతీయ న్యాయాన్ని ఎటువంటి మినహాయింపులు లేకుండా ఉల్లంఘించడమే. సంపూర్ణ అబద్ధాలతో మీడియా ద్వారా ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసి నిర్హేతుకంగా ప్రదర్శించిన సైనిక ప్రతాపం. పశ్చిమాసియా, అరబ్ దేశాలపై సంపూర్ణ సైనిక, ఆర్థిక నియంత్రణను సాధించే లక్ష్యంతోనే ఇరాక్‌ను ఆక్రమించుకోవడం జరిగింది. అయితే ఒక నియంత పాలన నుంచి ప్రజలకు విముక్తి కలిగిస్తున్నామనే సాకు చూపారు. ఈ 'విముక్తి'లో వేలాది అమాయకులు హతమయ్యారు. లక్షలాది ఇరాకీలు క్షతగ్రాతులయ్యారు. ఇంకెందరో చిత్రవధలకు గురవుతున్నారు. ఇరాక్‌లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించామని, ఆ దేశ ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల్పించామని చెబుతున్నారు!

ఈ విషయంలో మృత్యువు అన్నదానికి ఏ విలువా లేదు. బుష్, బ్లెయిర్ ఉభయులూ మారణకాండను పట్టించుకోరు. కనీసం లక్ష మంది ఇరాకీలు అమెరికా బాంబులు, క్షిపణుల దాడిలో మరణించారు. వీరి ప్రాణాలకు ఏ విలువా లేదు. వారు చనిపోయినట్టు కూడా నమోదు కాదు. 'మేము శవాల లెక్కలు వేయం' అన్నాడు అమెరికా జనరల్ టామీ ఫ్రాంక్స్... దాడి తొలిదశలో ఒక బ్రిటిష్ పత్రిక మొదటి పేజీలో టోనీ బ్లెయిర్ ఒక ఇరాకీ బాలుడిని ముద్దాడుతున్న ఫోటో ప్రచురించింది. 'బాలుని కృతజ్ఞత' అని దానికింద రాసింది. తర్వాత కొన్నాళ్లకు మరో ఫోటో వచ్చింది. ఈ బాలుడికి చేతులు లేవు. వాళ్ల కుటుంబం క్షిపణి దాడిలో సర్వనాశనమై పోగా వాడొక్కడే మిగిలాడన్న కథనం కూడా దానితో పాటు ప్రచురితమైంది. 'నాకు నా చేతులు తిరిగి ఎప్పుడొస్తాయి' అని వాడు

అడిగాడు. ఈ కథ చల్లగా తొలగింప చేయబడింది. ఔను కదా!టోనీ బ్లెయిర్ వాడిని అక్కున చేర్చుకోలేదు. అసలు క్షతగాత్రుడైన పిల్లాడెవరినీ ఆయన దగ్గరికి రానివ్వడు. దిక్కులేని శవాలను అంటుకోడు. రక్తం ఎంత అసహ్యకరమైంది? అది మీ చొక్కాను మురికి మురికిచేసి మీరు టెలివిజన్‌లో ఎంతో గొప్పగా ఇస్తున్న ప్రసంగాన్ని ఖరాబు చేస్తుంది.

ఇక 2000 అమెరికన్లు చనిపోవడం చికాకైన విషయం. వారిని చీకట్లో సమాధుల వద్దకు చేర్చాలి.. చడీ చప్పుడు కాకుండా అంత్యక్రియలు జరిగిపోవాలి. క్షతగాత్రులైన వారు జీవిత పర్యంతం మంచాలపై మగ్గిపోవాలి. చనిపోయిన వారూ, గాయాలపాలైన వారూ మగ్గిపోవలసిందే. పద్ధతులే వేరు.

ఇక్కడ నేను పాబ్లో నెరూడా కవిత ఒకటి పేర్కొంటాను. దాని ద్వారా చాలా విషయాలు తెలుస్తాయి:

**ఒకానొక ఉదయం అంతా తగలబడిపోతోంది**
**అదో మహాగ్ని కీల**
**భూమండలంపై విరుచుకుపడింది**
**మానవాళిని కబళించేయసాగింది**

**ఇక అప్పటి నుంచి మంటలే**
**అప్పటి నుంచి మందుగుండే**
**అప్పటి నుంచి నెత్తుటి ధారలే**

**విమానాలు, నావలు గల బందిపోట్లు**
**ఉంగరాలు, దొరసానులను**
**వెంట పెట్టుకున్న బందిపోట్లు**
**ఆశీర్వదించే సాధుసంతుల**
**వెంటవున్న బందిపోట్లు**
**ఆకాశంలో నుంచి వచ్చారు**
**చిన్నారులను హతమార్చేందుకు**
**పసికందుల నెత్తురు వీధుల్లో ఏరులై పారింది**
**చడీ చప్పుడు లేకుండా పిల్లల నెత్తురు లానే**
**నక్కలు కూడా అసహ్యించుకునే నక్కలు**
**బ్రహ్మ జెముళ్లు కూడా భరించలేని బండరాళ్లు**
**నల్ల తాచులు కూడా చీత్కరించే నల్లతాచులు**

**నీవు తారసపడ్డాకే నేను నెత్తురు**
**స్పెయిన్ శిఖరంలా ఎగిసిపడడం చూశాను**
**అభిమానం, కత్తుల వరదలో ఒక్కసారిగా**
**మీరు మునిగిపోతారు**
**విద్రోహపూరిత**
**సైనాధిపతులు**
**నా భూత గృహాన్ని సందర్శిస్తారు**
**శిథిలమైన స్పెయిన్‌నుచూస్తారు**
**ధగ్ధమైన ప్రతిఇంట్లోంచీ**
**కాలుతున్న లోహపు మంటలు**
**స్పెయిన్‌లోని ప్రతి కుంపటిలోంచీ**
**పూలకు బదులు మంటలు**
**స్పెయిన్ తిరిగి లేస్తుంది**
**ప్రతి మృత శిశువులోంచీ**
**తుపాకీలు కళ్లలో పెట్టుకుని లేస్తుంది**
**నేరస్తుల తూటాలలోంచీ జీవితం ప్రభవిస్తుంది**
**అదే ఒకనాటికి**
**మీ గుండెలు చీలుస్తుంది**
**మీరడుగుతారు: ఆయన కవిత్వం**
**కలలు ఆకుల గురించి గాక**
**తన దేశపు మహాగ్ని పర్వతాల గురించి లేదేం**
**రండి,వీధుల్లో పారే రక్తం చూడండి**
**రండి చూడండి**
**వీధుల్లో రక్తం**
**రండి చూడండి**
**వీధుల్లో రక్తం**

నేనొక విషయం చెప్పాలి. నెరూడా కవితను చెబుతున్నానంటే సద్దాం ఇరాక్‌ను నాటి స్పెయిన్‌ను పోలుస్తున్నానని కాదు.పౌరులపై బాంబుదాడి భయానకత్వాన్ని అంత శక్తివంతంగా వర్ణించిన పద్యం నేనెక్కడా చదవలేదు కనకే దాన్ని పేర్కొన్నాను.

అమెరికా ఇప్పుడు తన విధానాన్ని బాహాటంగానే ప్రకటిస్తోంది. సర్వసంపూర్ణ ఆధిపత్యం తన లక్ష్యమంటోంది. సర్వ సంపూర్ణంగా. అది ఇప్పుడు ప్రపంచ వ్యాపితంగా132 దేశాలలో 702 సైనిక స్థావరాలను కలిగివుంది. స్వీడన్ ఒక్కటే ఇందుకు గౌరవనీయమైన మినహాయింపు. ఇన్ని చోట్లకు వారెలా చేరగలిగారన్నది ఆశ్చర్యమే. ఏమైనా వారు చేరారు. దాని దగ్గర గట్టిగా పనిచేసేఅణుబాంబులు 8000 వున్నాయి.రెండు వేల బాంబులు పావుగంటలో ప్రయోగించేంత సర్వసిద్ధంగా వున్నాయి. ఇప్పుడది రక్షణ కందకాలను ధ్వంసం చేయగలసరికొత్త అణ్వాస్త్రాల తయారీలో నిమగ్నమై వుంది. వారికి సహకరించేందుకు సదా సంసిద్ధమనే బ్రిటిష్ వారు తమ అణ్వాస్త్రాలను కూడా మార్చి కొత్తవి పెట్టమని అడుగుతున్నారు. ఇంతకూ ఇవన్నీ ఎవరిపైకి ఎక్కుపెడుతున్నారని నాకు సందేహం కలుగుతుంటుంది. ఒసామా బిన్‌లాడెన్‌పైనా? మీ పైనా? నా పైనా? చైనాపైనా? పారిస్ పైనా? ఎవరికి తెలుసు? ఇదో బాల్యాంక విపరీతమని మాత్రం మనకు తెలుసు. అణ్వస్త్రాలు కలిగివుండటం, వాటిని ఉపయోగిస్తా మని బెదిరించడం.. ఇదే ఇప్పటి అమెరికా రాజకీయ తాత్వికతకు మూలసూత్రం... అమెరికాలో లక్షలాది మంది తమ ప్రభుత్వ చర్యల పట్ల ఆగ్రహావేశాలతో వున్నారు. మనస్సు కష్టపెట్టుకుంటున్నారు.కాని వారింకా ఒక రాజకీయ శక్తిగా వున్నట్టు కనిపించదు. అయితే ఈ ఆందోళన, అనిశ్చితి,భయం రోజురోజుకూ పెరుగుతున్నదే గాని తగ్గే సూచనలు లేవు.

ఒక రచయిత జీవితం దుర్భలమైనది. అది దాదాపుగా అనావృత కార్యకలాపం. దాని గురించి మేము రోదించనవసరం లేదు. రచయిత ఒక నిర్ణయం తీసుకుంటాడు. దానికి కట్టుబడి ఉంటాడు. అయితే అన్ని పవనాలు నిన్ను తాకుతాయనడం చెప్పడంలో సత్యం ఉంది. ఆ పవనాలలో కొన్ని శీతవాయువులు సుమా. నీవు నీ సొంతంగా వాటిని తట్టుకోవాలి. ఎలాంటి ఆశ్రయమూ నీకు దొరకదు. రక్షణ ఉండదు - అబద్దాలాడితే తప్ప. అటువంటి పరిస్థితిలో నీవు నీ రక్షణ చేసుకోవాలి. ఇందుకై నీవు రాజకీయవేత్తవు కావచ్చు. అద్దంలోకి చూసినప్పుడు మన ఎదుట ఉన్న ప్రతిబింబం కచ్చితమైనదని భావిస్తాము. అయితే ఒక మిల్లీమీటరు కదలండి. ప్రతిబింబం మారి పోతుంది. వాస్తవంగా దరీదాపులేని ప్రతిబింబాల వైపు చూస్తున్నాము. అయితే కొన్నిసార్లు రచయిత అద్దాన్ని పగులగొట్టవలసి వస్తుంది. ఏమంటే అద్దానికి ఆవలివైపున ఉన్న సత్యం మనలను తేరిపార చూస్తుంటుంది. మన మేధో కట్టుబాటు ఎంత దృఢమైనదైనా, అచంచల మైనదైనా, నిష్కాపటమైనదైనా, పౌరులుగా మన జీవితాలు, మన సమాజాల నిజమైన సత్యాన్ని నిర్వచించవలసి ఉన్నదని నేను విశ్వసిస్తున్నాను. ఇదెంతో బృహత్తర బాధ్యత. దీనిని నిర్వర్తించడం మన విధి. మన రాజకీయ దార్శనికతలో ఇటువంటి కర్తవ్యానికి తావు లేనప్పుడు, మనం దాదాపుగా కోల్పోయిన మానవ హుందాను పునరుద్ధరించ గలమని ఆశాభావానికి ఆస్కారమూ లేదు.

*

# సాహిత్య సభలంటే చిన్నచూపేల?

అక్టోబర్ 24వతేదీ ఆంధ్రజ్యోతి వివిధ పేజీలో 'ఇవి సాహిత్య సభలా?' శీర్షికన సౌభాగ్య పేరుతో రాసిన వ్యాసానికి స్పందన ఇది. ఆ వారమే దీనిని పంపించాను. రచయిత పేర్కొన్నారు. సమకాలీన సాహితీ సృజనకు, చర్చకు సముచిత స్థానం కల్పిస్తున్న 'ప్రస్థానం'లోనైనా దీనికి చోటు కల్పించాలని ఆయన కోరారు.

**- సంపాదకులు**

ఆంధ్ర దేశంలో సాహిత్య సభలపై 'వివిధ' పేజీలో సౌభాగ్య గారి విశ్లేషణ విశృంఖలతకు పరాకాష్ట. ఇటువంటి రాతలకు స్పందించాల్సిన అవసరం లేదని అన్పించినా అటువంటి సాహిత్య సభలకు ఆర్తిగా హాజరౌతున్న పాపానికి ఇది రాయక తప్పడం లేదు. నాలాంటి సగటు సాహిత్యాభిమానులందరినీ కించపరిచే విధంగా సాగిన ఇటువంటి విచ్చలవిడి పోకడలతో కూడిన రాతలకు 'వివిధ' వంటి మంచి పేరున్న పేజీలో చోటు లభించడం మరీ ఆశ్చర్యం కలిగించింది. సౌభాగ్యగారి అక్కసుకు నిష్కారణంగా కారణమైన రెండు మూడు అంశాలను మనం చర్చించడం అవసరం. ఆ సభలను నిర్వహిస్తున్న వారిపైనా, హాజరైన సాహిత్యకారుల పైనా, సాహిత్యాభిమానులపైనా మొత్తంగా అందరిపైనా నిందాపూర్వకమైన ఆరోపణల వర్షం కురిపించారు. ఇందులో వాడిన భాష ఇది విమర్శే కదా అనుకోవడానికి కూడా ఆస్కారం లేకుండా చేసింది.

మొదటగా హాజరైన మాపై జరిగిన దాడిని చూద్దాం. నిర్వాహకులకు పార్టీ మూలాలు ఉంటే ఉండనీయండి మాకేంటి?. వారి పార్టీలో చేరాల్సిందిగా కుర్చీలకు కట్టేసి మమ్మల్నేమీ వారు బలవంతం చేయట్లేదు. మాకు ఆ తరహా పాఠాలేమీ చెప్పడంలేదు. ఆ పార్టీ వారిపైనో, లేదా నిర్వాహకులపైనో అక్కసుకు మాత్రమే ఆ రాత అద్దం పట్టింది. సమకాలీన సాహిత్య రంగంలో వస్తున్న మార్పులు, అభ్యుదయ రచనలు, తిరోగామి పోకడల గురించి ఉన్నంతలో వారు పరిశీలించిన మేరకు, వారి కృషి మేరకు వివరించే ప్రయత్నం ఈ సభల్లో చేస్తున్నారు. ఇటువంటి సభలు నిర్వహించడానికి, కాస్తంత సమయం వెచ్చించి వస్తున్న సాహిత్యకారులందరినీ ఒక్కతాటిపైకి తీసుకురావడానికి నిర్వాహకుల కృషిని అభినందించకపోతే పోయారు. ఇటువంటి రాతలతో నిందా ప్రచారం ఎందుకు? హాజరౌతున్న వారంతా ప్రత్యేకంగా తీసుకొచ్చిన కార్యకర్తలేనని మరో ఆరోపణ. నాకు నా చుట్టూ కూర్చున్న చాలామందికి అటువంటి రంగులేవీ లేవు. వాటిని ఉద్దేశపూర్వకంగా అద్దే ప్రయత్నం ఎందుకు? రోజుల తరబడి అంతమందిని ఒకే చోట కట్టి పడేస్తున్నది వారు పెడుతున్న భోజనాలు, ఇస్తున్న టీ కాఫీలేనా? పూటకు పట్టెడన్నం సంపాదించుకోలేని వారమని, గతిలేని వారమన్నట్లు మాపైన అలా యథేచ్ఛగా వ్యాఖ్యలు చేయడానికి ఎవరు అధికారమిచ్చారు? నచ్చని అంశాలేమైనా ఉంటే ప్రస్తావించవచ్చు గానీ వ్యక్తిగత దూషణలకు పూనుకోవడం సంస్కారమనిపించు కుంటుందా? పూటగడవని కవులు భోజనాల కోసం వస్తున్నారంటూ విశృంఖల వ్యాఖ్యలు చేశారు. సాహితీకారులుగా కాకున్నా సాటి మనుషులను సగౌరవంగా చూడాలన్న దృష్టి కూడా లేకపోవడం జుగుప్స కల్గిస్తున్నది.

సమాజంలోని కుళ్లును కడిగెయ్యడానికి వారు కంకణం కట్టుకుంటారంటూ ఎద్దేవా చేయడం బాగానే ఉంది. మరి ఇటువంటి రాతలతో చేసున్నదేమిటి? కుళ్లును కడిగెయ్యడం ఇలాంటి వారి వద్ద నుండే ప్రారంభించాలన్న విషయం మాత్రం ఈ రచన చదివాకే అర్థమయింది. సాహితీకారులను ఒకడు, ఒకడు అంటూ ఏకవచనంతో సంబోధించడం, జుట్టుకు రంగులేసుకుంటారని వ్యంగ్యంగా వ్యక్తిగత వ్యాఖ్యలు చేయడం ఏ ప్రయోజనాలనాశించి? సాహిత్యకారులుగా నిర్బంధ 'గుర్తింపు' సాధించిన వాళ్లే వీళ్లంతా అన్న వ్యాఖ్య పరమార్థం ఏమిటో మీకే తెలియాలి. అటువంటి ప్రయత్నమేదైనా చేసి విఫలమైతేనే అనుభవపూర్వకంగా అంత సాధికారికంగా వ్యాఖ్యానించగలుగుతారు.

సాహిత్య వృద్ధ అకడమీషియన్లు, వృద్ధ సాహిత్య అకడమీషియన్లు అంటూ తోచినట్లు అర్థంపర్థం లేకుండా వ్యాఖ్యలు చేశారు. సాహిత్యానికి కొత్తరక్తం ఎక్కించడానికి వీరు వేదికలనలంకరిస్తారని మరో వ్యాఖ్య. నవతరం జవసత్వాలను నిర్వీర్యం చేస్తున్న నేటి ప్రపంచీకరణ యుగంలో లెక్కకు మిక్కిలిగా పుట్టుకొస్తున్న విశృంఖల రచనలను వెనక్కు కొట్టడం కోసం, జనానికి మేలు చేయడం కోసం ముందుకొచ్చే కొత్త కొత్త ఆలోచనలను అణచిఉంచాలన్నది అభిప్రాయమా? "వృత్తిలో అంచెలంచెలుగా ఎదిగి ఎదగడానికి వయసు అనుమతించనపుడు పదవుల్నించి దిగిపోయిన ఈ అకడమీషియన్లు చిద్విలాసంగా జనానికి చైతన్యం గురించి కపటమైన కబుర్లు చెబుతారు" అంటూ వ్యాఖ్యానించారు. మీ లక్ష్యం ఎవరు?. చైతన్యం నింపే ప్రయత్నం నేరమన్నట్లు మాట్లాడుతున్నారే ! జనంలోకి చొచ్చుకుపోవడానికి, పార్టీ శ్రేణుల్ని పెంచుకోవడానికి మాత్రమే సాహిత్యసభలు పెడతారన్నట్లు తేల్చేశారు. సాహిత్యసభలతోనే పార్టీలు బలోపేతమైపోయేటట్లయితే ఇక అన్ని పార్టీలు సాహిత్య సభలు పెట్టుకుంటే సరిపోతుంది కదా! సాహిత్య సంఘాలు ఒక రాజకీయ పార్టీకి, సిద్ధాంతానికి అనుబంధ సంస్థలుగా మారిన నాటి నుండే సాహిత్య పతనం ప్రారంభమైందని మరో విపరీత వ్యాఖ్య. ఇప్పటి వరకు అనేక సాహితీ సంఘాలు, పలువురు సాహితీకారులు జరిపిన కృషి అంతా నిష్ఫలమేనని ఒక్క వాక్యంతో తేల్చేస్తారా? ఇది అజ్ఞానానికి ప్రబల నిదర్శనంగా నిలవదా?. నిజంగా ఆలోచిస్తే మీరు చేస్తున్న ఇటువంటి రచనల(దాడుల) మూలంగానే తెలుగు సాహిత్యానికి ప్రమాదం జరుగుతోంది. తెలుగు సాహిత్యానికి హద్దులు నిర్ణయించే ఇటువంటి ప్రయత్నాన్ని ఎవరూ హర్షించరు. మీది వృథా ప్రయాసే. అనేక స్రవంతులు యథాశక్తి పరిపుష్టం చేయబట్టే తెలుగు సాహితి ఈ నాటికి ఇలాగైనా బట్టకట్టి నిలువగలిగింది. లేదంటే ఇటువంటి రాతలు, ఆలోచనలు చేసే వారి 'కృషి'తో ఏ నాడో పతనమై కనుమరుగయ్యేది. సాహిత్యకారుణ్ణి సమాజం గౌరవించే స్థాయిని ఇలాంటి చర్యలు (సాహిత్య సభల్లో పాల్గొనడం) తక్కువ చేస్తాయంటూ మీరు అర్థాలు తీశారు. అది నిజమేనని ఒప్పుకుందాం. అయితే ఇటువంటి రాతలు గౌరవాన్ని పెంచుతాయా?

(మిగతా 9వ పేజీలో)

# సాహిత్యబోయి, అక్షర భీముడు



ప్రముఖ సాహితీవేత్త, కవి, పద్మభూషణ్ బోయి భీమన్న డిసెంబర్ 16న హైదరాబాద్‌లో కన్నుమూశారు. ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధితో బాధపడుతున్న ఆయన వయసు 94 సంవత్సరాలు. తెలుగు సాహిత్య, సంస్కృతీ వికాసాలకు ఆరేడు దశాబ్దాలపాటు ఎనలేని కృషి చేసి తెలుగు సాహిత్యంలో సుస్థిర స్థానాన్ని ఏర్పరచుకున్నారు.

1911లో తూర్పుగోదావరిజిల్లా మామిడికుదురులో జన్మించిన భీమన్న కాకినాడలోని పిఠాపురం రాజా కళాశాలలో గ్రాడ్యుయేషన్ పూర్తి చేశారు. తెలుగు కవిత్వంలో ఆయన సాటిలేని పట్టు సాధించారు. విద్యార్థుల్లో ఉదాత్త విలువలకు బీజం వేసిన ఉపాధ్యాయునిగా ఎనలేని సేవలందించారు. విశ్వజనీనమైన భావావేశంతో, ఉదాత్త ప్రమాణాలతో ఆయన రచించిన కావ్యాలు బహుళ ప్రాచుర్యాన్ని పొందాయి.

పాలేరు నాటకం ఆనాటి దళిత సమాజం మీద చూపిన ప్రభావం అంతా ఇంతా కాదు. ఆ రోజుల్లో పాలేరు నాటకాన్ని ఆడని దళితవాడ లేదంటే అతిశయోక్తి కాదు. దళితుల అభ్యున్నతికి ప్రధాన ఆటంకం 'చదువులేకపోవడమే' అన్న అంబేద్కర్ సిద్ధాంతాన్ని భూమిక చేసుకున్న ఈ నాటకం పాలేరు కలెక్టర్‌గా ఎదిగిన ఒక గొప్ప సామాజిక పరిణామాన్ని ఆవిష్కరించింది. ఈ నాటకం ఆంధ్రదేశం లోని తొలి తరం దళిత ఐఎఎస్ అధికారు లను తయారుచేసిందని కవి, విమర్శకుడు శిఖామణి పేర్కొన్నారు. వివిధ కూలిరాజు నాటకం శ్రామిక దృక్పథంతో రాయబడింది. ఆంధ్రలో కుసుమ ధర్మన్నకవి, నైజాంలో భాగ్యరెడ్డివర్మ నిర్వహిస్తున్న సాహిత్య సాంస్కృతిక పోరాటాలకు ప్రత్యక్ష సాక్షి భీమన్న. కుసుమ ధర్మన్న కవి సంపాదకుడుగా రాజమండ్రి నుండి వెలువడిన జయభేరి పత్రికకు సహాయ సంపాదకుడిగా పనిచేశారు.

అంబేద్కర్ గురించి తెలుగులో అరకొర రచనలు వస్తున్న సందర్భంలో భీమన్న అంబేద్కర్ సుప్రభాతం (1984), పాటలో అంబేద్కర్ అనే కావ్యాలను రాశారు. 1944లో అంబేద్కర్ ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినప్పుడు రామచంద్రపురంలో జరిగిన సన్మానసభలో ఇంగ్లీషు కవితలు రాసి అంబేద్కర్ సమక్షంలో వినిపించారు. ఆ పద్యాలే తర్వాత కలకత్తా నుంచి వెలువడే పీపుల్స్ హెరాల్డ్ పత్రికలో సంపాదకీయంగా ప్రచురించబడ్డాయి.

దీపసభ, రాగవైశాఖి, జానపదుని జాబులు, పాలేరు, కూలిరాజు, మధుబాల, మధుగీత, భీమన్న కావ్య కుసుమాలు, రాగ చిత్రకళా ప్రదర్శనం. ప్రకృతిలో మానవ ప్రకృతి, త్రిపదలు, మానవుని మరొక మజిలీ, బాలయోగి, అకాండ తాండవం, ధర్మం కోసం పోరాటం, పిల్లి శతకం, ఏకపద్యోపాఖ్యానం, మణిమానసం, గుడిసెలు కాలిపోతున్నై, శివాలకలు, అంబేద్కర్ మతం, అంబేద్కర్ సుప్రభాతం, భీమన్న పాటల తోట, పాటలలో అంబేద్కర్ మొదలైన దాదాపు 75 గ్రంథాలకు పైగా రచించారు.

1975లో ఆయన రచన 'గుడిసెలు కాలిపోతున్నాయి' అన్న గ్రంథం కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందింది. ఆయన కావ్యాలు, కవితలు తెలుగు సాహిత్యానికి పరిపుష్టిని తెచ్చాయన్న ప్రశంస లందుకున్నాయి. దీపసభ, రాఘోదయం, మధుబాట, రాగవైశిష్టం గ్రంథాలు ఆయనకు మంచిపేరు తెచ్చిపెట్టాయి. భీమన్న సేవలను గుర్తించిన భారత ప్రభుత్వం 1973లో పద్మశ్రీ, 2001లో 'పద్మభూషణ్' బిరుదుతో సత్కరించగా, ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' డాక్టరేట్‌తో సత్కరించింది. వారణాసిలోని కాశీ విద్యాపీఠ్ 1976లో డాక్టరేట్‌ను బహూకరించి ఆయనకు కనకాభిషేకం, పుష్పాభిషేకం, కనక పుష్పాభిషేకం చేసింది. ఈ మధ్యనే ఆయన గుర్రం జాషువా పురస్కారం అందుకున్నారు. వివిధ పత్రికల్లో సబ్ ఎడిటర్, ఎడిటర్‌గా బాధ్యతలు నిర్వహించిన భీమన్న సామాజిక స్పృహ కలిగిన చైతన్యవంతమైన జర్నలిస్టుగా గుర్తింపు పొందారు. 1978 నుండి 1984 వరకూ ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యునిగా ఆయన సేవలందించారు. భార్య హైమావతి నగరంలోని పంజగుట్టలో ఉంటున్నారు. వారికి ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలున్నారు.

## సాహిత్య సభలంటే చిన్నచూపేల?

(8వ పేజీ తరువాయి)

సాహితీకారులు ఎటువంటి కార్యక్రమాల్లోనూ పాల్గొనరాదని, వైవిధ్యమైన ఆలోచనలకు ఆస్కారమివ్వరాదని సూత్రీకరించదలుచు కున్నారా? ఏ తరహా కార్యక్రమాల్లో పాల్గొనాలో మీరు నిర్దేశించదలుచుకున్నారా? చూస్తుంటే పురోగామి ఆలోచనలే మీకు కంటగింపవుతున్నట్లు కనిపిస్తున్నది. సాహితీకారులు జనంతో మమేకం కాకుండా, జనం సమస్యలు తెలుసుకోకుండా వారి మానాన వారి ధోరణిలో రచనలు చేస్తూ బావుల్లో కప్పల్లా బతికేయాలన్నది మీ కోరికా? జనంతో మమేకం కావడానికి, అభిప్రాయాలు పంచుకోవడానికి ఈ సభలు వేదికలుగా పనిచేయడం లేదా? అసలు ఆ సభల్లో సాగే ఆలోచనలతో సంఘర్షించకుండా కార్యక్రమాలపైనే మీ సంఘర్షణ అంతా సాగుతుండడాన్ని బట్టి మీరు ఏ తరహా ఆలోచనలు చేస్తున్నారో అర్థమవుతూనే ఉంది. ఒక సిద్ధాంతానికి తలవంచిన సాహిత్యకారుడికి తల ఉండదు అని కూడా మీరు సెలవిచ్చారు. అంటే ఇపుడు తల ఉన్న సాహిత్య కారులంతా సిద్ధాంత రహితులేనని, అర్థం పరమార్థం లేకుండా రచనా ప్రపంచంలో జీవచ్ఛవాల్లా బతుకులీడుస్తు న్నారని మీ విశ్లేషణ. భేష్. తెలుగు అక్షరంతో పరిచయమున్న ప్రతిఒక్కరూ మిమ్మల్ని గుర్తుంచుకోవాలి. ఆఖరుగా ఒక విన్నపం. మీరెన్ని అన్నా సాహితీకారులు ఓరిమితో భరించవచ్చు కాని అభిమానంతో సాహితీ సభలకు హాజరౌతున్న మాలాంటి వారిపై ప్రతాపం చూపడం ఇదే ఆఖరు కావాలని ఆశిస్తున్నాం.

**- పి. శ్రీనివాసరావు,**

**నాదర్‌గుల్, సరూర్‌నగర్ మండలం, రంగారెడ్డి జిల్లా**

# మనిషి



"ఏ మిత్రా వ్రాస్తున్నావు?"
"పత్రిక్కి కథ వ్రాస్తున్నాను నాన్నా"
"ఇలాంటి ఆలోచనలు కూడా నీలో పుట్టుకొస్తున్నాయా?"
"కథ వ్రాయటం తప్పేం కాదుగా నాన్నా?"

ఎస్.డి.వి. అజీజ్

"తప్పు కాదు. కాని శ్రమకు తగ్గ ఫలితం ఉండదు. వారం రోజుల నుంచి గమనిస్తున్నాను. టెక్స్ట్ బుక్స్ పక్కన పడేసి తెల్ల కాగితాల్ని నలుపు చేస్తూ వుండలుగా చుట్టి విసిరేస్తున్నావు. మరి కథ పూర్తయ్యిందా?"

"కాలేదు నాన్నా! సరిగా కుదరటం లేదు. ఇంకో రెండు, మూడు రోజుల్లో పూర్తి చెయ్యాలి. చేస్తాను."

"ఆఁ... చేసి"

"పత్రిక్కి పంపిస్తాను"

"పత్రిక వాళ్ళకు నీ కథ నచ్చాలి. నచ్చకపోతే, ఇన్ని రోజుల నీ శ్రమ దండగ. ఒకవేళ నచ్చిందనుకో! వాళ్ళు ఎప్పుడో ప్రచురిస్తారు. ప్రచురించినా ఒక్కోమారు పారితోషికం పంపరు. పంపినా పదో పరకో పంపిస్తారు. అంటే నీ కథ అచ్చయినా నీకొచ్చే ప్రతిఫలం ఎంత? పది రూపాయలు. లేదా పాతిక రూపాయలు. అదీ నువ్వు ఓ పది రోజులు కష్టపడినందుకు. ఇదే పది రోజులు నువ్వు కాలేజీకి వెళ్ళటం మానేసి ఏదైనా కూలి పనికి వెళ్ళావనుకో. రోజు పది రూపాయలు ఇస్తారు. పది రోజులకు వంద రూపాయలు. అదీ శ్రమకు తగ్గ ఫలితం కాక పోయినా వెంటనే డబ్బన్నా చేతికి అందుతుంది. మరి ఇదో... నువ్వే ఆలోచించు!"

"ఇంతకు ఏమిటి నాన్నా మీరు చెప్పేది?"

"ఇంకా అర్థం కాలేదా? ఇలాంటి పిచ్చి రాతలు ఇంకెప్పుడూ వ్రాస్తూ కూర్చోకు. ఇవి కూడు పెట్టేవి కావు. శ్రద్ధగా చదువుకో! భవిష్యత్‌లో నీకు కూడు పెట్టే చదువు గురించే ఆలోచించు! మరెప్పుడైనా కథలు, కాకర కాయలు అంటూ గీకుతూ అగుపించావో వ్రేళ్ళు చీరేస్తాను. జాగ్రత్త! ఏంటా చూపు? రాసింది పక్కన పడేసి వెళ్ళి నీ టెక్స్ట్‌బుక్స్ తీసి చదువుకొంటూ కూర్చో!

* * *

"నాన్నా నేను ఎం.ఎ. చదువుతాను. నాకు లెక్చరర్ అవ్వాలని ఉంది."

"బి.ఏ. దాకా నిన్నూ, స్కూల్ ఫైనల్ వరకూ నీ ఇద్దరు చెల్లెళ్ళను చదివించే సరికే, నా తల ప్రాణం తోకకొచ్చింది. ఇక చదివించటం నా వల్ల కాదు. నేను పనిచేస్తున్న బట్టల కొట్టు ఓనర్ ద్వారా ఆ జిల్లా పరిషత్ ఛైర్మన్‌ను పట్టుకొని, అతని కాళ్ళా వేళ్ళాబడి నీకు జిల్లా పరిషత్ ఆఫీసులో గుమస్తా ఉద్యోగం వేయించేసరికి, నాకు చచ్చి స్వర్గాన ఉన్న నా తండ్రి, తాత అగుపించారు. రేపు మంచి

రోజు. వచ్చి ఉద్యోగంలో చేరమని చెప్పాడు ఛైర్మన్. వెళ్ళి చేరు!"

"అది కాదు నాన్నా"

"నువ్వేం మాట్లాడకు చెప్పింది చెయ్యి. బి.ఎ.లు, ఎం.ఎ.లు చదివినా ఉద్యోగం దొరకటం కష్టమవుతున్న రోజుల్రా ఇవి! ఈపాటి ఉద్యోగమైనా నీకు వచ్చినందుకు సంతోషించు! అర్థమయ్యిందా?... మాట్లాడవేం? అలా మౌనంగా నోరులేని వెధవలా వుండిపోతే ఎలా? ఊ కొట్టు?

* * *

"ఇదన్యాయం నాన్నా! అరెరె... కనీసం పెళ్ళాడే అమ్మాయిని నాకు చూపకుండానే, నా అభిప్రాయంతో నిమిత్తం లేకుండావే, అమ్మ, నువ్వూ వెళ్ళి పిల్లను చూడ్డం, ఏకంగా పెళ్ళి కూడా నిశ్చయం చేసుకొని రావడం చేస్తే మరి నేను దేనికి?"

"మేము చూసొచ్చిన ఆ పిల్ల మెళ్ళో తాళికట్టి కాపురం చేయడానికి"

"అమ్మాయి నాకు నచ్చకుండానే తాళి కట్టెయ్యమంటారా?"

"నేను మీ అమ్మ మెళ్ళో కట్టలేదా? నేనేం ముందుగా మీ అమ్మను చూసి వచ్చి పెళ్ళాడలేదే? పెద్దవాళ్ళు వెళ్ళి చూసొచ్చారు. పెళ్ళి రోజున వెళ్ళాము. మా నాన్న తాళి కట్రా అన్నాడు. మారు మాటాడకుండా కట్టేశాను. నువ్వూ ఇప్పుడు అలా కట్టెయ్?"



"మీ రోజులు వేరు. ఈ రోజులు వేరు. పిల్లల అభిప్రాయాలకు, ఆలోచనలకు విలువ ఇవ్వకపోతే ఎలా?"

"ఏంట్రా, నీ ఆలోచనలకు విలువ ఇచ్చేది? పెద్దలుగా, నీ తల్లిదండ్రులుగా మాకు నచ్చిన అమ్మాయిని మా ఇంటి కోడలిగా తెచ్చుకొనే హక్కు మాకుంది. మా హక్కును గౌరవించవలసిన బాధ్యత నీపై ఉంది. అమ్మాయేం కుంటిది, కురూపిది కాదులే! చామనఛాయగా వుంది. చూడ్డానికి బాగానే వుంటుంది. స్కూల్ ఫైనల్ దాకా చదివింది. అమ్మాయి నచ్చింది. వాళ్ళిస్తామన్న లాంఛనాలు కూడా నచ్చాయి. అందుకే పెళ్ళి కూడా నిశ్చయం చేసుకున్నాము. వారిచ్చే కట్నానికి మరికొంత అప్పు చేసి నీ ఇద్దరు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు కూడా జరిపించేస్తే నా బాధ్యత తీరిపోతుంది. నేను ఆ కొట్లో ఉద్యోగం మానేసి ఏ మూలో కూర్చొని కృష్ణా, రామా అనుకుంటూ ఏ రామయణమో, భారతమో చదువుకుంటూ కాలక్షేపం చేస్తాను. నా ఆరోగ్యం కూడా సరిగా లేదన్న విషయం నీకు తెలుసు. పైగా కంటి చూపుకూడా మందగిస్తోంది. మునుపట్లా సరిగ్గా లెక్కలు వ్రాయలేకపోతున్నాను. నీ పెళ్ళి అవగానే, నా కళ్ళకు ఆపరేషన్ చేయించి, నా కళ్ళకు ఓ కళ్ళ జోడు తగిలించు! ఇక మునుపటిలా శ్రమించటం నా వల్ల కాదు. ఇక నుంచి కుటుంబ బాధ్యత అంతా నువ్వే చూసుకోవాలి. ఏమంటావు?"

* * *

"ఏమండి!"

"ఏమిటి?"

"ఈవేళ కాస్త పెందలాడే ఆఫీసు నుంచి ఇంటికి రండి!"

"దేనికి?"

"మూగమనసులు సినిమా రిలీజ్ అయ్యిందట వెళ్దాం! నాకు నాగేశ్వరరావు సినిమాలంటే మహా ఇష్టం. ఇప్పటి వరకూ దాదాపు ఆయన సినిమాలు అన్నీ చూశాను."

"నీకు నాగేశ్వరరావు సినిమాలంటే మహా మహా ఇష్టమని ఇప్పటికి చాలాసార్లు చెప్పావు. మన పెళ్ళి కాకముందు ఏమోగాని మన పెళ్ళయిన రెండేళ్ళ కాలంలోనే నువ్వు చూసిన సినిమాలే మళ్ళా వస్తే, మళ్ళా చూడాలని బలవంత పెట్టి తీసుకెళ్ళావు. పోయిన వారమేగా 'దేవదాసు' మళ్ళీ రిలీజయిందని, ప్రాణాలు తోడి తీసుకెళ్ళావు. మళ్ళీ ఇప్పుడు మొదలా? అయినా ఈ సినిమాల పిచ్చేమిటి? ఏ నెలకో, రెణ్ణెళ్ళకో ఓసారి చూస్తే సరదాగా వుంటుంది. అంతేకాని, ప్రతి వారం సినిమా చూడాలి అంటే ఎలా? ఇద్దరం వెళ్ళి వచ్చేసరికి ఎంత ఖర్చవుతూ వుందో ఆలోచించావా? ఒకవైపు అమ్మానాన్నల అనారోగ్యపు మందుల ఖర్చులు, మరొకవైపు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకు చేసిన అప్పులు, ఇంకోవైపు పిల్లవాడి డబ్బా పాల ఖర్చు, వాడికి ఏదైనా చిన్నపాటి జబ్బు చేసినా 'డాక్టర్ దగ్గరకు వెళ్ళాల్సిందే' అంటూ తీసుకెళ్ళి, పదో, పాతికో ఖర్చు చేయిస్తావు. ఇంటి ఖర్చు.. అప్పుడప్పుడు ఇంటికి వచ్చేపోయే బంధువుల తాకిడి ఖర్చు, ఇలా అన్ని ఖర్చులకు గాను నాకొచ్చే జీతం ఏమూలలకు సరిపోవడం లేదు. ప్రతి నెలా పాతికో, యాభయ్యో అప్పు చేయవలసి వస్తోంది... ఈ విషయాలన్నీ నీకు ఎన్నిసార్లు చెప్పినా గుర్తుండవు. నా తల్లిదండ్రుల మాట కాదనలేక, నీలాంటిదాన్ని చేసుకున్నాను. అలాకాక నాల్గా బాగా చదువుకొని, ఏ ఉద్యోగం చేసేదాన్నో చేసుకొని వుంటే బావుండేదనిపిస్తోంది.

"నాకూ అనిపిస్తోంది. మా నాన్న తొందరపడి, తక్కువ కట్నమని, మీలాంటి గుమస్తాకిచ్చి పెళ్ళి చేశాడని, అదే ఇంకాస్త ఎక్కువ అప్పో సప్పో చేసి, ఏ డాక్టర్‌కో, ఇంజనీర్‌కో చేసి వుంటే నా జీవితం బాగుండేది. నా మొగుడు ఫలానా అని నలుగురిలో గర్వంగా చెప్పుకోవడానికి విలువ వుండేది. అన్ని కోరికలు తీరేవి. ఇలా ఏ మురిపం లేక, ఏ కోరికా సరిగా తీరక అన్నింటికి రాజీపడి బ్రతకవలసివచ్చేది కాదు. పోయి పోయి నా ఖర్మ కొద్దీ మీలాంటి గుమస్తాకు భార్యనయ్యాను. ఓ అచ్చటా లేదు, ముచ్చటా లేదు. ఏం చేద్దాం అంతా నా ఖర్మ? నా సినిమా పిచ్చి అంతగా అంటారే? మరి మీరెందుకు, అలా పుస్తకాలు కొని ఇల్లంతా పుస్తకాల మయం చేయటం? ఇది దండగమారి ఖర్చు కాదా?"

"నేను ఊసుపోని కాలక్షేపపు పుస్తకాలు కొనటం లేదే? సాహిత్య సంబంధమైన, ప్రపంచ విషయాల సంబంధమైన పుస్తకాలు కొంటున్నాను. వాటివల్ల మనసుకు ఆహ్లాదం, మనకు తెలియని ఎన్నో విషయాలు తెలుస్తాయి. నిన్నూ చదవమని ఎన్నోసార్లు చెప్పాను. అయినా లాభం లేకపోయింది. పుస్తకాలు చదవట మంటేనే బద్ధకమాయే! పోనీ పై చదువులకయినా ప్రయత్నించు అంటే. చదివిన చదువు చాల్లే! అంటావు. అయినా పెరిగిన కుటుంబ ఖర్చుల దృష్ట్యా నేనిప్పుడు ఏ పుస్తకాలు కొనటం లేదే? సెంట్రల్ లైబ్రరీ నుంచి పుస్తకాలు తెచ్చుకొని చదివి, మళ్ళా వెనక్కు ఇచ్చేస్తున్నాను.

"ఇన్ని మాటలెందుకు నన్ను సినిమాకు తీసుకెళ్తున్నారా లేదా?"

"ఈవేళ వీలుపడదు. వచ్చేవారం చూద్దాం!"

"సెకండ్ రిలీజ్ సినిమా అండి! ఎన్నాళ్ళు ఆడుతుందో తెలియదు. ఈ రోజే వెళ్దామండి!

"ఈ రోజు సాయంకాలం టౌన్‌హాల్లో సాహిత్య సభ ఉంది. రాష్ట్రం నలుమూలల నుంచి పేరెన్నికగన్న సాహిత్యకారులు వస్తున్నారు. వెళ్ళి తీరాలి. కావాలంటే నువ్వురా!

"ఆ సభలు, చట్టుబండలు నాకిష్టం లేదు"

"నీకేది ఇష్టమని. సినిమాలు తప్ప మరేదీ ఇష్టం లేదు! వస్తాను ఆఫీసు టైం అవుతోంది."

"అయితే సాయంకాలం సినిమాకు తీసుకెళ్ళరన్నమాట! సరే వెళ్ళండి! రాత్రికి చూద్దురుగాని నా తడాఖా ఏమిటో?"

* * *

"రేయ్ నీకేమైనా బుద్ధి వుందట్రా! నీ భార్యను బలవంతంగా తీసుకెళ్ళి మళ్ళీ పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయిస్తావా? నీకేం డజన్ల కొద్దీ పిల్లలున్నారనుకొన్నవా? వున్నది ఒక్కడాయే! ఒకవేళ వాడు ఏదైనా రోగానికి గురై పుటుక్కున ఛస్తే, మళ్ళీ పిల్లలు ఎలా పుడతార్రా!?"

"మళ్ళా పిల్లలు పుట్టాల్సిన అవసరం లేదు. ఈ దేశంలో అనాథ పిల్లలు వేలకొద్దీ వున్నారు. వారిలో ఎవర్నో ఒకర్ని తెచ్చుకొంటే సరి!"

"అంటే... మళ్ళా తీసుకెళ్ళి పిల్లల పుట్టేలా నీ భార్యకు తిరుగు ఆపరేషన్ చేయించనంటావు."

"ఆపరేషన్ చేయించిందే పిల్లలు వద్దనుకొని. మళ్ళీ తీసుకెళ్ళి రీ-ఆపరేషన్ ఎలా చేయిస్తాననుకొన్నారు. చస్తే చేయను. చూడు నాన్నా! ఇప్పుడు మన దేశం జనాభా 60 కోట్లకు పైగా వున్నారు. అందులో మూడు పూటల అన్నం తింటున్న వారు కేవలం పది శాతం మాత్రమే, మిగతా 50 శాతం సరిగా ఒక పూట తిండి లేక... అల్లాడిపోతున్నారు. అరకొర తిండితో... కాలం గడుపుతున్నారు. వస్తులతో కూడా కాలం గడుపుతున్నారు. దీనంతటికి కారణం?



జనాభా పెరుగుదల. ఆ పెరుగుదలకు సరిపడా ఆహార ధాన్యాలు ఉత్పత్తి కాకపోవడం. కేవలం పిల్లల్ని పుట్టించగానే సరికాదు నాన్నా! వాళ్ళ బాగోగుల్ని, వాళ్ళ భవిష్యత్‌ను కూడా ఆలోచించాలి. పిల్లల్ని ఉన్నత స్థాయికి తీసుకెళ్ళాలంటే పరిమిత సంతానమే అవసరం. ఈ అవసరాన్ని గుర్తించక, డజన్ల కొద్దీ పిల్లల్ని పుట్టించేసి, వారి మానాన వారు బ్రతుకుతారులే అనుకుంటే అది పొరపాటు. ఒక విధంగా నా దృష్టిలో నేరం కూడా! ఈ నేరానికి అక్షర జ్ఞానంలేని వారంటే సరే, చదువు సంధ్యలు వుండి, ఉద్యోగాలు చేస్తున్నవారు కూడా పూనుకోవటం చాలా విచారంగా ఉంది.

"మీ గవర్నమెంటే చెప్పింది కదరా! ఇద్దరు లేక ముగ్గురు చాలని, మరి అలాంటిది. నువ్వు ఒక్కడే చాలనుకుంటే ఎలా?"

"మీలాంటి వారు అక్షర జ్ఞానం లేనివారు. కేవలం ఒక్కడు చాలంటే, ఎక్కడ ఆందోళన చేస్తారో అని, ఇద్దరు లేక ముగ్గురు అన్న నినాదం ముందుకు తెచ్చింది. దాన్నయినా ఎందరు పాటిస్తున్నారు?"

"నువ్వెన్నయినా చెప్పు! కనీసం మరో ఇద్దరయినా వుండాలి. వెళ్ళి తిరుగు ఆపరేషన్ చేయించు!"

"ఈ విషయంలో నా నిర్ణయం మారదు."

"సరే! ఈ తండ్రి మాటనే లెక్క చేయవు కదూ! సరే కానిరా! కాని. నీ ఇష్టమొచ్చినట్లుగా కాని... పిదపకాలం పిదప బుద్ధులు. అంతా కలికాలం మహిమ. ఏం చేద్దాం?"

* * *

మీ తెలివి తెల్లారినట్లుగా ఉంది. ఇప్పుడందరూ, తమ పిల్లల్ని ఇంగ్లీషు మీడియం స్కూళ్ళలో చేర్పించడానికి ఉత్సాహం చూపుతుంటే, మీరేంటండి? తీసుకెళ్ళి గవర్నమెంట్ స్కూల్లో చేరుస్తానంటారు. నా కొడుక్కు ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడటం రావాలి. వాడో గొప్ప డాక్టరు కావాలి."

"గవర్నమెంట్ స్కూల్లో చదివినా డాక్టర్ కావచ్చు. డాక్టరే కాదు మరే చదువు అయినా చదవవచ్చు. గవర్నమెంట్ స్కూళ్ళలోనే చదివి ఎంతో పెద్ద పెద్ద పదవులు పొందిన వారెందరో వున్నారు! చదువు పట్ల శ్రద్ధ వుండటం ముఖ్యం కాని ఎక్కడ చదవటం అన్నది ముఖ్యం కాదు. అయినా ఆ తెల్లవాడు తన పాలనా సౌలభ్యం కోసం తన భాషను మనపై రుద్దితే, అదే గొప్ప భాషగా భావించి, దాన్నే పట్టుకొని ఇంకా వెళ్ళాడుతూ వుండటం మనలోని బానిస మనస్తత్వానికి, వెర్రితనానికి నిదర్శనం."

"మీరెన్నయినా చెప్పండి! నేను చస్తే, పిల్లాడ్ని ఆ గవర్నమెంట్ స్కూల్లో చేర్పించడానికి ఇష్టపడను. ఏ విషయంలో అయినా మీ మాట వింటానేమోనని, ఈ విషయంలో మాత్రం వినను. వున్నది ఒక్కడాయే! వాడిని కూడా గొప్ప చదువులు చదివించకపోతే ఎలా!"

"చదివిద్దామోయ్. అందుకు నాకభ్యంతరం లేదు. కాకపోతే, గవర్నమెంట్ స్కూల్లో, గవర్నమెంట్ కాలేజీలో చదివిద్దాం!"

"అక్కడ ఇంగ్లీషు మీడియం ఎక్కడుంటుంది? తెలుగులోనే చెప్పేది. అలా అయితే నా కొడుక్కి ఇంగ్లీషు ఎలా వస్తుంది?"

"ఒకటో తరగతి నుంచి బి.ఎ. దాక చదివింది, గవర్నమెంట్, స్కూల్, కాలేజీల్లోనే కదా! మరి నాకు ఇంగ్లీషు వ్రాయటం, మాట్లాడటం రావటం లేదా?"

"మీ బట్లర్ ఇంగ్లీషు ఏపాటిదో నాకు తెలుసు లెండి! నాకు అలాంటి ఇంగ్లీషు మాట్లాడ్డం కాదు కావలసింది. అచ్చం ఇంగ్లీషు దొరలా మాట్లాడే ఇంగ్లీషు మాట్లాడ్డం కావాలి.

"పరభాషా వ్యామోహం సమాజంలో ఎంతగా పాతుకుపోతూ వుందో నిన్ను చూస్తే తెలుస్తోంది. సరే కానివ్వు! వాడ్ని గవర్నమెంట్ స్కూల్లో చేర్పించి నిత్యం నీతో సూటిపోటి మాటలు పడ్డం దేనికి?"

* * *

"ఇదిగో నిన్నే! అలా కూర్చో. నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి."

"ఆ... కూర్చున్నాను. చెప్పండి! ఏమిటా ముఖ్య విషయం?

"నువ్వు కోరుకున్నట్లుగానే మనబ్బాయి డాక్టర్ అయ్యాడు. పి.జి. కూడా పూర్తి చేశాడు. రేపో మాపో ఉద్యోగం కూడా వస్తుంది.

"అయితే..."

"మన వాడికి పెళ్ళి చేద్దాం!" పెళ్ళీడు వచ్చి చాలా రోజులయింది కదా! ఇంకా ఆలస్యం చేయటం దేనికి?"

"నేను అదే ఆలోచిస్తున్నాను. కాని నేననుకొన్న విధంగా

మంచి సంబంధాలు ఏవీ అగుపడ్డం లేదు. నా కొడుకును ఓ గొప్పింటికి అల్లుడ్ని చేయాలన్నది నా కోరిక."

"గొప్పింటి సంబంధాలు దేనికోయ్! మన స్థాయి సంబంధాలు చూసి చేస్తే సరి."

"మన వాడికేంటండి! డాక్టర్. లక్షలకు లక్షలు కట్నం ఇచ్చి పిల్లనిస్తామని వస్తున్నారు. కాకపోతే, ఓ కోటేశ్వరుని కూతుర్ని నా ఇంటి కోడలిగా చేసుకోవాలన్నది నా ఆలోచన. అందుకే వచ్చిన సంబంధాలన్నీ. ఏదో ఒక వంక పెట్టి దూరం చేస్తున్నాను. అవునూ మీరు! ఈ సంబంధం విషయంగా ఏమీ పట్టించుకోకపోతే ఎలా? ఎలాగైనా ఓ కోటీశ్వరుని సంబంధం ఖాయం అయ్యేలా చూడండి!"

"మరీ ఇంత ఆశపనికి రాదే?... నీకు చెప్పాలనుకొన్న ముఖ్య విషయం, మనవాడి పెళ్ళి గురించే అయినా, ఆ విషయం సంబంధంగా, నా మనసులోని ఆలోచన గురించి నీతో చెప్పాలని."

"ఏమిటీ మీలో వున్న ఆలోచన"

"నేను పని చేస్తోన్న ఆఫీసులోనే నా కొలీగ్ ఒకతను వున్నాడు. మన పరిస్థితి బాగాలేనపుడు అతను ఆర్థికంగా నన్ను ఎన్నోసార్లు ఆదుకొన్నాడు. ఇప్పుడు అతను అనుకోకుండా చాలా ఇబ్బందుల్లో పడ్డాడు. జీతం మొత్తం కుటుంబ ఖర్చులకు, భార్య అనారోగ్యానికి, ఇంటి అద్దెకు, పిల్లల చదువులకే సరిపోవటం లేదు. అతనికి అయిదు మంది సంతానం. నలుగురు ఆడపిల్లలు. ఒక అబ్బాయి. నలుగురు అమ్మాయిలు పెళ్ళీడుకొచ్చారు. చదువుకొంటున్నారు. వారికి పెళ్ళిళ్ళు ఎలా చేయాలో తోచటం లేదతనికి. భారీ కట్నాలు ఇచ్చి పెళ్ళిళ్ళు చేసే స్థితిలో లేదు. అమ్మాయిల చదువులు కూడా ఇంకా పూర్తి కాలేదు. పెద్దమ్మాయి మాత్రం ఎం.ఎ. పూర్తి చేసింది. ప్రైవేట్ కాలేజీలో పనిచేస్తోంది. మంచి అమ్మాయి. చూడ చక్కగా వుంటుంది. మనబ్బాయికి తగిన జోడు. ఆ అమ్మాయిని మనబ్బాయికి చేసుకొంటే బాగుంటుందని నా ఆలోచన. నీవేమంటావు...?"



"మీ తెలివి తెల్లారిందంటాను. లక్షలు ఇస్తామని వచ్చే సంబంధాల్నే నేను వెనక్కు పంపుతూ వుంటే, - కట్నం కూడా ఇచ్చుకోలేని, ఆ అమ్మాయిని మనింటి కోడలిగా చేసుకుందామంటారా? అవ్వా! ఎవరైనా విన్నా, తెలిసినా నవ్విపోతారు.

"ఇందులో నవ్వడానికేముందోయ్. మన పిల్లవాడు. మన ఇష్టం."

"మన ఇష్టమైనా, మనల్ని వెర్రి వెంగళప్పలుగా భావిస్తారు. ఇంతకూ ఆ అమ్మాయి మన కులమేనా?"

"ఈ కాలంలో కూడా కులమతాల పట్టింపేమిటి? నీ పిచ్చిగాని"

"నా పిచ్చికాదు. నిజంగానే మీకు పిచ్చి పట్టినట్టుంది. లేకపోతే, ఇలాంటి వెర్రి మొర్రి ఆలోచనలు రావు.

"ఎవరికి ఎలాంటి ఆలోచనలు వచ్చినా, నేను మాత్రం మీరు, మీరు చూసే సంబంధాన్ని ఒప్పుకోను.

"నువ్వెప్పుడొచ్చావురా?"

"వచ్చి చాలాసేపయింది. గుమ్మం బయటే నిల్చొని మీ మాటలన్నీ విన్నాను.

ఇదిగోండి! మీకిదే చెబుతున్నాను. నేను మౌనిక అనే నా క్లాస్‌మేట్‌ను ప్రేమించాను. ఆమె కూడా నన్ను ప్రేమించింది. ఆమె కూడా డాక్టరే! మా పెళ్ళికి ఆమె తల్లిదండ్రులు అంగీకరించారు. మీ అభిప్రాయం కనుక్కోమన్నారు. ఇన్నాళ్ళుగా 'చెబుదాంలే' అని నేనే తాత్సారం చేశాను. ఈ రోజు సందర్భం వచ్చింది కాబట్టి చెబుతున్నాను. మీరు అవునన్నా, కాదన్నా నేను పెళ్ళాడేది ఆ అమ్మాయినే!

"మన కులమేనా? వున్న వాళ్ళేనా?"

"మన కులం కాదు. మనలాగే మధ్యతరగతి కుటుంబం వారిది."

"మరి కట్నం?"

"తానూ డాక్టర్ అయినపుడు కట్నం దేనికి?

"పోనీ లాంఛనాలు.. అవైనా..."

"ఏవీ వద్దన్నాను."

"నీపై ఎన్ని ఆశలు వుంచుకొన్నా్రా... నిన్ను ఓ కోటేశ్వరుడికి అల్లుడ్ని చేయాలనుకుంటే, చివరికి నువ్విలాంటి నిర్ణయం తీసుకుంటావా? నేను చస్తే అంగీకరించను."

"అమ్మా... నువ్వు అంగీకరించకున్నా, నాన్న అంగీకరించకున్నా, నా పెళ్ళి ఆ అమ్మాయితోనే జరగటం ఖాయం! ఈ విషయంలో మీరెన్ని చెప్పినా నా నిర్ణయం మార్చుకోను."

"రేయ్! నిజంగా ఇన్నాళ్ళకు నా కొడుకువనిపించావు. నీకు అంగీకారమైతే నా కొలీగ్ కూతుర్ని మనింటి కోడలిగా చేసుకోవాలన్న ఆలోచన నాలో వుండింది. సరే, అతను ఆర్థికంగా, ఆపదలో ఆదుకొన్నాడు కాబట్టి, ఆ అమ్మాయి పెళ్ళి ఇంకొకరితో అయ్యేందుకు నా వంతు ఆర్థిక సహకారం అతనికి అందజేస్తాను. నువ్వు మాత్రం నీకు నచ్చిన పిల్లనే పెళ్ళి చేస్కో! అయితే ఒక్క కండిషన్?"

"ఏమిటది?"

"పెళ్ళి అట్టహాసంగా కాక, సింపుల్‌గా రిజిస్ట్రార్ ఆఫీసులో జరగాలి. పెళ్ళి పేర దండగమారి దుబారా ఖర్చు, వారికి కాని, మనకు కాని ఖర్చవటం నాకిష్టం లేదు. ఏమంటావు?"

"సరే... మీ ఇష్టం!"

"అయ్యో అదేంటండి అలా అంటారు. సంప్రదాయబద్ధంగా... అట్టహాసంగా, బంధువుల్నీ పిలిచి పెళ్ళి చేయకపోతే ఎలా? - రిజిస్టర్ మ్యారేజ్ పెళ్ళి కూడా ఓ పెళ్ళేనా?"

"పది లక్షలు ఖర్చు పెట్టి పెళ్ళి చేసినా పెళ్ళే, సింపుల్‌గా, దండల పెళ్ళిచేసినా పెళ్ళే! - మన సమాజంలోనే పెళ్ళి పేర దుబారా ఖర్చు జరుగుతూ వుందే కాని, వేరే సమాజాల్లో అన్నీ దాదాపు రిజిస్టర్ మ్యారేజ్ పెళ్ళిళ్ళే. మన దేశంలో కూడా ప్రతి వ్యక్తీ, విధిగా రిజిస్టర్ మ్యారేజ్ చేసుకోవాలి అన్న చట్టం తెచ్చినప్పుడే పెళ్ళి పేర జరిగే అనవసరపు ఖర్చు, అలాగే కట్నం కూడా, తగ్గుముఖం పడుతుంది. రేయ్! ఓ తండ్రిగా నేను నీ నిర్ణయాన్ని మనసారా అభినందిస్తున్నాను. త్వరలో వెళ్ళి నువ్వూ ఆ అమ్మాయి వెళ్ళి, రిజిస్ట్రార్ ఆఫీసులో మ్యారేజ్ అప్లికేషన్ ఇచ్చి రండి! వారు ఓ నెలరోజులు గడువు పెడతారు కాబట్టి,

ఆ నెలరోజులు ఆపి... పెళ్ళి చేసేస్తాను."

"థాంక్యూ నాన్నా... థాంక్యూ వెరీమచ్"

* * *

"ఈ కార్యక్రమానికి విచ్చేసిన సాహితీవేత్తలకు, సాహిత్య అభిమానులకు, ఇతరులకు, వేదికపైన ఇతర పెద్దలకు నా నమస్కారాలు. నేను రచనలు చేయాలని కాలేజీ రోజుల్లో ప్రయత్నించాను. అప్పుడు మా నాన్నగారు అడ్డుకొన్నారు. ఆ తర్వాత నాపై పడ్డ కుటుంబ బాధ్యత కారణంగా రచనలు చేసే అవకాశం లేకపోయింది. అయితే పుస్తకాలు చదవటం, సాహిత్యాభిలాషిగా సాహిత్య సభలకు రావటం మాత్రం మానుకోలేదు. రాలేని పరిస్థితి వున్నప్పుడు తప్ప. ఇక అసలు విషయానికి వస్తున్నాను." మనం చనిపోయేలోగా సమాజానికి ఎంతో కొంత మేలు చేయాలి. అది ఈ సమాజ పౌరునిగా, ప్రతి వ్యక్తి బాధ్యత." ఈ మాటలు నాలో చాలా కాలం నుంచి ఆలోచనలు రేకెత్తించాయి. ఆ ఆలోచనలకు ఈనాటికి కార్యరూపం వచ్చింది. నేను జిల్లా పరిషత్‌లో ఓ ఆఫీసర్ హోదాలో రిటైర్డ్ అయ్యాను. నా రిటైర్‌మెంట్ తాలూకు డబ్బు నాలుగు లక్షలు వచ్చింది. ఈ నాలుగు లక్షల్లో రెండు లక్షల రూపాయలు పేద విద్యార్థుల్లో కొందరికైనా ఉపయోగపడేందుకు గతించిన నా అర్ధాంగి పేర ఓ ట్రస్ట్ ఏర్పాటు చేశాను. ఆ రెండు లక్షలపై వచ్చే వడ్డీ నీ ప్రతి నెలా ఓ పేద విద్యార్థికి, అతని పుస్తకాల నిమిత్తమో, ఫీజుల నిమిత్తమో ఇవ్వటం జరుగుతుంది. ఇక మరో రెండు లక్షలు స్థానిక జిల్లా రచయితల సంఘానికి విరాళంగా ఇచ్చాను. ఇకపై దానిపై వచ్చే వడ్డీతో సాహిత్య సభలు నిర్వహించటం, ప్రతిభ వుండి, వెలికి రాని రచయితల పుస్తకాలు ప్రచురించటం జరుగుతుంది. నా భార్య పేర ఏర్పాటు చేసిన ట్రస్ట్‌లోనూ, ఈ రచయితల సంఘంలోనూ నా వంతు ఇకపై ఏమీ వుండదు. ఓ కమిటీ ఏర్పాటు చేయటం జరిగింది. కమిటీ వారే అంతా చూసుకొంటారు. నేను చివరగా ఒక్కమాట చెప్పి ముగిస్తాను. ఈ రచయితల సంఘానికైనా, పేద విద్యార్థుల కోసం ఏర్పాటు చేసిన ట్రస్ట్‌కయినా మీ పరిధి మేర మీకు తోచిన విరాళాలు ఇవ్వండి? పదిమంది వ్యక్తుల చేతులు, సహాయ సహకారాలు కలిస్తేనే ఏ సంస్థలయినా కలకాలం మనుగడ సాగించేది. మరి నా చివరి కోరిక మన్నిస్తారని ఆశిస్తూ శెలవు తీసుకొంటున్నాను. శెలవ్...



* * *

"మీ పద్ధతి ఏం బాగాలేదు నాన్నా! నాలుగు లక్షలు తీసుకెళ్ళి అలా ట్రస్ట్‌లకిచ్చెయ్యడమేంటి. అమ్మ చనిపోయాక, మిమ్మల్ని అదుపులో వుంచటమే కష్టమైపోయింది. సరే ఇచ్చారు. అక్కడితో వూరుకొన్నారా? పగలు లేచింది మొదలు రాత్రి పొద్దుపోయే వరకూ ఏదో ఒక సామాజిక సేవ అంటూ వూరి వెంట పడి తిరుగుతారు. అరె... కొడుకు కోడలు కలసి ఓ నర్సింగ్‌హోం పెట్టుకున్నారు. ఆ నర్సింగ్‌హోంలో ఉండి, డైలీ కలెక్షన్, మందులు తెప్పించడం, బ్యాంక్ కెళ్ళి డబ్బు కట్టిరావటం, ఇతరత్రా పనులు చూసుకోమంటే చూసుకోరు. వీటన్నింటిని చూసుకోవడానికి నెలకు రెండువేలిచ్చి ఓ కుర్రాడ్ని పెట్టుకోవలసి వచ్చింది. పోనీ ఇంటి విషయాలు ఏమైనా పట్టించుకొంటారా! అంటే అదీ లేదు. మీరే పని చేయనందుకు, ఇంటి పనుల కోసం ఓ పని మనిషిని పెట్టుకోవలసి వచ్చింది. పోనీ మీ కొచ్చే ఆ పెన్షన్ డబ్బయినా ఇస్తున్నారా? అంటే అదీ లేదు. నెల నెల వచ్చే ఆ పదివేల పెన్షన్ - సమాజ ఉద్ధరణ పిచ్చితో, ఎవరికో ఒకరికి లేదా, ఏదో ఒకదానికి ఖర్చు పెడుతున్నారు. మరి మీ వల్ల మాకెలాంటి ఉపయోగం లేనప్పుడు. మీరు ఇంట్లో వుండటం దేనికి? మేము మీకు తిండి పెట్టడం దండగ! వెళ్ళి ఏ వృద్ధాశ్రమంలోనో చేరిపొండి! లేదా నేను చెప్పినట్లుగా అయినా చేస్తూ వుండండి. సాయంకాలం లోపు మీ నిర్ణయం తెలియజేయండి? దట్సాల్!

* * *

"ఇదిగో మిమ్మల్నే! ఇందాకట్నుంచి మీరిద్దరు ఈ హోటల్లో కూర్చొని టీ తాగుతూ నా గురించి, నేను తీసుకున్న నిర్ణయం గురించి వక్రభాష్యాలు చెప్పుకుంటూ నవ్వుకోవడం ఆ మూల కూర్చొని నేనూ టీ తాగుతూ అంతా విన్నాను. నా రిటైర్‌మెంట్ డబ్బు ట్రస్ట్ కివ్వడం పిచ్చి పని కాదు మంచి పని. నా కొడుకు నన్ను వృద్ధాశ్రమంలో చేరమనటం, తండ్రి పట్ల అతనికున్న బాధ్యతను నెరవేర్చకపోవడమే! నేను వృద్ధాశ్రమంలో చేరక ఓ అద్దె ఇల్లు తీసుకొని, అనాథ శరణాలయం నుంచి 14 ఏళ్ళ అమ్మాయిని దత్తత తీసుకోవడానికి, తెచ్చుకోవడానికి కారణం? వృద్ధాశ్రమంలో కొన్ని పరిధులకు లోబడి వుండాలి. అలా వుండటం నా వల్ల కాదు. తిరుగుతూ చావాలన్నదే నా అభిమతం. అనాథ అమ్మాయిని తెచ్చుకొన్నది, నాకు ఇంత వండి పెట్టడానికి. తాను తింటూ చదువుకోవడానికి. ఆ అమ్మాయి చదువుకోవాలి అనే వరకు చదివిస్తాను. పదిమందికి ఉపయోగపడేలా తీర్చిదిద్దుతాను. పెళ్ళి కూడా చేస్తాను. నాకు కూతురు లేని లోటును ఆ అమ్మాయి ద్వారా తీర్చుకుంటాను. అంతేకాని, మీరిందాక అన్నారే! ముసలాడయినా కండపుష్టితో వున్నాడు. పైకి పెంపుడు కూతురు. లోపల శారీరక అవసరాల తీర్చేందుకు ఉపయోగపడుతుంది అని. దీన్నిబట్టి మీ మెదళ్ళు ఎంతగా కుళ్ళిపోయి వున్నాయో అర్థం అవుతోంది. మీరే కాదు. ఈ సమాజంలో ఏ వ్యక్తి మంచి చేయాలనుకున్నా, చేస్తున్న మీలాంటి కుళ్ళు మెదళ్ళ వాళ్ళు నానా రకాలుగా వక్రీకరణ భాష్యాలు చెబుతారు. ప్రచారం చేస్తారు. మీరెంతగా ప్రచారం చేసినా నిజం ఏమిటన్నది ఆలస్యంగా అయినా అందరికీ తెలియకపోదు. మీరిద్దరూ నా ఆఫీసులో పనిచేస్తున్నవారే? ఇంకా రిటైర్ కాలేదు. రిటైర్ అయిన ఓ కొలీగ్ గురించి ఇలా మాట్లాడుకోవటం, ఏమాత్రం విజ్ఞతో మీకే తెలియాలి. చేతనైతే మీరూ పదిమందికి ఉపయోగపడేలా బ్రతకండి! చేతకాకపోతే, మౌనంగా వుండండి! ఇలాంటి వక్ర భాష్యాల వల్ల మీ కాలం వృథా అవుతుందే కాని, మీకెలాంటి ప్రయోజనం ఉండదు. ఇంకెప్పుడూ ఎవరి గురించి చెడుగా మాట్లాడకండి! మీలో ఏ కోశాన అయినా సామాజిక బాధ్యత, మంచి చేయాలి అన్న ఆలోచన వుంటే కనీసం చెడు మార్గాన వెళుతున్న వారిని మంచి మార్గాన పెట్టడానికి ప్రయత్నించండి! అలాగైనా పుట్టినందుకు, జీవిస్తున్నందుకు, సమాజంలో పౌరులైనందుకు, మీ వంతు బాధ్యతను తీర్చుకొండి!.... వస్తాను...."

"...............?!"

*

# ఒకానొక అగంతకుని ప్రస్థానం



డాక్టర్ కె. లింగారెడ్డి

గుండెలో జెండాని
భుజం మీద తెల్ల కోటుని మోస్తూ
సూర్యోదయాల్లో
అతడు వెలుగుల కేసి నడుస్తుంటాడు
ఆశల వెచ్చదనం ముసురులో గొంగడి
కొప్పరై అలుముకుంటుంది
విశ్వాసపు యవ్వన తీవ్రత
జ్వలిస్తూ వుంటుంది
ఆశయాల చూపు సూటిగా
నక్షత్ర మండలం మీద నిత్యప్రకాశంగా
బక్కపలుచని దేహంలో విలువల కాంతులు
దేహ దేశం యొక్క నిర్మాణమూ
చర్యా ప్రతిచర్యలూ
వ్యాధి విస్తరణ, వ్యాపితాలూ
లాక్షణిక శాస్త్రమూ, శస్త్ర చికిత్స
చారిత్రక సంఘర్షణల సమాహారంలోని
చిక్కుముళ్ళు విప్పే యత్నం
శతాబ్దపు మహాద్భుత
శ్రామిక స్వప్న సామ్రాజ్యం
శల్య సారథ్యాల్లో
ఆధునిక బ్రూటస్‌ల విద్రోహాల్లో
దేవదత్తుడి బాణాలకు నేలరాలినప్పుడు
ఓదార్చడానికొక్క సిద్ధార్థుడూ లేడు
గుండెలో శూన్యాన్ని,
జీవితం మీద పప్పీని మోస్తూ
ముసుగేసిన ఆకాశం కింద
కలువని తీరాల కోసం

అతడు పరుగులు తీస్తూ వుంటాడు
ఆశయాలు సంఘర్షించేవేళ
ఆశల ఇంద్రధనువుల వేట
విశాల జీవితాన్ని మంత్రించి
సీసాలో బంధించినట్లు
కుటుంబం స్వంత ఆస్తుల వలయం
కాంతి కోల్పోయిన దేహం మీద
చీలి పీలికలైన విలువల వలువలు
అసహన దావానలంలో నిత్యం దగ్ధమౌతూ
గుండెలో ఎరుకని, భుజం మీద
వ్యాధిగ్రస్తుల్ని మోస్తూ
ద్వారాల్ని దాటుకుంటూ, దారుల వేటలో
అతడు నడుస్తూ వుంటాడు
ప్రపంచీకరణ విసిరిన మార్కెట్టు
మాయావలయం
రాకాసి ఎలుక అల్లిన అంతర్గత విషవలలో
మనిషి బందీ
వ్యక్తిత్వమున్న సరుకు స్వేచ్ఛ ఇప్పుడు
శ్లాఘనీయం
మనుషులు కావాలిప్పుడు
సంచిత సరుకు కోసం మనుషులు కావాలి

వినిమయ సంస్కృతి పూజలందుకునే వేళ
సరుకుల చేత వినియోగించబడటానికి
మనుషులు కావాలి
మార్కెట్లు కావాలి
దేహాల్నీ, దేశాల్నీ
అంగాంగాలుగా విడదీసి అమ్ముకునేందుకు
మార్కెట్లు కావాలి
ఫాదర్స్‌డే, మదర్స్ డే, వాలంటైన్స్ డే
మానవ సంబంధాలకు దినాలు పెట్టి
మార్కెట్లని అలంకరించాలి
మట్టికాళ్ళ మహారాక్షసికిప్పుడు వేయికళ్ళు
ఆశల వివేకం వెన్నుతడుతూ ఉంటుంది
సంచితజ్ఞానం వేగుచుక్కై
కాలాన్ని నిద్దురపోనివ్వదు
సంక్షోభ సమాజపు రాచపుండు
శస్త్ర చికిత్సని వేగిరపరుస్తుంది
గుండెలో విశ్వాసాన్ని, ఒంటి మీద ఆకుపచ్చ
కోటునీ వేసుకొని
అనుసరిస్తున్న సహాయకులతో అతడు
చికిత్సాలయంలోకి

---

# కవితాలోకం



సదా సాహితి

ఓ బుజ్జి పాపాయి
చిరుమువ్వల లేపాదాలతో
కవితా లోకపు కవాటం తెరచుకోగా
ఆసక్తిగా అప్రయత్నంగానే
లోపలికి అడుగుపెట్టింది
పచ్చటి ప్రకృతి పచ్చిక
తివాచి పరిచింది.
కొంగ్రొత్త లోకానికి
స్వాగతం పలికింది.
భావాల విరితోటలో
ఆత్మీయతా అగరు పరిమళం
అమ్మ స్పర్శలా తాకింది.
రంగు రంగు రెక్కలల్లార్చుతూ
ఎగురుతున్న అక్షర సీతాకోకలను
చూసింది

తాను కూడా
ఊహారెక్కలు తొడుక్కొని
దేవుడి తూనీగలా ఎగిరి
పిల్ల గాలుల్లో ఉల్లాసంగా
పల్టీలు కొట్టింది.
నిర్మలమైన నీలాకాశపు తెరపై
జిలుగు ఖచిత తారామణులను
పసిడి వర్ణపు నెలవంకను

తనివితీరా తడిమి చూసింది
ఝుంటి తేనియల వర్షధారల్లో
నిలువెల్లా తడిసింది.
పచ్చటి కొండల శ్రేణిపై
మచ్చల జింకలా గెంతింది.
వెన్నెల నయాగారాల్లో
బంగరు చేపలా ఈదింది
ఆకలి దప్పిక మరచి
అవ్యక్త మధురానుభూతిలో
పాల నురగల బోసినవ్వులు
పువ్వుల్లా రువ్వింది

(సాహిత్యశాలలో 'మోహన్'గారు
వేసిన బ్యాక్‌డ్రాప్ చూశాక...)

# పిల్లి మెడలో గంట

భాగవతుల రామారావు

''ఆడా మగాలో ఎవరు పుణ్యాత్ములు? ఎవరు పాపాత్ములు?"

"పాపాలు చేసినవాళ్లు పాపాత్ములు, పుణ్యం చేసినవాళ్లు పుణ్యాత్ములు - ఆడైనా, మగైనా."

"పాపాలు చెయ్యలేదే అనుకో. ఆడా మగలో ఎవరు పుణ్యాత్ములు?"

''ఆడా మగాలో ఆడదే పుణ్యాత్మురాలు"

"నిజమే చెబుతున్నావా?"

''నేను కాదు - శాస్త్రాలు చెబుతున్నాయి. 'త్రైలోక్య జననీ ధాత్రీ'. ఆడది ముల్లోకాలకీ కన్నతల్లి. అందుకే 'మాతృదేవో భవ' అన్నారు."

''పితృదేవో భవ' అని కూడా అంటారు కద?"

"మాత తర్వాతే పిత. మాతా పితలు, తల్లిదండ్రులు, అమ్మా నాన్నలు, స్త్రీ పురుషులు, ఆడామగలు, సీతారాములు, రాధాకృష్ణులు, సావిత్రీ సత్యవంతులు, దేవకీ వసుదేవులు, తారా శశాంక, లైలా మజ్నూ, సుందరీ సుబ్బారావు.... అనడంలో అంతరార్థం ఇదే. చిన్న దెబ్బ తగిలితే 'అమ్మా!' అంటాం. ఆశ్చర్యం ప్రకటించేటప్పుడు 'అమ్మో!' అంటాం. భయం వేస్తే 'అమ్మబాబోయ్!' అంటాం. ఓ ఆపద గడిస్తే 'అమ్మయ్య!' అంటాం. అశక్తతని వ్యక్తపరిచేటప్పుడు 'అమ్మోయ్' అంటాం. ఆఖరికి ఆవు కూడా 'అంబా' అంటుంది. 'అమ్మలగన్నయమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ' అని దేవీ పరాశక్తిని - ఆది దైవాన్నే - 'అమ్మ' అంటున్నాం. ఈ సృష్టికి జన్మనిచ్చింది ఆడది. స్త్రీ కన్నతల్లి. నవమాసాలు మోసి 'కనే'టప్పుడు తన కడుపు చీల్చుకుని బిడ్డకి జన్మనిస్తుంది. ఆ ప్రసవ వేదన అమ్మ భరిస్తుంది కాని అయ్య కాదు. కాన్పు స్త్రీకి పునర్జన్మతో సమానం. అంతటి త్యాగశీలి అమ్మ. నువ్వు తప్పు చేస్తే భగవంతుడు నిన్ను శిక్షిస్తాడు, నీ తండ్రి నిన్ను దండిస్తాడు, నీ అమ్మ నిన్ను కడుపులో పెట్టుకుంటుంది - నీ తప్పు క్షమిస్తుంది. అందుకనే స్త్రీని 'క్షమయా ధరిత్రీ' అన్నారు. 'అమ్మ' అయ్యే సౌభాగ్యం ప్రాణికోటిలో ఒక్క స్త్రీకే దక్కింది. అందుకే స్త్రీ పురుషుని కంటే పవిత్రమైనది, పుణ్యాత్మురాలు."

"స్త్రీ పవిత్రతని అంతలా శ్లాఘిస్తున్న నువ్వు శ్రీకృష్ణుని కంటె మేధావివా?"

''శ్రీకృష్ణుడెక్కడ? నేనెక్కడ? శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. నేను చీమూ నెత్తురుతో పుట్టిన క్షుద్ర మానవుణ్ణి. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు."

''అయితే స్త్రీ విషయంలో ఇంతసేపూ నువ్వు చెప్పింది అబద్ధం అన్నమాట?"

''స్త్రీ గురించి నేను చెప్పింది అక్షరాలా నిజం. శ్రీకృష్ణుని మీద ప్రమాణం చేసి చెబుతున్నాను. స్త్రీని మించిన పుణ్యజీవి సృష్టిలో మరొకరు లేరు. ఈ సత్యాన్ని దేవుడు కూడా ఖండించలేడు."

"దేవుడే ఖండించేడు - స్త్రీని పాపపు జన్మురాలన్నాడు!"

"దేవుడా!?"

"ఔను! దేవుడే. 'స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః.... పాపయోనమః' - స్త్రీలు, వైశ్యులు, శూద్రులు పాపపు జన్ములు. అని గీత (9-32)లో శ్రీకృష్ణుడే అన్నాడు."

"నువ్వు 'పాపయోనమః' పదాన్ని Out of Context ఉల్లేఖిస్తూ గీతా ప్రవచనపు మౌలిక భావాన్ని distort చేసి చెబుతున్నావు. 'ఎటువంటి పాపపు జన్ములైననూ, స్త్రీలు, వైశ్యులు అట్లే శూద్రులైననూ, అట్టివారు కూడా నన్ను శరణు పొందితే ఉత్తమ గతిని పొందుతున్నారు' అని శ్రీకృష్ణుడు చెప్పేడు. స్త్రీలను పాపపు జన్ములనలేదు."

"అది అందరూ చెప్పే డామేజ్ కంట్రోల్ వాఖ్యానం. ఆది శంకరులే 'స్త్రీలు, వైశ్యులు, శూద్రులు - ఎవరైతే పాపపు జన్ములై ఉన్నారో వారైననూ కూడా....' అని శ్లోక పద నిర్మాణం ప్రకారం ఉన్నది ఉన్నట్లు ఆ శ్లోకానికి టీకా, తాత్పర్యాలు చెప్పేరు. ఇంతకీ సవరించి చెప్పిన తాత్పర్యం కూడా అసలు 'అసంగతాన్ని' సరిదిద్దలేదే! పాపపు జన్ములు కూడా తరించే తరుణోపాయం చెప్పడమే ఆ ప్రవచనోద్దేశం అయితే ఆ సందర్భంలో స్త్రీలు, వైశ్య శూద్రుల ఉల్లేఖన' అసంబద్ధం' కదా? స్త్రీ పాపి అయితే యావత్తు సృష్టియే పాపపు జన్ములవుతారే! పుణ్యాత్ములు పుట్టేదెలా? కన్నతల్లి స్త్రీని పాపి అనడమే మహా పాపం. శ్రీకృష్ణుని నోట ఇలాంటి 'అపశ్రుతి' వెలువడటం భగవద్వాణి ఔతుందా?"

"తప్పు నాయనా! భగవంతుని మాట తప్పు పట్టకూడదు. కళ్ళు పోతాయ్!"

''నేను భగవంతుని మాట తప్పుపట్టడం లేదు. 'స్త్రియంః... పాపయోనమః' అన్న మాట భగవానుని మాట కాదంటున్నాను."

"అది దేవుని మాట కాకపోతే గీతలో ఎలా ప్రవచింపబడింది?"

"పారాయణ గ్రంథాల్లో 'నరుని మాట నారాయణుని నోట' పలికించడం చాలా సులభం. మౌఖికంగా వస్తున్న శ్రుతి సూక్తుల్ని తాళపత్రాల్లో స్మృతిబద్ధం చేస్తున్నప్పుడు మౌలికంగా లేని మాటల్ని 'చొప్పించడం' ఎంతో గోప్యంగా జరిగిపోయేది. గ్రంథాల్లో ఇలా చొప్పించిన వాటినే 'ప్రక్షిప్తాలంటారు. వాటిని భగవద్వాణిగా ప్రక్షిప్తం చేస్తే భగవంతుని మాట ఎవరూ తప్పు పట్టలేరు కద? ఇలా తులసివనంలో గంజాయి మొక్కల్ని సాగు చేయడం ఆనాడే తెలుసుకున్నారు ప్రక్షిప్తకారులు. మహాభారతం భీష్మపర్వంలో ఉల్లేఖించిన గీతా శ్లోకాల సంఖ్యకీ, నేడు ప్రచారంలో ఉన్న గీతా శ్లోకాల సంఖ్యకీ ఎంతో వ్యత్యాసం ఉండటమే గీతలో మార్పులూ, చేర్పులూ 'చొప్పింతలూ' చోటు చేసుకున్నాయన్న ఐతిహాసిక సత్యాన్ని రుజువు చేస్తున్నది."

"ఇంతకీ నీ సోది ఏమిటి?"

"తులసి వనంలోని ఇలాంటి కలుపు మొక్కల్ని ఊడ బెరకాలి. గ్రంథ పవిత్రతని కాపాడాలి. ముందుగా వివాదాస్పదమైన ఈ గీతా ప్రవచనాన్ని సంశోధించి, సంస్కరించాలి."

''తప్పు పట్టడం సులభం. తప్పుదిద్దడం అసాధ్యం. నీది సదుద్దేశం అయినా సుసాధ్యం కాదు. ఎవరూ నీకు చేయూతనివ్వరు. ఆ తప్పుని తప్పు పట్టడమే తప్పని నిన్నే నిందిస్తారు. నీది ఒంటరి పోరాటమే."

"ఎవరికీ పట్టనట్టు పెద్దలు ఈ విషయంలో ముఖం చాటు చెయ్యబట్టే యువతరానికి పారాయణ గ్రంథాలంటే పవిత్ర భావం కలగడం లేదు. ఇంకా అభిజ్ఞులు ఉపేక్షిస్తే ఆఖరికి కలుపు మొక్కలే మిగులుతాయి - తులసి కనుమరుగవుతుంది! ధర్మం పేర 'తాలిబాన్లు' తయారవుతారు. అదే నా బాధ. పారాయణ గ్రంథాల్లోని ప్రక్షిప్తాల ప్రక్షాళనకి ఎవరూ ముందుకు రారా?"

*

# ఈగలు



ఎలికట్టె శంకరరావు

అపార్ట్‌మెంట్ల మీదికింకా పొద్దెక్కలేదు. మున్సిపాల్టోల్లు పొరకలతో రోడ్ల మీద తిరగాడుతుండ్రు. ఉస్మాన్ మటన్ షాపు షట్టర్ మీది మేకపోతు బొమ్మ పొగరుగా చూస్తుంది. షాపు ముందు ఒక్కొక్కటిగా వాహనాలు ఆగుతున్నయ్. కస్టమర్లు వొకరినొకరు పలకరించుకుంటుండ్రు. 'ఏందో ఈయిన పండుగపూట యింకా తీయలేదు' వో కస్టమరు పైజామ జేబుల సెల్లు మోగుతుంటే తీసుకుంట అన్నడు.

నల్లగొండల ఉస్మాన్ మటన్‌షాపు పేరుబడ్డది. ఎక్కడెక్కడ నుంచో నాలుగు కిలోమీటర్లు వొచ్చి గంటో రొండు గంటలో అయినా పడిగాపులు గాసి తీస్కపోతరు. అసుంట ఉన్న మటన్ షాపుల్ల కటికోల్లు ఈగలు కొట్టుకుంట కూసుంటే ఉస్మాన్ మటన్‌షాపులో మాత్రం ఎదురుసూపులు. రయ్‌యిమంటూ వో ఆటో వొచ్చి షాపు ముందాగింది. ఆటో డ్రైవర్ పక్క సీట్ల యిరికిరికి కూసున్న యిద్దరు పిలగాండ్లు హడావుడిగా దిగిండ్రు. ఒకడు తాళం చేతులు తీసుకొని షాపు షట్టరు ఎత్తితే, యింకోడు కత్తుల సంచి కటకటసప్పుడు చేస్తుంటే తీస్కపోయి లోపలేసిండు. ఆటోల ఉన్న బస్తాలను, ఎర్కలి గంపలను యిద్దరు పట్టి ఒక్కొక్కటి లోపలికి చేర్చుతుండ్రు. గంపల మీద ఉన్న యాటలను రొండు చేతులా రొండు తీస్కపోయి లోపలేస్తుండ్రు.

'అగో వొస్తుండు సూడు నవాబు' ఎదురు చూసే కస్టమర్లలో ఓ మనిషి – గొంతులో కాస్తంత వెటకారం, కాస్తంత సంబూరం. ఆ మాటకు అక్కడున్న గుంపులో కదలిక. అంతసేపు వాహనాల దాపున నిలబడ్డోల్లు వొక్కసారిగా షాపులకొచ్చిండ్రు.

ఉస్మాన్ ఆదర బాదరగా స్కూటరు పక్కకు పెట్టిండు. 'నమస్తే సార్... స్లామలేకుం సాబ్... నమస్తే అన్నా' అనుకుంట షాపులకు ఉరికినట్టే నడిసిండు. రొండంగలల్ల తను ఎప్పుడు నిలబడే కాడికిపోయి, గుడ్డ తీస్కొని ముందల అరుగును తూడ్సిండు. కింద ఉన్న మొద్దును అరుగు మీదికేసి సరిగ్గా పొందిందా లేదా చూసుకొని కత్తిపెట్టి గీకిండు. ఎర్రటి గుడ్డతో మొద్దును తుడ్సుకుంట 'రేయ్ అటు పక్కకు ఆ గంప మీద' అని ఆటో నుంచి తెస్తున్న పిల్లల పురమాయించిండు.

ఒంగబడి గబగబా వొక్కో యాటను అందుకొని కొక్కేలను తగిలించిండు. తోలు తీసిన యాటలు లేతగ తడితడిగా నిగనిగ లాడుతున్నయ్. ముదురు మేకపోతుల కర్పూరాలను కాల్ల సందున సదిరి బైటికి కనబడేటట్లు చేసిండు. ధనా ధన ఎడమ పక్కనున్న తరాజును, బాట్లను తూడ్సి వో సప్ప అందుకుండు.

అప్పటికే కస్టమర్లంత షాపు నిండి ఒకరికొకరు మోశేతులు తగిలేటట్లుగా నిలబడ్డరు. ముందుగా నిలబడ్డ వొకాయనను సూసుకుంట 'బోలియే సాబ్' అన్నడు ఉస్మాన్.

'కిలో యన్కసప్ప సూడు' అన్నడు కస్టమరు దిమ్మె మీద యాటదిక్కే చూసుకుంట.

ఉస్మాన్ సన్నటి కత్తి అందుకొని మాంసం మీది పల్సని పొరను, కొవ్వును తీసేస్తుండు. మాంసం లేత కొబ్బరోలిగ నిగనిగలాడుతుంది. కస్టమర్లు కండ్లు కొట్టకుంట అదే పనిగా సూస్తుండ్రు. ఉస్మాన్ మా చాల్గా ఒక్కొక్క సప్పను పొరలు పొరలుగా

తీస్తుండు.

షాపు ముందు బర్రుమని స్కూటరాగింది. ఒక యువకుడు హడావుడిగా దిగిండు. యెన్క వో పెద్ద మనిషి, జెనాన్ని తోసుకుంట లోపలికొచ్చిండ్రు.

ఉస్మాన్ కొద్దిగ తలెత్తి ఆ పెద్దమనిషిని 'పుల్లయా కాల్లు తల్కాయలబస్త ఆడుంది అందుకో' అన్నడు.

పుల్లయ్యకు యాభై యేండ్లాసర వుండొచ్చు. నల్లగ - చెంపలు, కండ్లు లోపలికి పీక్కపోయి ఉండు. దోతి పైకెగట్టిండు. ఉస్మాన్ మాటకు వొంగి బస్తందుకుండు.

పుల్లయ్యతో పాటొచ్చిన యువకుడు ఉస్మాన్ పక్కన యింకో మొద్దేసుకుండు. తేటగ జేసి, కత్తులు ఒకదానికోటి ఆనించి నూరిండు. ఉస్మాన్ కిలో జోకి 'యూసుఫ్ యేలో జల్దీకాట్‌కరో' అని ఆ యువకుని ముందలేసిండు.

'ఉస్మాన్ గంటయితుంది వొచ్చి ముందు అరకిలో కీమ కొట్టు లేటయితుంది' వో కస్టమరు ముందుకు తోసుకొచ్చి పైసలిచ్చుకుంట అన్నడు.

ఉస్మాన్ కండ్లకద్దుకుని గల్లలేసుకుండు. 'ఏక్ మినట్ సాబ్' అని కీమా మాంసం కోసం వెతికిండు. మెత్త మెత్తటి ముక్కలు తరాజులేసిండు. సరిపోక పోయేసరికి దొక్కను రొండు ముక్కలుగా నరికి వొడుపుగా బరెంక బొక్కలు తీసేసిండు. పల్సటి మాంసాన్ని తూకమేసి 'యే జల్దీ' అని కింద కూసొని కత్తి నూరుకుంటున్న పిలగాని ముందు ముద్దకుముద్ద యిసిరేసిండు.



మనుషుల మాటలు, కత్తులాడు తున్న సప్పుడు. స్టేషన్లో రైలాగినప్పుడుండే గందరగోళమోలిగ వుంది. కీమా పిలగాడు రొండు చేతుల్తో కత్తిపట్టి ఊపిరి తీయడం కూడా మర్సిపోయి యంత్రమోలిగ చేతులాడిస్తుండు. పటపటపట కటమని ఆగకుండా కొడుతుండు. బూరకు సన్నాయి తోడయినట్లుగా ఉస్మాన్, యూసుఫ్‌ల కత్తులు.

'ఉస్మాన్ తల్కాయుందా?' పొద్దున్నే లేసి స్నానం చేసి, మొకాన కొట్టొచ్చినట్లు కనబడే కుంకుమ బొట్టు పెట్టుకున్న కస్టమరొకడు ఆతురతగా అడిగిండు. ఆయన యింత నూనెపెట్టి తేటగ అనగదువ్విండు నెత్తిని.

ఉస్మాన్ తలెత్తి చూసిండు. ఇట్లాంటి మాటలు యినీ యినీ ఉండబటికేమో మొకం మీదికి నవ్వు తెచ్చుకొని 'కాల్లు తల్కాయలున్నయ్ సార్' అన్నడు. ఆ కస్టమరు కండ్లతోనే నవ్వుకుంట 'వో తల్కాయ నాల్గు కాల్లు' అని ముందల నిలబడ్డోల తల్కాయల మీదంగ చెయ్యి సాపి వో వొంద నోటు అందించిండు.

ఉస్మాన్ నోటును గల్లలేసుకుంట 'పుల్లయా చారీ సాబ్‌కు మంచి తల్కాయ సూసికొట్టు జల్దీ' అని కేకేసిండు. పుల్లయ్య పక్కన మూలకు తల్కాయల దిబ్బ కాల్చిన తాటిపండ్లోలిగున్నయ్. చారి వొంగబడి వొక్కక్క తాల్కాయను చేతులకు తీసుకుంట సూస్తుండు. దిబ్బ నడుమకు చేతిని పోనిచ్చి లావుపాటి తల్కాయను అందుకొని పుల్లయ్య ముందలేసి 'జల్ది కానీయ్' అన్నడు.

కస్టమర్లు ముందుకు తోసుకొస్తుంటే 'బైటియే సాబ్, కూసొండి అయిపాయె' అనుకుంట దబదబా నరుకుతుండు. ఉస్మాన్ మటన్ కోసే తీరు చూస్తే ఆశ్చర్యమేస్తది. పెద్ద పెద్ద సదువులు సదువుకున్న డాక్టర్లకు కూడా శరీర నిర్మాణం గురించి అంత బాగ తెల్వదేమో! ఏ బొక్కకు ఆ బొక్క, ఏ కండకు ఆ కండ మంచినీల్లు తాగినంత అల్కగ వేరు చేస్తడు. పొరలు పొరలుగా మాంసం చితికి పోకుంట వొల్సి తూకమేస్తడు. కూసున్న కస్టమర్లు కూసుంటే తోసుకునేటోల్లు తోసుకుంటుండ్రు.

'నేను చాలా సేపాయె వొచ్చి 'ఎవరిదో గొంతు గుంపుల నుంచి విసుగ్గా వినిపించింది.

'హోగయా సాబ్ పాంచ్ మినట్' అని ఉస్మాన్ వో దిక్కు సమాధానం చెప్పుకుంటనే చేతుల కత్తి ఆడిస్తుండు.

షాపు ముందు పుదీన కొత్తిమీర కట్టలమ్మే పది పన్నెండేడ్ల పిల్ల 'ఉస్మాన్ భాయ్ చిల్లరియ్యవా' అని యాభై నోటు అందించింది. 'ఆగు తల్లీ ఆగు యిస్తున్న' అని తరాజుల మాంసం పక్కకేసి గల్లా తీసిండు.

'ఉస్మాన్ జర్రంత లివర్' తూక మేస్తుంటే కస్టమర్ అన్నడు. 'జీరావ్ సాబ్' అని లివరేసి తూకమేసిండు. కస్టమర్ సంతృప్తి పడ్డడా లేదా అని మొకం కల్ల చూసిండు.

ఓ కస్టమర్ సెల్లు మోగింది 'ఆఁ యింకో అరగంట జెనం బాగుండ్రు' యింటి కాన్నుంచి ఫోనట్లుంది చెప్తుండు. కాల్లు, తల్కాయ, కీమా, లివర్, బోటి అని ఎవరో వొచ్చి అడుగుతనే వుండ్రు. మధ్య మధ్యలో రింగయ్యే ఫోనెత్తి 'జీసాబ్, అచ్చా సాబ్ ఆదాగంటేకేబాద్' అని ఉస్మాన్ చెప్తుండు.

షాపు తెరసి గంటయినా కస్టమర్లు యే మాత్రం తగ్గలేదు. తీసుకున్నోల్లు పోతుంటే కొత్తోల్లు వొస్తుండ్రు. షాపు కిటకిటలాడుతుంది. హడావుడిగా పని చేస్తున్న ఉస్మాన్ అదాటున ఏదో గుర్తొచ్చినట్లు కింది కొంగి వో యాటను ముందలేసుకుండు. టకటకా అరకిలో అరకిలో చొప్పున జోకి యూసుఫ్ ముందలేసి 'జల్దీ కాట్‌కరో ఆ లంజకొడుకొస్తడు' అని పురమాయించిండు.

ఉస్మాన్ తూకమేసుడు, యూసుఫ్ కొట్టుడు, కవర్లల్ల యేసి గంపలేసుడు... ఎదురు చూస్తున్న కస్టమర్లలో అసహనం పెరిగింది.

'ఏంది ఉస్మాన్ మేమీడ నీల్గి సస్తుంటే నువ్వెవరికో రానోల్లకు కొట్టిపెడ్తవ్?' ఎవరో వోయిసుమల్లిన కస్టమరు వోపిక పట్టుకోలేక అన్నడు.

'అర్ధగంట వోపిక పట్టాలె సార్. ముందు ఈ పీడ వొదిలిచ్చుకొని మీకిస్త. జర్ర అటుకూసోండి' అని కత్తి చేతితోనే దండం పెట్టిండు.

అయిదారు పొట్లాలు కిందబడేసరికి కస్టమర్ల వొత్తిడి పెరిగింది. అది పక్కకు పెట్టి మల్లా కస్టమర్లకు యియ్యటం మొదలుపెట్టిండు.

'బోటి వుందా?' జెనం నుంచి ఎవరిదో గొంతు. 'లేదు సార్' ఉస్మాన్ తల ఎత్తకుంటనే చెప్పిండు. 'అప్పుడే అయిపోయిందా ఏంది?' అదే కస్టమర్ మల్లా అడిగిండు.

'పండుగ పూట యాడదొరుకద్ది సార్ యింటికాడ కోసేటప్పుడే సుట్టపక్కల సాలోల్లంత ఎగబడ్డరు. అల్లకే సరిపోలేదు. ఈడిదాంక యాడొస్తది సార్' ఉస్మాన్ కస్టమర్ నొచ్చుకోవద్దని అసలు సంగతి చెప్పిండు. ఆ మనిషి 'ఉఫ్' అని గాలొదిలి నీరసంగా పోయిండు.

ఉస్మాన్ యిల్లు ఊరి బైట. కొనుక్కొచ్చిన మేకల తోలడానికి పక్కనే దొడ్డి. యాటలు యింటికాన్నే కోసి, తిత్తి తీసుకొని వొస్తడు.

ఉస్మాన్ షాపు రణగొణ ధ్వనితో గందరగోళంగా వుంటది. కస్టమర్లు ఉన్నపుడు నోటమాట రాకుంట ఎట్ల పనిచేస్తరో, జెనం పల్సగున్నపుడు అంత సరదాగా పనిచేస్తరు.

వోసారి ఎవరో కస్టమరు 'పుల్లయ్య రాలేదా?' అన్నడు తల్కాయ కొట్టే మనిషి లేకపోయేసరికి.

ఆ మాటిన్న యూసుఫ్ 'సచ్చిపోయి రొండు రోజులయింది సార్' అన్నడు సీరియస్‌గా మొకంబెట్టి.

'అయ్యో పెద్ద మనిషి మొన్న బానే వుండె' అన్నడు విచారంగ యింకో కస్టమరు.

'ఆయన నూకలు ఆడికి చెల్లినయ్ సార్. మనమేం జేస్తం?' అన్నడు యూసుఫ్ మటన్ కొట్టుకుంట.

పుల్లయ్యను యింతకుముందు చూసిన కస్టమర్లు అయ్యో అని బాధపడ్డరు.

మల్ల వారం పోయేసరికి పుల్లయ్య తల్కాయ కొడుతుండు. ఆశ్చర్యపోయి 'యూసుఫ్! పుల్లయ్య సచ్చిపోయిండని చెప్తివి గదనయా?' అడిగిండ్రు.

'అవ్‌సాబ్ మొన్న సచ్చిండు. మల్ల బతికిండు. ఇప్పటికి పదిసార్లన్న సచ్చి బతుకొచ్చు సార్' అన్నడు నవ్వుకుంట. కస్టమర్లు నవ్వుతుంటే 'మనిషి తాగుతడు సార్, దవఖాన్ల బడ్డడు బాగయినంక మల్లొస్తడు' అన్నడు. 'అయితే మాత్రం సచ్చిండని చెప్పాల్నా?' ఎవరో అన్నరు. యూసుఫ్ నవ్వుకుంట కత్తి ఆడించిండు.

కస్టమర్లు బోరుకొట్టి యేదో అడుగుతనే ఉంటరు 'అదేంది.' అని వో కస్టమరు ఉస్మాన్ పక్కన బుట్టల బొక్కలు యేస్తుంటే అడిగిండు.

'కుక్క మాంసం సార్' అన్నడు. నవ్వి మల్లా 'అది తీస్కపోయి కుక్కలకు పెడ్తరు సార్' అన్నడు.

సమయం దొరికినపుడు ఉస్మాన్ అయిన బాధలు చెప్పుకుంటుంటడు. 'ఎక్కడి పని సార్. తెల్లవార్లు నిదురుండదు. తెల్లారగట్ల లేసి కొయ్యాలె. మధ్యాహ్నం దాంక షాపు. తర్వాత మల్లెపల్లి, మిర్యాలగూడెం, మునుగోడు, నార్కట్‌పల్లి. యాడ అంగడుంటె ఆడికి పోవాలె. ఆడ బేరాలు పడ్తయ్ వొక్కోసారి పడవ్. సక్కగ గొల్లోల్లయితే బానే వుంటది గని నడుమ బ్రోకరు గాండ్లయితెనే మాకు యిబ్బంది. ఏదో బతకలేక ఈ పని చేస్తున్నా సాబ్' అంటడు.

చిక్కటి మీసకట్టు మెరిసే చెంపలతో ఉండే ఉస్మాన్ డిగ్రీ చదివిన్నని చెపుతడు. బతుకు తెరువు కోసం ఏదో చేయాలెగా సార్ అంటడు.

ఉస్మాన్ మల్లా అరకిలోలు జోకటం మొదలుబెట్టిండు. 'ఎవరికి అట్ల పొట్లాలు గడుతున్నవ్?' ఎవరో అడిగిండ్రు. 'కుక్క మాంసం సార్' అన్నడు ఉస్మాన్ మొకమంత జుగుప్సగా బెట్టి.

'కన్నమ్మ కష్టాలు పడుకుంట ఈ పంజేస్తం సార్ – యింత మందికి జీతాలెల్లాలె. మడిగద్దె, టెలిఫోను బిల్లు, కరెంట్ బిల్లు అయినా మా కష్టాలు ఎవరు జూస్తరు సార్? పైంగ పీక్కతినే నా కొడుకులు' ఉస్మాన్ బాధగా అన్నడు.

మున్సిపాల్టిలోల్లు పొరకలు చేతుల పట్టుకొనే వొచ్చిండ్రు. ఆడోల్లు నోట్లె పానేసుకొని నములుతుండ్రు. నోర్లు యెర్రగ పండినయ్. యెన్క మొగోల్లు నిలబడి చూస్తుండ్రు. ఉస్మాన్ గల్లల నుంచి యాభై నోటు తీసి ఆల్లకిచ్చిండు. 'ఈల్ల కిచ్చిన మంటె అర్దమున్నది సార్. తెల్లవార్లు నిదురగాసి పనిజేస్తరు. మున్సిపాల్టోల్లు నెల జీతాలు సరిగ్గ యియ్యరు. షాపు ముందుల పియ్యి పిడక యెత్తేస్తరు. ఈల్లకు ఎంతిచ్చినా తక్కువేసార్' అన్నడు.

అరకిలో పాకెట్లు యిరవైదాంక అయితే యేంచుకుంట వో పిలగాడు తెల్లబస్తలేసిండు. దాంట్లె వో కిలో పాకెట్ కూడా ఉంది.

లొల్లికి తట్టుకోలేక... మల్లా కస్టమర్లకు యియ్యటం మొదలుపెట్టిండు.

నుదుట సన్నటి తిలకం దిద్దిన వో పెద్దమనిషి 'అరకిలో కూర' అన్నడు. ఉస్మాన్ టకటకా తూకం యేసుకుంట 'అయ్యగారూ మూల్గలెయ్యమంటరా?' అన్నడు. పెద్దమనిషి ముసిముసిగా నవ్విండు యెయ్యమన్నట్లుగా.

ఇంతల్ల వో అడ్డ లుంగీ శాల్తీ బీడి తాగుకుంట 'వోఁఉస్మాన్ ఎన్నిసార్లు తిరగాలె యింట్లెకు షాపులకు' యిస్తవా బయిట తెచ్చుకోమంటవా?' అన్నడు. ఉస్మాన్ ఆ గొంతును గుర్తుపట్టి 'అయిపాయె బావా యిస్తున్న. ఆఁ చెప్పు?' అన్నడు. ఆ అడ్డలుంగాయిన అప్పటికి పదిసార్లు తిరిగొచ్చు యింట్లకు షాపులకు. నోరుతెర్సి అడగడు. సూస్తడు పోతడు. అయిన ఆ మడిగ వోనరని ఉస్మానే వోసారి చెప్పిండు. 'ఈనికి ముక్కెక్కువైనా కస్టమే బొక్కెక్కువైనా కస్టమే' అని గులుగుతడు వో ఉస్మాన్. అడ్డలుంగీకిచ్చి పంపి ఊపిరి పీల్సుకుండు.

జీన్ ఫాంట్, టీషర్ట్, డిప్ప కటింగ్‌తో వో మనిషి దూసుకొచ్చిండు. మీసం పైకి లేసింది. కండ్లకు నల్లద్దాలు. ట్రెయినింగ్ చేసిన సర్కారు మనిషోలిగుండు. వొచ్చుడొచ్చుడే 'అయ్యిందా?' కరుగ్గా అడిగిండు.

'జీసాబ్ పెద్ద పొట్లం వొక్కటైతే అయిపోద్ది'

'ఎంతసేపు?' హుంకరించి బయిట కుర్చీల కాల్లు బార్ల జాపి కూసుండు డిప్పకటింగ్.

ఉస్మాన్ వో సప్పును తీస్కొని ధనాధన్ రొండు కిలోలు జోకి తనే కట్ చేస్తుండు. విసుగ్గా, చికాగ్గా కట్ చేస్తుంటే కత్తి టకీమని వేలుకు తాకింది. బొటబొటా రక్తం కారుతున్నా లెక్క చేయకుంట కట్ చేసి కవర్ల యేసిండు. రక్తం మాంసంలో కలుస్తున్నా పట్టించుకోలేదు.

ఆ కవర్ కూడా బస్తలేసి 'హో గయాసాబ్' అని డిప్పకటింగ్‌కు చెప్పి 'సారెంటబోయి ఈ బస్త స్టేషన్ల యేసి రా' పిలగాన్ని తోలిండు.

తర్వాత తెగిన యేలుకు గుడ్డ కట్టుకుంటుంటే 'ఎవరికది?' ఎవరో కస్టమరు అడిగిండు.

'పండుగ గదా సార్ స్టేషన్ మామూలు' అన్నడు. ఉస్మాన్ కండ్ల నిండుగ నీల్లు. 'రెక్కలు పోయేటట్లు కొట్టుకోవాలె సార్ అడ్డమైన నా కొడుకుల్ని మేపాలె సార్' ఉస్మాన్ గొంతులో కసి.

'నీ రక్తం మాంసంలో పడ్డది సూస్కోలేదా? ఎట్లతింటరు?' ఎవరో మొకం చిట్లించుకుంట అడిగిండ్రు.

'రోజు వాల్లు తినేదే మనిషి రక్తం గద సార్' అన్నడు ఉస్మాన్ పంటి బిగువున బాధను మింగుకుంట.

*



# విశాఖ... నా.. విశాఖా! తూర్పు తీరపు దీపశిఖా!

ఎ. విద్యాసాగర్

విశాఖ! నా విశాఖ!!
మహాప్రస్థానాల వాటికా!
భావి మహోదయాల నాసికా!
తూర్పు తీరపు దీపశిఖా!

ఇసకపట్నం రోజులనాటి
జాలరిపేటవు కాదు విశాఖా
కోట నుంచి పేట దాకా అని
నేనీరోజూ నిను వివరిస్తే
నీకేం తెలుసు? విశాఖ గురించని
గేలిచేస్తారు విశాఖా!

వైశాఖేశ్వర దేవళం నుంచి
మొదలైన నీ ప్రస్థానం
ఇసకపట్నం రేవుకు
చేరంగానే అయిపోలేదు విశాఖా

భీమునిపట్నపు కనుసన్నలలో
నువ్వెంత కుచించుకుపోయావో...

ఎవడబ్బ సొమ్మనుకొనో
ప్రపంచాన్ని పంచుకొను
పొద్దుపోని సామ్రాజ్యాలు
జగాన్నతలాకుతలం చేస్తే
నీకూ పాట్లు తప్పలేదా! విశాఖా!
నువ్వే పాపం చేశావని
నీమీద బాంబుల వేట?

నానా జాతుల సమ్మేళనంగా
సర్వ జాతుల సంపుటంగా
విలసిల్లే జగాన్ని చూసి ఓర్వలేక
రాజ్య విస్తరణ రంధితో
ఏదో ఓ జాతివాడే
ప్రపంచానికి తానధినాథుణ్ణనుకుని
నాల్గు చెరుగులూ నావేనంటూ
నీ నెత్తిన ఓ బాంబు విసిరితే
చిన్నాభిన్నమయ్యా

అలలా తిరిగి లేచావు విశాఖా!
సముద్రం నుంచి
రోజూ నువ్వు నేర్చుకుంటున్నదదే విశాఖా!
ఒకప్పటి ఇసకపట్నం రేవువు
ప్రపంచ నౌకాశ్రయంగా మారేవు
ఎంతెత్తుకు నువ్వు ఎదిగిపోయావు! విశాఖా!

గురజాడ, గిడుగు రామ్మూర్తి,
ఆదిభట్ల, కోడి రామ్మూర్తి, సర్వేపల్లి,
కట్ట మంచి వారు, రావిశాస్త్రీ, శ్రీశ్రీలు,
నీతో పెరిగినవాళ్లే!
నీ జ్ఞాపకాలతో నీ ఒడిలో
నిదురపోతున్నారు విశాఖా!

నిత్యయవ్వని విశాఖా!
ఈదుకొస్తున్న మమ్ములను
నిను చేరుకోవాలని
ఉవ్విళ్ళూరేలా చేస్తున్నావు విశాఖా!

ఆసియా ఖండానికీ,
ప్రాగ్దిశా భారతానికీ,
హారతిపట్టే నిండు గడప నీ తీరం!
ఎన్ని దేశాలకు ఈ రేవు ముఖద్వారమో!
నానాటికీ కళలీనే
వే వెలుగుల ఈ విశాఖ!
ఎన్ని ఆశల సుఖసారమో!

పచ్చగ విరిసే మైదానాలు,
పరవశమై సాగే శారద, తాండవ నదులూ,
సాగర తీరంతో చెట్టాపట్టాలేసుకు
పడిలేచే తూర్పు కనుమలు!
కనుమల కడుపున దాగిన,
ధగద్ధగల మణులు
పాడేరు సీమలో నిండైన అడవులు,
అడవితల్లి ఒడిలో అలరారే గిరిజనులు
పునరుజ్జీవరతితో పరుగులెత్తు భీమిలి
అన్నిటినీ వీక్షించే అప్పన్నను అవధరించు
శ్రీగిరి మన సింహాచలం

అటు చూస్తే విశాఖ ఉక్కు
ఇటు చూస్తే ప్రగతి సాధనం
ఐఒసి పెట్రోల్, డీజిల్
సముద్రం సరసన నౌకార్ఖానా
షడ్రుచులకు సాయం పట్టే పామోలిన్
యువతరపు చిలిపిదాహం తీర్చే పెప్సీ,
కోలా
ఆంధ్రులెన్ని శ్రమలకోర్చితే
ఇన్ని పరిశ్రమలు
ఈ నేల రూపుదాల్చాయి!

ఒకప్పటి ఎల్లమ్మతోటే
ఈనాటి నీ జగజిగల జంక్షన్
ప్రతి ఫంక్షన్‌కూ తప్పని సరైన
జగదాంబ జంక్షన్
అధునాతన జీవన రూపు రేఖా,
జగదాంబ జంక్షన్ తోటి విశాఖ!
వాతావరణ కేంద్రం,
అదుపాజ్ఞల్లో నువ్వున్నట్టు లేదు! విశాఖా!
ఏడాదికి తొమ్మిదినెల్లు ఉక్కపోత!
మూణ్ణెల్లేమో ఊటీ, సిమ్లా!!

ఎగుడు దిగుడు వీధులు
ఎదురు బొదురు తోపులు
ఏమని చెప్పేది నీ చందం! విశాఖా!

దేశమంతా నిద్దర్లో ఉన్నా,
తెలతెలవారకముందే,
సంధ్యావందనం చేసుకొనే విశాఖా!
మధ్యాహ్నానికి చిరు అలసటతో
కునుకు తీసే విశాఖా!
సాయం వేళ ఎనిమిదికల్లా
కార్యాలన్నీ చక్కదిద్దుకుని ఇల్లు చేరుకొను
సత్ గృహస్తుల్లా
గౌరవప్రదమై విశ్రమించు విశాఖా!

ఇలానే ఉండు విశాఖా!
ఎంతెత్తుకు ఎదిగినా
మనశ్శాంతి కోల్పోకు విశాఖా!
ఎన్ని కళలు నేర్చినా
ప్రశాంతతను వదులుకోకు
నవజీవన సమరంలో
వీరునిలా ఉరకలెత్తు విశాఖా

విశాఖా! నా విశాఖా!!
మహా ప్రస్థానాల వాటికా!
భావి మహోదయాల నాసికా!
తూర్పు తీరపు దీపశిఖా!
విశాఖా! నా విశాఖా!
విశాఖా! నా విశాఖా!

# మల్లెపువ్వు ఏ దేశం మట్టిలోనైనా తెల్లగా నవ్వుతుంది

**ఒక రచన చేస్తే, ఒక కళని ప్రజల ముందు ఆవిష్కరిస్తే, ఒక కవిత చదివితే ఆ కళ, ఆ రచన, ఆ కవిత జీవితం పట్ల, సమాజం పట్ల నిర్దిష్ట వైఖరిని ప్రతిబింబించాలి. ఆ కళాకారుడు అనుకునే జీవితాన్ని, కోరుకునే బ్రతుకుని నిష్కర్షగా, విస్పష్టంగా ఆవిష్కరించాలి. జీవితాన్ని ప్రతిఫలించాలి. ప్రతిబింబించాలి. – కాదంటే అలా లేదంటే ఆ కళ, ఆ రచన, ఆ కవిత ప్రయోజనం సిద్ధించదు. జీవితంలోని అంతర్ బాహ్య రూపాల్ని విభిన్న కోణాలలో చూపించని కళ నిజంగా మనజాలదు.**

వై. శ్రీరాములు

**To Judge of Poets is only the faculty of the poets.**

మనిషి స్వేచ్ఛాజీవి. అయితే తన స్వేచ్ఛ సమాజానికి, ప్రపంచానికి ఆమోదయోగ్యమైనదిగా, న్యాయబద్ధమైనదిగా వుండాలి. అట్లాలేని, అట్లా కాని స్వేచ్ఛ, హింసాపరమై విశృంఖలతలకి దారితీసి సమజాన్ని చెడగొడుతుంది. అది స్వేచ్ఛ అనిపించుకోదు. ఆ వ్యక్తి స్వేచ్ఛ నియంతృత్వంతో సాగే అణచివేతగా అదే ప్రవృత్తిగా మారుతుంది. అది అటు సాటి మనిషికి, సమాజానికి చేటుగా తయారవుతుంది.

ఈ ప్రపంచంలో ఇన్ని ఘోరాలు, నేరాలూ, యుద్ధాలూ జరుగుతున్నాయంటే వ్యక్తి స్వేచ్ఛను తన అవసరాలకు ఉపయోగించుకొనే ప్రక్రియలో ఎదుటివారి స్వేచ్ఛను హరించడమే ప్రధానాంశంగా చేసుకున్న పర్యవసానమే. ఎవరి స్వేచ్ఛను వారు పొందే దిశలో, దశలో ఎదుటివారి స్వేచ్ఛని హరిస్తే, అది స్వేచ్ఛగాదు. పదిమంది కలిసి శ్రమించి పది మూటలు పండిస్తే, తలా ఒక మూటను పంచుకొనడం న్యాయం, ధర్మం. కాని, అందులో ఒక బలవంతుడు నాకే అన్నీ కావాలనో లేక సగభాగం కావాలనో చెబితే, బలవంతంగా లాక్కుంటే అది అన్యాయం, అధర్మం. ఇది అందరికీ తెలిసి చాలా చాలా సాధారణ న్యాయం. ప్రపంచం మొత్తం ఈ తగాదాల్లోనే సతమతమవుతూ పరస్పర ఘర్షణతో సంఘర్షించుకుంటోంది. చరిత్ర సారాంశమంతా దీనిమీదే ఆధారపడింది.

'The History of all hitherto existing soceity is the history of class struggles' మార్క్స్ ఏంగిల్స్ వారి కమ్యూనిస్టు ప్రణాళికలో ప్రథమ వాక్యం నిత్య సత్యం. అందుకే ఆర్థికపరమైన, శాస్త్రీయమైన సరైన ఆలోచనలతో మనిషిని మహోన్నతునిగా తీర్చిదిద్దే ప్రథమ క్రమంలో ప్రపంచానికి ఇచ్చిన అద్భుత కానుక, వెలుగు దీపిక. భూమండలంలో నివసించేవారిని, ప్రపంచం గురించి ఆలోచించే వారిని అతి ఎక్కువగా ప్రభావితం చేసే సిద్ధాంతం, మార్క్సిజం.

ప్రపంచంలోని అన్ని తత్వాలను శోధించి సాధించిన గడ్డకట్టిన మీగడ. అన్ని ఎత్తుగడల కోణాల్ని విశదీకరించి మనిషి నోటికి అందించిన తీపి చెరకు గడ. ప్రపంచం యావత్తూ మార్క్సిజం అనే యధార్థ సిద్ధాంతం నుంచి తప్పించుకోలేదు. 'Whether they wish it or know it or not all men and women, all over the earth are today to a certain extent the heirs of Marx and Marxism.'

కవి, కళాకారుడు – జీవితాన్ని, ప్రపంచాన్ని అత్యంత సౌందర్యంగా వుంచటానికి కావలసినన్ని ప్రయోగాలు చేస్తారు. శోధిస్తారు. వినూత్న కోణాల్ని, అభివృద్ధి రీతుల్ని, కళలపరంగా బహిర్గతం చేస్తారు.

'A true work of art and a work of literature is always an invention in form and discovery in content' **Leonid Leonov.**

ఒక రచన చేస్తే, ఒక కళని ప్రజల ముందు ఆవిష్కరిస్తే, ఒక కవిత చదివితే ఆ కళ, ఆ రచన, ఆ కవిత జీవితం పట్ల, సమాజం పట్ల నిర్దిష్ట వైఖరిని ప్రతిబింబించాలి. ఆ కళాకారుడు అనుకునే జీవితాన్ని, కోరుకునే బ్రతుకుని నిష్కర్షగా, విస్పష్టంగా ఆవిష్కరించాలి. జీవితాన్ని ప్రతిఫలించాలి. ప్రతిబింబించాలి. – కాదంటే అలా లేదంటే ఆ కళ, ఆ రచన, ఆ కవిత ప్రయోజనం సిద్ధించదు. జీవితంలోని అంతర్ బాహ్య రూపాల్ని విభిన్న కోణాలలో చూపించని కళ నిజంగా మనజాలదు.

'Man is born but he is found every where in chains' - అన్నాడు రూసో. నిజమే, ఒకరకంగా – ఒకప్పుడు. కాని ఇప్పుడు ఈ దేశంలో, ప్రపంచంలో మనిషి పుట్టడమే సంకెళ్ళలో పుడుతున్నారు. భారతదేశంలో ప్రస్తుతం పుట్టబోయే ప్రతి బిడ్డ అప్పుకు ఆస్తిపరుడే! రూసో అన్న వాక్యం భావనాపరంగా, తాత్వికంగా వర్తిస్తుంది. వాస్తవికంగా పరిస్థితి ఇంకా దారుణంగా, ఇంకా ఇంకా రుణదారుణంగా దారుణాతిదారుణంగా మారుతోంది. ఏ మనిషీ తనకు తాను సంకెళ్ళలోకి వెళ్ళడం లేదు. సంకెళ్ళు తయారుచేసిన సంకెళ్ళతో ఎదురు చూస్తోన్న, పూలదండల బదులుగా సంకెళ్ళ దండలతో ఎదురుచూసే సమాజంలోకి స్వేచ్ఛా యుత (born free)ని ప్రవేశింప చేస్తోంది వర్గ సమాజం.

ఏ సాహిత్యమైనా సమాజ క్రమాన్ని, పరిణామాన్ని, పరిణామ క్రమాన్ని అర్థం చేసుకొని సూటిగా స్పష్టంగా చెప్పడంలో సఫలీకృతమవుతుంది.

'To stand out side art is to stand inside society - CAUDWELL' అంతేకాదు జీవితం ఎలా ఉండేదో, ఎలా ఉందో, ఎలా వుండాలో చెప్పగలగాలి! కవికి, రచయితకి, సాహిత్యపరునికి నిర్దిష్ట వైఖరి వుండాలి.

'A poem is what happens when it is read' - **Coudwell.**

ప్రపంచంలో భిన్నమనస్తత్వాలు, విభిన్న ఆలోచనలు వున్నట్టే సాహిత్యరంగంలో విభిన్న రూపాలుగా వ్యక్తీకరించే విధానాలున్నాయి. అయితే అన్ని ఆలోచనలే కాని సరైన ఆలోచన ఒకటే ఉంటుంది. దాన్ని పట్టుకోవడమే నిజమైన విమర్శకుల లక్షణం అవుతుంది. ఇది కవిత్వానికి సంపూర్ణంగా వర్తిస్తుంది.

'A poem is a poem in any language' **Archibold Mechlesh.**

మనిషి, ఏ దేశంలోనైనా మనిషి మనిషే! రక్తంలో గ్రూపులున్నా నల్ల శరీరమైనా, తెల్ల శరీరమైనా రక్తం రంగు ఎరుపే!

మల్లెపువ్వు ఏ దేశంలోనైనా తెల్లగానే నవ్వుతుంది. ఆకాశం నీలంగానే అవుపిస్తుంది.

ప్రపంచంలో భిన్నత్వం వున్నట్టే విభిన్న కళలూ వున్నాయి. ఒక్కొక్కరొక్కో కళని చూసో, వినో ఆనందిస్తారు. ఒక్కో కళాకారుడు తన లోకంలోని విషయాలను చూసి, విని ఆకళింపు చేసుకుని తన కళని అభివృద్ధి చేసుకుంటాడు.

'Poetry is communicated before it is understood' - Eliot.

అసలు కొంతమంది వ్యక్తులే కళాకారులుగా ఎందుచేత తయారవుతున్నారు? ఇంకొంతమంది ఎందుచేత ఆయా కళలకు ఆకర్షితులవుతున్నారు. కవుల, రచయితల, పాఠకుల, కవితల్ని, నవలల్ని, కథల్ని కొంతమంది పాఠకులు చదువుతారు. పాటని, సంగీతాన్ని ఇంకొంతమంది ఆలపిస్తున్నారు. వాటిని ఇంకొంతమంది శ్రోతలు వింటున్నారు, ఆస్వాదిస్తున్నారు. తబలా, వీణ, షెహనాయ్ మొదలైన సంగీత పరికరాల నుండి జాలువారే వాద్య సంగీతానికి ఇంకొందరు, చిత్రలేఖనానికి ఇంకొందరు ఆకర్షితులవుతున్నారు. 64 కళలలో ఒక్కొక్క కళకి ఒక్కో పాఠక, శ్రోతల లోకం వుంది. అయితే అన్నీ కళలే! ఒక కళను ఎంతో ఇష్టంగా ఆస్వాదించే వారు ఇంకో కళను ఎందుకు ఆస్వాదించలేకపోతున్నారు? బహుశా కాలపరిమితి కావచ్చు. కాని కొందరు కళాకారులు, పాఠకులు, శ్రోతలు తమ కళలనే కాకుండా, అన్ని కళల్ని ఆస్వాదిస్తుంటారు. ఒక కళలోని లోతుని చూసి ముత్యాలని ఏరుకున్న కళాకారుడు, కళాభిమాని అన్ని కళాలోతుల్ని చూడాలనుకుంటాడు, చూస్తాడు. అన్ని కళలలో లభించే ముత్యాల్ని పదిలంగా దాచుకుంటాడు.

— — — — * * * — — — —

**సాహిత్యంలో, కళలో, గందరగోళ క్షామాన్ని ప్రోత్సహించే ప్రక్రియలు ఎట్టి పరిస్థితుల్లోనూ క్షేమం కాదు. విచిత్రంగా చెప్పడం జరిగినా, అది హృదయంపై చిత్రంగా రూపం దాల్చకపోతే వృథా! అందరికీ అర్థమయ్యే రీతిలో వ్రాయడమనేది, ఎందుకంటే! నువ్వు చెప్పేది నీ కోసమే అయితే సమస్యే లేదు. ప్రజల కోసమంటున్నావు! అక్కడే సమస్య.**

— — — — * * * — — — —

ఇంతకూ - ఒక వ్యక్తి కళాకారునిగా ఎలా రూపొందించబడతాడు? ఎలా ఆ మార్గంలో ప్రవేశిస్తాడు? ఒకరు చిత్రలేఖనంపై, ఇంకొకరు సంగీతంపై, ఇంకొకరు కవిత్వంపై, మరొకరు నాట్యంపై ఇలా భిన్న కళారూపాలకు ఎలా ఆకర్షితులవుతారు. అయితే మనిషి బుద్ధిజీవి. తను ఏమి కావాలో గ్రహించే దశకు చేరుకున్నాడు. ఆకర్షితుడవుతున్నాడు. ఆ ఆకర్షణ క్రమేపీ తనలో స్పందనను కలుగజేస్తుంది. ఆ స్పందన తాలూకు గాఢతలో పరిస్థితులు, పరిసరాలు తనలోని ఆలోచనా విధానాన్ని ప్రోత్సహిస్తాయి. క్రమేణా అభిమానం, ఆస్వాదన ఆ కళలోకి వెళ్ళి, తనను తాను ఆవిష్కరింపచేసుకోవాలని తహతహ లాడుతాడు.

ఇంకేముంది! ఆ కళలోకి వెళ్ళి తను తన్మయుడై, తనతోటి సహచరుల్ని తన్మయుల్ని చేస్తాడు. అంతేగాని పుట్టుకతో నోట్లో వేణువుతోనో, చేతుల్లో పెన్నుతోనో, తంబూరాతోనో, తబలాతోనో పుట్టుకురారు. పుట్టుకతోనే నేను కవినని, చిత్రలేఖకుడినని, నేను నృత్య దర్శకుణ్ణనే ముద్రతో పుట్టరు. అలా అయితే పుస్తకాలు చదవక్కర్లేదు. చూస్తూ, గమనిస్తూ, చదువుకుంటూ ప్రతి కళపై దృష్టి సారిస్తూ ప్రపంచాన్ని తెలుసుకుంటూ, తనకేది కావాలో ఆలోచిస్తూ, అనుసరిస్తుంటాడు మానవుడు. ఒక ఇంజనీరు, డాక్టరు ఎవరైనా సరే! 'అ, ఆ'ల నుంచి ఎ బి సి డిల నుండి తన పని మొదలు పెడతాడు, కళ కూడా క్రమేపీ, క్రమేణా జరిగే వ్యవహారమే! 'అభ్యాసం కూసు విద్య'.

ఏ కళైనా నిరంతరం తపనతో, నేర్చుకునే ప్రక్రియతో చివరికి అలవోకగా మారే విద్య. వస్తువుకు, పదార్థానికి తాత్విక నిర్వచనం ఇస్తూ మనిషి చేతిలో, చేతనలో ప్రతిబింబించి, ఇంద్రియానుభూతుల ద్వారా ప్రతిఫలించడం వల్ల మనిషికి అర్థమవుతుంది. అవగాహనవుతుంది, అవగతమవుతుంది. అంతులేని, అంతం లేని తృష్ణగా మిగులుతుంది. కళ ప్రయోజనం నెరవేరుతుంది.

"Matter is a Philosphical Catagory denoting the objective reality which is given to man by his sensations and which is copied, photographed and reflected by our sensations, while existing independently of them" **V.I. Lenin.**

సాంప్రదాయం, అభ్యుదయం, దిగంబరం, విప్లవం, స్త్రీ, దళితవాదం ఏదైనా, ఏ వాదమైనా, నాదమైనా, నినాదమైనా చివరికి చెందాల్సింది, చేరాల్సింది ప్రజలకే!

తాత్విక దృష్టి వున్న వాదాల నదులన్నీ చివరకు ప్రపంచాన్ని, సమాజాన్ని, మనుషుల్ని, జీవ చైతన్యంతో నింపి, ప్రకృతిని పచ్చగా మార్చడానికే, పరిమళాలతో మనిషిని అందంగా అలంకరించడానికే.

మనుషుల్ని ఉన్నతమైన, ఉత్కృష్టమైన జీవనం వైపు, ఉదాత్త మైన జీవన మార్గం వైపు పయనింపచేసేదే సాహిత్యం.

సాహిత్యంలో, కళలో, గందరగోళ క్షామాన్ని ప్రోత్సహించే ప్రక్రియలు ఎట్టి పరిస్థితుల్లోనూ క్షేమం కాదు. విచిత్రంగా చెప్పడం జరిగినా, అది హృదయంపై చిత్రంగా రూపం దాల్చకపోతే వృథా! అందరికీ అర్థమయ్యే రీతిలో వ్రాయడమనేది, ఎందుకంటే! నువ్వు చెప్పేది నీ కోసమే అయితే సమస్యే లేదు. ప్రజల కోసమంటున్నావు! అక్కడే సమస్య. అంతో, ఇంతో, కాస్తో, కూస్తో, సాహిత్యం చదివే వారికి కూడా నువ్వు అర్థం కావడం లేదంటే నీ పేరు చూస్తేనే పేపరు తిప్పేస్తారు. మరోవైపు ప్రజల్ని అర్థం చేసుకునే చైతన్యవంతులుగా తీర్చిదిద్దడం కూడా జరగాలి. ఎవరి సాహిత్య మైతే అర్థం కాలేదని కొట్టుకుంటున్నారో, ఎవరైతే తమ సాహిత్యాన్ని ప్రజలు అవగాహన చేసుకోలేకపోతున్నారని బాధపడుతున్నారో ఆ సాహిత్యకారులు, ఆ సాహిత్య ప్రక్రియ మేధావులు ప్రజల్ని ఆ ప్రక్రియల్ని అర్థం చేసుకునే మార్గంలోకి తెచ్చే ప్రయత్నం చేయాలి.

ఇంకా చాలామందికి కొత్తగా చెప్పాలనే తపన వుంటుంది కాని, అందులో

స్పందనలేకుండా వాక్య నిర్మాణాన్ని, పదాల్ని ఇష్టానుసారంగా అమర్చితే అది ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదు. సాహిత్యపు దరిదాపుల్లోకి రాదు.

ఉదా : చందమామ, వెన్నెల, పున్నమి, సూర్యోదయం, భూమి, ఆకాశం, నీరు, నవ్వు, మనిషి, రూపం, చేత, కోతి, పంట, పెంట ఇలా కొన్ని పదాలు ఒక కాగితంపై కుప్పగా పోసి ఒకదానికి ఒకటి అతికిస్తుంటారు కొందరు. వారి వాక్య నిర్మాణం ఇలా కొనసాగుతుంది.

'చేప వెన్నెల్ని తిని, పున్నమిలో ఆకాశాన్ని వాంతి చేసుకుంటుంటే మనిషిలోని పెంటను చూసి కోతి నవ్వుతోంది. చందమామలో నీరు రూపంగా మారిన క్షణం సూర్యునితో భూమి తలబద్దలు కొట్టుకుంటోంది'' (ఇది ఉదాహరణ మాత్రమే...) చదివిన ప్రతిసారి అందులో ఏదో ఉంది, కానీ మనకర్థం కావడం లేదనే అపోహకు నూతనంగా సాహిత్య రంగంలోకి అడుగుపెట్టిన వారికి కలుగుతుంది.

సాహిత్యమంటేనే అర్ధం కాని బ్రహ్మపదార్థమనే ఆలోచన కలిగి సాహిత్య రంగానికే దూరమయ్యే ప్రమాదమూ ఉంది.

విచిత్ర విన్యాసాలతో, వికార ఆకార అలంకారాలతో ఏం చెబుతున్నావో, ఎలా చెబుతున్నావో నిజంగా స్పందించే చెబుతున్నావా! అని తన్ను తాను నిలదీసుకోవాలి. ప్రశ్నించుకోవాలి.

చెప్పే వానికి స్పష్టత లేనప్పుడు, చదివేవారికి, వినేవారికి స్పష్టత ఎక్కడ నుంచి వస్తుంది.

నీ చిత్రణ, నిర్మాణం నీకే తెలియనప్పుడు గాలిలో ఎన్నియినా మేడలు కట్టొచ్చు. ఎదుటి మనిషి కళ్ళకు కనీసం వాటి తాలూకు గోడలు వాటి నీడలన్నా కనబడితేనే నీ మేడల్ని గురించి కనీసం వూహించడానికైనా ఆస్కారముంటుంది.

ఏ కాలంలోనైనా సాహిత్యం ప్రజల వద్దకు, ప్రజలలోకి చొచ్చుకుని పోకపోతే అది తాటాకుల్లోనో, రాగిరేకుల్లోనో వుంటాయి. నూతన కవిత్వం కాగితాల్లోంచి సెల్ఫ్‌ల్లోకి చేరుతుంది, చివరకు సాయంకాలం మరమరాలు కట్టి కొట్లో పొట్లంగా దర్శనమిస్తుంది. అందుకే చాలా ప్రబంధాలు ప్రజలలోకి వెళ్ళలేదు. కారణం ఒకప్పుడు రాజులు వారి ఆలోచనలు, వారి శృంగారాలు ఆలోచనా విధానంపైనే కావ్యాలు రాయబడ్డాయి. కాని ఇప్పుడు మనిషి కవిత్వం, మనసు కవిత్వం, ప్రజల కవిత్వం, వారి సమస్యలు, సంఘర్షణలు వారి మానసిక మర్మాల ఆవిష్కరణలు కవిత్వం. ప్రపంచం కవిత్వం, ప్రజలు, ప్రకృతి లేని కవిత వృధాగా మారే స్థితిగా మారే పరిస్థితికి వచ్చింది. అయితే ఎంత మారినా మనిషి, సాహిత్యకారుడు తన్ను తాను ప్రపంచంతో ఐక్యం చేసుకోకపోతే, ప్రజలలో మమేకం చెందకపోతే మనిషనే పదానికి, కళకి అర్థం, పరమార్ధం లేనే లేదు.

"Form is of no value unless it is the form of its content" - **Marx.** *

---

# అమలిన శృంగారం

**తుల్లిమల్లి విల్సన్ సుధాకర్**



మానమే పవిత్రతకు చిహ్నంగా
నమ్మకమే పెట్టుబడిగా
హృదయాలిక్కడ ముడిపడుతున్నాయి...
ప్లేబాయ్ చేష్టలూ - వెస్ట్రన్ థాట్‌లూ
సరిపడని కాన్వాసు మీద
శృంగార పడవ
వరద గోదావరిలాంటి
పెళ్ళి గట్టు దాటేదాకా
ఓపిక పట్టే ఆనవాయితీకి
వారసత్వం మనది!
శారీరక సుఖం కోరని ప్రేమ
కాల పరీక్షకు గట్టిగా నిలబడుతుంది
'ఫైర్ వర్క్' బుద్ధుల్ని
నమ్మకం వప్పించి తీరుతుంది
హృదయాలు బాధ పడకుండా
వద్దని సున్నితంగా చెప్తుంది!
కట్టుబాటులేని కామోద్రేకాలూ
నమ్మకం లేని ప్రేమలూ
ఏ బంధానికి నిలబడతాయి గనక...!
మేకులు కొట్టని అందమైన భవనం
గాలికి పేకమేడలా కూలిపోదూ...!

ఐనా.... బాణాసంచా వెలుగులు
క్షణకాలమేకదా!
మొగ్గ వికసించినట్లే బుద్ధి
వికసించాల్సిందే...
అవయవాలూ ఎదగాల్సిందే
అంతఃసౌందర్యమూ వెల్లివిరియాల్సిందే...
వికసించని మొగ్గలకు ఉండేది
ఒట్టి భావోద్వేగాలే కదా!
శృంగార క్రీడలో
రెండు శరీరాలు ఏకమైనట్లు
శీలం ఇద్దరికీ కావల్సిందే!

రుచిని కోరాలంటే వైన్ పాతబడాల్సిందే!
పెళ్ళికి ముందస్తు శృంగారం
పిందెనే పండనుకుంటూ
రసం పిండుకున్నట్లే...
విలువల్లేని రసికతకు
వలువల్నెలా తొడుగుతాం...!
కొనేముందు కారు నడిపి చూడొచ్చేమో!
బేరానికి ముందు
బూట్లు కాలికి తొడిగి
చూడొచ్చేమో!
'వర్జినిటీ' మాత్రం
వాడేసిన వస్తువు కాకూడదు...
శృంగారమెప్పుడూ
'టెస్ట్ డ్రైవ్' కాకూడదు...
భౌతికానుభవాల కన్నా
జీవితానుభవాలూ - మానవ సంబంధాలూ
బుక్‌మార్కులుగా మిగిలిపోవాలి

(కుష్బూ చేసిన సంచలన వ్యాఖ్యలను
చదివిన తర్వాత)

# సమీక్షా పర్వం

* నేను - మా అమ్మ "హరికతలు"
* గుండె లోతుల్లో నుండి జారిన "భాష్పం"
* జాషువాపై ఒక సమగ్రాధ్యయనం
* ఉద్యమాన్ని శ్వాసించే జీవితం ఒక ఉద్యమం
* కల - వరం

నాగసూరి వేణుగోపాల్




## నేను - మా అమ్మ 'హరికతలు'

అమ్మ అంటే ఎవరికిష్టం ఉండదు? చదువు, ఉద్యోగాలు కారణంగా బలవంతంగా అమ్మకు దూరం కావడం మరో దృశ్యం. చుట్టం చూపుగా సెలవురోజుల్లో అమ్మను కలవడం ఏమిటి? అప్పుడే అమ్మ మీద, అమ్మ ప్రేమ మీద, అమ్మ త్యాగం మీద మక్కువ పెరుగుతుంది. అమ్మకు దూరం కావడంతో అమ్మతనం మీద గౌరవం ఇనుమడిస్తుంది.

నేనూ మా అమ్మ – అనే పుస్తకం పేరు కళ్ళను విప్పారజేస్తే అట్ట మీది అమ్మ – కొడుకుల చిత్రం జ్ఞాపకాల వైపు నడిపింది. తరువాత రచయిత పేరు సన్నాఫ్ ఎస్. కృష్ణవేణమ్మ అని చూడటంతో ఒక రకమైన ట్రాన్స్. ఇదివరకు రచయితలు అమ్మకు ఎంతో గౌరవం యిచ్చి వుండవచ్చు – కానీ యిక్కడ కొత్త శిఖరం. అందుకే ఇంత గౌరవం. అట్ట తీసి లోపలికి పోగానే 'నేనూ మా అమ్మ హరికతలు'. అవును కతలే! హరికిషన్ రాశారు గనుక హరికతలు – ఎంత బావుంది? కర్నూల్ బుక్ ట్రస్ట్‌కు అభినందనలు.

పుస్తకం లోపలికి వెళితే విషయ సూచిక 'జ్ఞాపకాల వరుస'గా పలకరిస్తుంది. ఇంట్లో నాకు మరియాద ఎట్లా పెరిగినాదంటే... అంటూ మొదటి కత మొదలవుతుంది. "ముగ్గురిలోకీ నేను చిన్నాన్ని. అదే నా చావుకొచ్చింది. ఇప్పుడు చూడ్డానికి పెద్ద రౌడీ లెక్క బలంగా ఉన్నాను గానీ... అప్పట్లో అమాయకంగా సన్నగా వుండేటోన్ని. మా అన్న, అక్కా ఇద్దరూ చెప్పిన పని చెయ్యకుంటే కాని దానికీ, అయిన దానికీ నన్ను మొత్తంగా కిందా, మీదా యేసి తన్నేటోళ్ళు. పుడ్తే యింట్లో పెద్ద పిల్లోని లెక్క పుట్టాలిగానీ సిన్న పిల్లోడి లెక్క పుట్టునే పుట్టకూడదు.... అంటూ ఒకే జ్ఞాపకాల వరద మిమ్మల్ని జ్ఞాపకాల్లోకి, కర్నూలుజిల్లా మాండలికంలోకి హాయిగా తీసుకువెడుతుంది. అన్న, అక్క యిబ్బంది పెడుతున్నారని యింటి నుంచి పారిపోవడం, హోటల్‌లో బాయ్‌గా పని చేయడం, దొరికి మరలా యింటికి రావడం, రావడంతో మర్యాద పెరగడం మొదటి కత. "... మా అమ్మ నేను పోయినప్పట్నుంచి ఏడ్చీ, ఏడ్చీ లోతుకు పోయిన కండ్లతో, అన్నం సరిగా తినక పీక్కుపోయిన మొఖంతో బ్రతికున్న శవంలా ఉంది. అమ్మ నట్లా చూస్తానే నా కండ్లలో కూడ నీళ్ళు సర్రున కారిపోయినాయి..." అంటూ మనకు కూడ కంట నీరు తెప్పిస్తాడు రచయిత హరికిషన్.

మొదటి కత తల్లి మనసునూ, పిల్లాడి సున్నితత్వాన్నీ మనకు స్పృశింపచేస్తే – రెండవ కత "నమో వెంకటేశా నమనమో తిరుమలేశా" అప్పటి గ్రామీణ దృశ్యాన్నీ, ఊరి బయట వుండే టెంటు సినిమాకు వెళ్ళే పల్లె వారి సందోహాన్నీ మన ముందు పెడతాయి. ఘంటసాల పాడిన ఆ పాట ముగియడం, సినిమా మొదలవడం ఒకేసారి జరుగుతుంది. ఆ పాట మొదలయ్యింది పంచె కట్టుకునే పెద్దాయన, చీర సర్దుకునే అమ్మ, పాపిట సరిగా రాలేదనే అక్క, నిక్కరు బొత్తా పోతున్నాయని తమ్ముడు, జేబులో శెనక్కాయలు ఎక్కువ పట్టలేదని అన్నయ్య – వీరంతా పాట మొదలవగానే పరుగు లంకించుకుంటారు – టూరింగ్ టాకీసు దగ్గరికి. ఇప్పటి తరం వారి చెంతనే టీవీ, చేతిలో రిమోటు ఉండటంతో ఈ అనుభూతులు అర్థం కావు. లేకపోతే రచయిత రెండవ కత ముగించి నట్టు "... ఇప్పటికీ... ఎప్పుడన్నా... ఎక్కడన్నా ఆ పాట వినబడ్డ మాలస్యం నాకు వెంటనే మా వూరు... సినిమా టాకీసు... ఆకాశం... చాప... వుడకులాట... గుప్తకొచ్చేసి మనసంతా నోట్లో పూర్ణం కజ్జికాయ పెట్టుకుని నమిలినంత కమ్మగా ఐపోతాది..." ఈ జ్ఞాపకాల వరదలో మునగడవు కానీ, తెలియనవారికి చెప్పడం వృథా ప్రయాసే :

చిన్న వయసులో చేసిన బుల్లి దొంగతనాలు వివరం ఇది. "ప్రిన్స్ ఛార్లెస్... ఛార్లెస్ శోభరాజ్ ఎట్లయినాదంటే..." అనే మూడవ కత. దెబ్బతీసిన అన్నయ్యను మరింత పెద్ద దెబ్బ తీసి – అమ్మతో దబ్బులు గుంజి, అన్నకు చివాట్లు పెట్టి – విజయగర్వంతో ఐస్‌క్రీమ్ తింటా వుంటా...అబ్బ... అప్పుడు... ఆ ఆనందం" ఏమని వర్ణించను" అనే నాలుగో కత.

ఈ కతలన్నింటిలో తలమానికం – "సన్నాఫ్ ఎం. హుసేనయ్య... రచయిత" నాకా ఫొటో చూస్తే ఓహో ఈయనేనా మా నాయన అనిపిస్తాదే గానీ, గుండెల్లో అంతకుమించి కాస్త కూడా చెమ్మ కలుగదు. మనసులో ఆ రూపం కాస్త కూడా ముద్రపడలేదు" అని అంటాడు. ఎందుకంటే చదవండి "మీ నాయన పేరేమిట్రా – అంటే

హుసేనయ్య అన్న. ఏం చేస్తాడు అనడుగుతే గొంతుకేదో అడ్డంపడి ఏమీ చెప్పలేక తలదించుకున్నా. పక్కనున్నోడు "సార్... వీనికి నాయన లేడు సార్... సచ్చిపోయినాడు" అన్నాడు నవ్వుతూ గట్టిగా. నా కండ్లలో నీటి పొర కమ్ముకొచ్చి... గొంతు తడారకపోయింది. అంతలో సారు ఏరా... కొవ్వా... సచ్చిపోతే... సచ్చిపోయినాడని సెప్పాల గానీ... అట్లా మూగెద్దు లెక్క మట్టసంగా నోరు మూసుకుని నిలబడ్తావా సెప్పు గట్టిగా" అంటూ చేతిలో బెత్తం పట్టుకుని గదిరిచ్చినాడు. ఆ రోజు ఆ మాట చెప్పడానికి ఎంత విలవిలలాడి పోయినాను. ఇప్పుడు గనుకయితే ఎగిచ్చి తందును ఆనా కొడుకుని. చెప్పండి. మీ కళ్ళలో చెమ్మ కలిగిందా? అందుకే ఈ పుస్తకం రచయిత డాక్టర్ ఎం. హరికిషన్ సన్నాఫ్ ఎస్. క్రిష్ణవేణమ్మ!

ఇంకా మరో ఆరు కతలున్నాయి. అన్ని చెబితే - మీకు మజా ఉండదు. పుస్తకం చదివినపుడు మీ అనుభూతి మరింత కొత్తగా ఉండాలి. అందుకే త్వరగా చదవమని, అనుభూతుల వర్షంలో తడవమని - విన్నపం. అయితే ఒక్కమాట - దేముడా... నా బిడ్డ సల్లగుండాలి అనే ఆఖరి కత - పతాక సన్నివేశంలా అమ్మను హిమాలయాలపై నిలిపింది.

పుస్తకం ముగియగానే - అయ్యో పుస్తకం అయిపోయిందే అనుకుని - ఎవరికి వారు బాల్యంలోకి జారిపోవడం ఖాయం. ఇటువంటి కతల సంపుటి కావాలంటే అధికారాల దొంతర మాత్రమే కాదు, సామాజిక వాస్తవానికి చక్కటి చిత్రిక కూడ! నిజానికి అంతా బిజీగా, గజిబిజిగా వుండే ప్రస్తుత పరిస్థితిలో - ఇటువంటి పుస్తకం చదవడం ఒక మధురమైన స్వప్నంలో గడపడం లాంటిది.

**నేనూ మా అమ్మ - హరికతలు**

**రచన : డాక్టర్ ఎం. హరికిషన్**

**తల్లి : కృష్ణవేణమ్మ**

**ప్రచురణ : కర్నూలు బుక్ ట్రస్ట్ 2005**

**ప్రతులు : రచయిత 45/205-1, లేబర్ కాలనీ చర్చ ఎదురుగా టీచర్స్ కాలనీ, కర్నూలు.**

---

**వి. ప్రతిమ**

'మౌనభాష్పం'

సుజనారామం

## "గుండె లోతుల్లో నుండి జారిన 'భాష్పం'

భార్యాభర్తలిరువురూ ఒకే రంగంలో అందునా సాహితీ రంగంలో కలిసి పనిచేయడం చాలా అరుదుగా కన్పిస్తుంది... అటువంటి అరుదైన జంటల్లో ఒకటి సుజనారామం, పెరుగు రామకృష్ణల జంట...

అయితే సుజనలో నచ్చే విషయమేమిటంటే అతడితో కలిసి జంటగా రాయకుండా జంటగా వుంటూనే సొంత గొంతుకను కలిగి వుండటం... సొంత ఆలోచనలనూ, అభిప్రాయాలనూ తనదైన శైలిలో వ్యక్తపరచడం...

శూన్యమూ, స్త్రీ వేరు వేరు కానటువంటి ఒక పరిస్థితి సమాజంలో వున్న విషయాన్ని గుర్తిస్తుందామె కలం. తన ఆశలన్నీ దాచి వుంచి యింటిల్లిపాది ఆశల్ని ఫలింప చేసినప్పటికీ కూడా చివరికి మిగిలింది స్త్రీ లోపల శూన్యం... స్త్రీ చుట్టూ శూన్యం... పెదవి దాటకుండా గుండె లోతుల్లో నుండి జారిన 'మౌన భాష్పం'....

సుజనారామం వెలువరించిన కవిత్వ సంపుటి 'మౌనభాష్పం'.

అయితే ఆడపిల్లే పుట్టిందని అమ్మ ఏడవడం వెనక ఎంత పెద్ద అణచివేత సమాజం వుందో, అమ్మ ఎందుకు ఏడ్చిందో... అమ్మ జీవితమంతా రకరకాల కారణాల మూలంగా ఎందుకు ఏడుస్తూనే వుందో... తనలాగే తన కూతురు లేదా మరో స్త్రీ ఈ భూమ్మీద అందరి ఆధిపత్యాన్నీ ఎదుర్కొంటూ దుఃఖించడానికే పుట్టనవసరం లేదని మాత్రమే అమ్మ ఏడ్చిందని కవయిత్రికి తెలీకుండా ఏం పోలేదు...

తెలుసు కాబట్టే మౌన భాష్పాన్ని విడవగలిగింది... స్త్రీల మౌన జీవితాల వెనక మౌన భాష్యాలూ... మౌన భాష్పాలూ మాత్రమే కదా వుంటాయి...

'నువ్వు ఆడపిల్లవి' 'ఆడపిల్లవి' అన్న అనేక లక్ష్మణ రేఖల్ని దాటుకుంటూ దాటుకుంటూ ఒక గొప్ప నిర్ణయాన్ని తీసుకున్నాక పావురమై ఆకాశంలో కెగురుతుందామె...

సృజన గొంతు సున్నితమైనదైనప్పటికీ... దృఢంగా పలుకుతుందనడానికి గుర్తు 'బ్రతుకురాట్నం' కవిత... ఈ కవిత ఈ సంపుటికే తలమానికం... స్త్రీలు ఎలా గానుగెద్దుల్లా బతుకు రాట్నాన్ని నిర్విరామంగా తిప్పుకుంటూ, తిప్పుకుంటూ పోయి సారం అంతా పీల్చబడిన తర్వాత ఎలా చెరుకు పిప్పిలా విసిరి వేయబడతారో ఆర్తిగా చెప్తుందీ కవితలో

'కరుణలేని కాలం
వృద్ధాప్యపు నీడల్లోకి నెట్టేసిన క్షణం
......
బిడ్డలచే 'వేస్ట్ మెటీరియల్'గా విసరబడి
కన్నీటిలిపిగా ఆవిరయిపోతాను' అంటుంది.

'కన్నీటి లిపి' అన్న పదం ఆర్ద్రంగా పొరకుడి హృదయాన్ని తాకుతుంది,.. కన్నీటికి ఒక భాష వున్నట్లయితే ఆ భాషకి ఒక లిపి వుంటే... ఈ కన్నీటి పుటలు చరిత్రలో ఎలా భద్రపరచబడతాయి....? అన్పిస్తుంది -

జీవితమంతా నటనే అయినప్పటికీ మరణంతో మాత్రం మనం నటించడం కుదరదంటుంది కవయిత్రి... అయితే ఎంతటి శూన్యంలోనయినా ఆ నేస్తం వుందనే ఆశ ఊరడింపునిస్తుందని ప్రకటిస్తుంది.

అంతమాత్రం చేత ఈ కవయిత్రి - నిరాశావాది అనుకోవ డానికి లేదు. ఆమె ఆలోచనలన్నీ కుటుంబ పరిధిలోని మౌనభాష్పాలు, అత్తయ్య చిరునవ్వులకు మాత్రమే పరిమితం అనుకుంటే పొరపాటే... తన చుట్టూ వున్న సమాజంలోని లోతుపాతులన్నీ కూడా ఆమె హృదయ స్పందనలే... ఆమె కవితా వస్తువులే...

పాక్ ముద్దుల చిన్నారి ఫాతిమా గుండె ఆపరేషన్ గురించి భారత్, పాక్‌ల మధ్య బస్సు పునరుద్ధరణ గురించి మంచి 'ఆశాజ్యోతి'ని

వెలిగిస్తుందామె కలం...

అయితే ఈ మొత్తం కవితా సంపుటిలో పంటి కింద రాయిలా తగిలిన వాక్యాలు

"పితృస్వామ్యం వెనుక
విజయకేతనం ఎగురవేస్తున్నది
ఇవాళ మాతృస్వామ్యమే"

లోతైన సమాజ జీవితాన్ని చూడగల్గిన ఒక కవయిత్రి ఈ మాటలు అనడానికి ఎంతమాత్రం అవకాశం లేదు... దీని వెనకనున్న పితృస్వామ్యాన్ని అంచనా వేయాల్సిందే మరి...

కొంత శ్రద్ధ తీసుకుని, సమయం చూసుకుని అధ్యయనం సాగించగలిగితే... జీవితాన్నీ, సాహిత్యాన్ని కూడా అధ్యయనం చేయగల్గితే ఈ కవయిత్రి కలం నుండి లోతైన కవిత్వాన్ని మనం ఆశించవచ్చు...

హిందీలోకి కూడా అనువదించిన కవితలతో వున్న 'మౌనభాష్పం' అన్ని పుస్తకాల షాపుల్లోనూ లభ్యమవుతోంది. చదివిన ప్రతి పాఠకుడి గుండెనూ తడుపుతుంది... చిరంజీవి అనువాదం చక్కగా కుదిరింది...

**(పేరు : మౌనభాష్పం, కవయిత్రి : సుజనారామం)**

---

**మసునూరి రవీందర్**

# జాషువాపై ఒక సమగ్రాధ్యయనం




గుర్రం జాషువా అనగానే సాహిత్యకారులకు రెండు రకాల విషయాలు గుర్తుకొస్తాయి. ఒకటి జాషువా - దళితుడిగా అనుభవించిన కులవివక్ష, రెండు జాషువా అంటరాని తనంపై సంధించిన పద్యాలు. జాషువాపైన సాహిత్య ప్రముఖులు, విమర్శకులు రచించిన వ్యాసాలలో, సంకలనాల్లో కూడా ఈ విషయాలే కనిపిస్తాయి. కానీ ప్రముఖ విమర్శకులు రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి రచించిన "జాషువా స్వప్నం - సందేశం' ఇందుకు భిన్నంగా కనిపిస్తుంది. జాషువాను, జాషువా రచనలను మార్క్సిస్టు విమర్శనా దృక్పథం నుండి అర్థం చేసుకున్న తీరు పాఠకులకు ఇట్టే అర్థమవుతుంది. ఇప్పటి వరకు జాషువాను విమర్శకులంత ఒకటి రెండు కోణాల నుండే చూశారు. ఆ విధంగానే జాషువాను పరిచయం చేస్తూ వచ్చారు.

కానీ, రాచపాళెం వారు భౌతిక, తాత్త్విక దృక్పథంతో జాషువాను ఒక నూతన కోణంతో ఆవిష్కరించారు. జాషువా తాను ఏం కోరుకున్నాడు. ఏం కలగన్నాడు, సమాజానికి ఏ సందేశాన్నిచ్చాడో చిన్న పుస్తకంలోనే ఆవిష్కరించారు. నిజానికి ఈ పుస్తకం, పుస్తకంకాదు. 2001లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం జాషువా సాహిత్యంపై నిర్వహించిన జాతీయ సదస్సులో సమర్పించిన ప్రసంగ పత్రం. ఇది ఒక వ్యాసమే అయినప్పటికి జాషువా సాహిత్యాన్ని, దృక్పథాన్ని, జాషువా ఆలోచన పరిణామంలో వచ్చిన మార్పుల్ని సమగ్రంగా మన కళ్లముందుంచుతుంది. జాషువా తన కంటే ముందు కవుల లాగా ఏం కలగన్నాడో, తాత్త్వికంగా, సాంఘికంగా, దళిత సమైక్యతను కోరుతూ, స్త్రీపురుష సమానత్వాన్ని కాంక్షిస్తూ ఇచ్చిన సందేశం ఏమిటి, జాషువా రాజకీయంగా ఎవరిని అనుసరించాడు. స్వతంత్ర భారత రాజకీయంపై జాషువా చేసిన విమర్శలేమిటి అనే అనేక విషయాలు కేవలం ఈ పుస్తకంలో మాత్రమే లభ్యమవుతాయి.

పుస్తక ప్రారంభమే ఒక విశాలత్వాన్ని సమకూర్చుకున్న ఔచిత్యాన్ని పాఠకులకు అందిస్తుంది. కళ్లముందు కనిపిస్తున్న పరిణామాలకు చారిత్రక కారణాల్ని వెదకడం కొద్ది మంది విమర్శకుల్లోనే కనిపిస్తుంది. జాషువా కంటే ముందు ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన పరిణామాలు, అవి భారతదేశంలో తెచ్చిన మార్పులు, బ్రిటీషు పాలకులు భారతదేశంలో ప్రవేశించడం, స్వాతంత్రోద్యమం, సంఘ సంస్కరణోద్యమం విజృంభించడం మొదలగు పరిణామాల్ని నేపథ్యంగా వివరించారు రచయిత. ఈ నేపథ్యంలో "బాగా అదును పదును గల నేలలోంచేగాక, రాతి పగుళ్లలోంచి కూడా విత్తనాలు మొలకెత్తసాగాయి. అలా సాంఘిక, ఆర్థిక రాతి పగుళ్లలోంచి మొలకెత్తిన సాహితీ విత్తనమే గుర్రం జాషువా" అని జాషువా ప్రస్థానం ఎలా బయల్దేరిందో చక్కగా వివరించారు. జాషువా జీవితాన్ని ఆ విధంగా పరిచయం చేసి జాషువా రచనలైన కావ్య ఖండికలు, ఖండకావ్యాలు, నాటకాలు, నవలల్ని స్థూలంగా పరిచయం చేశారు.

జాషువా అభివ్యక్తి, వాహికగా పద్యాన్ని ఎంచుకున్నప్పటికి, ఆర్థిక, సాంఘిక, అసమానతల్ని, రాజకీయ అవినీతిని ఎప్పటికప్పుడు నిశితమైన పదజాలంతో ఎలా విమర్శించాడో, అన్ని రకాల సమానతలతో కూడిన సమాజాన్ని ఎలా కోరుకున్నాడో ఈ పుస్తకంలో రచయిత వివరించారు. రచయిత జాషువా స్వప్నం గురించి చెబుతూ... అంతకంటే ముందు తత్వవేత్తలకు, సామాజిక శాస్త్రవేత్తలకు, కవులకు, రచయితలకు ఎలాంటి స్వప్నాలుంటాయో వివరించారు. ప్లాటో, హక్స్లే, మార్క్స్, గాంధీజీ, అంబేద్కర్ ఎలాంటి సమాజాన్ని కావాలని, కలగన్నారో తెలిపారు. అంతేగాక సాహిత్యపరంగా నన్నయ్య, పాల్కురికి సోమన్న, వేమన, గురజాడ, ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీశ్రీ, విశ్వనాథ మొదలగు సాహిత్యకారులు ఎలాంటి స్వప్నాన్ని ప్రతిపాదించారో చెప్పారు. ఫ్రెంచి విప్లవం ద్వారా సమాజంలోకి వచ్చిన 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం'తో కూడిన సమాజమే జాషువా ఆశించిన సమాజ స్వప్నమని రాచపాళెం వారు నిరూపించారు.

జాషువా సాహిత్య పయనంలో గాంధీ, అంబేద్కర్‌ల ప్రభావం ఏ మేరకు ఉందో పద్యాల్ని ఉదాహరణ సహితంగా పేర్కొన్నారు. ఆయన ఆశించిన సమాజ స్వప్నానికి అడ్డంకిగా ఉన్న సామాజికాంశాలను ఏ విధంగా విమర్శించారో తెలిపారు.

ఆ తరువాత జాషువా సాహిత్యం ద్వారా అందించిన సందేశం ఎన్ని రకాలుగా ఉందో విభజించారు. మొదట తాత్విక సందేశం. ఆ తరువాత సాంఘిక సందేశాన్ని, ఆయా కావ్యాల్లో జాషువా వ్యక్తీకరించిన పద్యాల భావాల ఆధారంగా వివరించారు. సాధారణంగా పద్యాలకు వ్యాఖ్యానం అనగానే పద్యంలోని భావాన్ని నాలుగు వాక్యాలుగా వివరించడమే. మనకు ఎక్కువగా కనిపిస్తుంది. కానీ ఈ రచయిత పద్యంలోని భావానికి గల నేపథ్యాన్ని అందులో నిగూఢంగా దాగి ఉన్న కవి యొక్క అవగాహన పరిణామాన్ని వెతికి పట్టుకున్న

తీరు స్పష్టమవుతుంది. వ్యాఖ్యాన సిద్ధాంతాన్ని గురించి (Hermeneutics) Schleirmacher అనే పాశ్చాత్యాలంకారికుడు చెప్పిన దాని ప్రకారం strict interpretation begins with misunderstand సరైన వ్యాఖ్యానం రచయిత సృజన మీద పునస్సృజన చేసినపుడే సాధ్యమవుతుందని గ్రహించాలంటాడు. ఇలా ఈ విషయాన్ని అన్వయిస్తే జాషువా చెప్పాలనుకున్న విషయానికి అతని ఆలోచన పరిణామానికి మధ్య ఉన్న తాత్విక సందేశాన్ని ఈ రచయిత పాఠకలోకానికి అర్థం చేయించడంలో సఫలీకృతుడయ్యారు.

ఈ సందేశం దళితుల మధ్య ఏర్పడవల్సిన సమైక్యత కోసం, స్త్రీ, పురుషుల మధ్య రావల్సిన సమానత్వం కోసం ఏ విధంగా ఉందో రచయిత కళ్ళముందుంచాడు. రాజకీయంగా జాషువా గాంధీ, అంబేద్కర్‌లను అనుసరించిన తీరును కూడా రాజకీయ సందేశంలో వివరించారు. జాషువాలోని మరొక ఆవేదన స్వతంత్ర భారత రాజకీయాలపై ఎలా ఉందో, ఆ డొల్లతనాన్ని తన కవితల్లో ఎలా వ్యక్తీకరించాడో మంచి వ్యాఖ్యానం చేశాడు రచయిత. జాషువా స్వీకరించిన వస్తువులో వినూత్నమైన అంశాలు కూడా ఉన్నాయని తెలిపారు. వస్తు విప్లవ దృష్టి ఏ విధంగా నిక్షిప్తమైందో తెలుస్తుంది.

ఈ విధంగా జాషువా పై ఒక సమగ్రాధ్యయనం జరిపి, జాషువా ఆవిష్కరించిన విభిన్న కోణాల్ని, అతని రచనలకు ఆ రచయిత, కవి యొక్క దృక్పథంపై ఆయా సామాజిక, రాజకీయ పరిస్థితుల ప్రభావం ఏ మేరకు ఉందో తెలియజేసే పుస్తకం "జాషువా స్వప్నం - సందేశం".

**(పేరు : జాషువా స్వప్నం - సందేశం, కవి : రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, పేజీలు : 32, వెల : రు. 15/-, దొరుకుచోటు : ప్రజాశక్తి, విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు**

---

**అద్దేపల్లి రామమోహనరావు**




## ఉద్యమాన్ని శ్వాసించే జీవితం ఒక ఉద్యమం

వర్గ సంఘర్షణ దృక్పథంతో ఆర్థిక రాజకీయాది వైరుధ్యాల్ని కవిత్వంగా రూపొందించే విభిన్న కవులకు విభిన్నశైలి ఉంటుంది. కొందరు ఆవేశాన్నీ, కసినీ కుమ్మరిస్తారు. కొందరు అవగాహన కలిగించే ప్రయత్నం చేస్తారు. మరికొందరు అభివ్యక్తి మార్గాల్లో కృషిచేస్తారు. డా. ఎస్వీ సత్యనారాయణ ఆవేశ ప్రధానమైన కవి. ఆవేశమే ఆయన శైలిలోని అభివ్యక్తి మార్గాల్ని శాసిస్తుంది. ఆవేశమే అతని భాషను, పదాల పొందికనీ అమరుస్తుంది. ఉపన్యాసమే కవితాత్మకతను సాధించేరేఖకు, కవిత్వమే ఉపన్యాసకత్వాన్ని సాధించేరేఖకు అటూ ఇటూ కవిత్వం సాగిపోతూ, మనసుల్ని కదిలిస్తుంది.

ఎక్కడెక్కడ ప్రగతిశీలవాది ఈనాటి సంఘటనలకు చలించిపోతాడో, ఆసందర్భాలన్నీ ఎస్వీలో కవితారూపం పొందికై మామూలు హృదయస్పందనలతో కవిత రాయడంవేరు. ఒక అవగాహనతో కవిత్వం రాయడం వేరు. ఈ రెండో విధానం ఎస్వీలో ఆవేశాత్మకంగా సాగుతుంది. ఇప్పుడు ప్రభుత్వం చేపడుతున్న సంస్కరణలన్నీ ఈదేశాన్ని అమెరికా ఆధిపత్యానికి ప్రజల్ని బానిసలు చెయ్యడానికి ఉద్దేశించినవే. దీనిపై తీవ్రంగా తిరగబడతాడు ఎస్వీ. ఈతత్వమే అసలు ఈనాటికవికి ప్రధానస్రవంతి అయింది.

'ఉద్యోగాలను తీసేస్తూ
స్వయం ఉపాధి మంత్రం జపించండి
సర్కారీ బళ్ళనుమూసి
అక్షరాస్యతను పెంచండి
ఆస్పత్రులు అమ్ముకుని
ఆరోగ్యాన్ని పరిరక్షించండి
మద్యం వరదలు పారించి
టూరిజాన్ని పెంచండి
మసాజ్ సెంటర్లమాటున
మానాన్ని వెలకట్టండి
ఫ్లైఓవర్ల కొండచిలువల కింద
గుండెల్ని నలిపెయ్యండి'

ఎస్వీ ఆవేశ అవగాహనం అభివ్యక్తిలో వ్యంగ్యమొక బలమైన సాధనం. ఈ వ్యంగ్యం ఎక్కువ ఆలోచనతో పనిలేకుండానే సూటిగా గుండెకు తగులుతుంది. పై చెప్పిన పంక్తులన్నీ, ప్రభుత్వ ద్వంద్వ విభాకాలకు నిదర్శనాలే. రెండేసి పంక్తుల వైరుధ్యాన్ని గూర్చి ఎంతో రాజకీయవిషయాన్ని వివరించే అవకాశం ఉంది.

ఎస్వీ ఆవేశ అభివ్యక్తికి మరో బలమైన అంశం లయబద్ధంగా నడిచే భావాల సమాన విభజన. దీన్నే కుందుర్తి 'విసురు' అన్నాడు. ఆలంకారికమైన రచన కానప్పుడు, వెంటనే విస్ఫోటించే లక్షణం కావాలన్న ఈవిసురు చాలా ప్రయోజనాన్నిస్తుంది. ఉదాహరణకు.

'లెనిన్ మైడియర్ లెనిన్
వర్గాలున్నంతకాలం
నువ్వొక వర్గపోరాటమై కొనసాగుతావ్
సామ్రాజ్యాలున్నంతకాలం
నువ్వొక సామ్యవాద సిద్ధాంతమై వెలుగుతావ్
పెట్టుబడి ఉన్నంతకాలం
నువ్వొక తిరుగుబాటు పిడికిలివై నిలుస్తావ్
ఆందోళనలున్నంతకాలం
నువ్వొక అరుణతారవై మెరుస్తావ్!'

ఇలాటి పాదలయబద్ధమైన విసురు ఎస్వీ కవితలనిండా బలంగా ఉంది. సామాజిక కవిత్వాన్ని ముద్రవేసే రీతుల్లో ఇదొకటి.

ఎస్వీ కవిత్వానికి లయబద్ధ ఉద్ఘాటనలు కూడా బలమిస్తై.

'గోడకూలడం మరోసారి ఉన్నతంగా లేవడానికే
మేడకూలడం మరోమారు తలఎత్తడానికే'
'దబాయించగలవాడే దండించగలవాడే నేటిహీరో
మళ్ళీమళ్ళీ మోసంగించే వాడే నేటి ఆదర్శం'

అడుగడుగునా ఇలాంటి ఉద్ఘాటనలు ఎస్వీకవిత్వంలో కవిత్వంలో కనిపిస్తై.

తుపాను వేగంగా కదిలిపోయే కవితల్లో కొద్దికవితలు ఆర్ద్రతనూ, ఆగి ఆలోచింపజేసే లక్షణం కలవీ ఎస్వీలో ఉన్నై. మనసులో గోడలు తనచిన్ననాటి జీవితాన్ని గూర్చి, ప్రగతిశీలిగా తాను రూపుదిద్దుకున్న వాతావరణాన్ని గూర్చి చెప్పే బాల్య స్మృతికవిత. అస్తిత్వానికి 'గోడ'ను ప్రతీకగాచేసి, ఈ కవితను రశాడు ఎస్వీ.

'భక్తమార్కండేయ నాటకంలో నాయకపాత్రను ధరిస్తే
ఓంకారనాదమై ప్రతిధ్వనించింది
భజన గీతాల్లో వైరాగ్యం ప్రదర్శిస్తుంటే
ఇప్పుడు ఎందుకురా అని వాదించింది
బాబన్న, సుదర్శన్, కుమార్‌తో కలిసి
ఎన్ని పిచ్చికగూళ్ళు కట్టుకున్నాం'

ఎవరి బాల్యం వారిదైనా, ఈ కవితలో అస్తిత్వ నేపథ్యంలో , ప్రగతిభావనలూ ఉండడం చేత ఇది ఎవర్నైనా నిమగ్నంచేసుకుంటుంది. ఈగోడలు తన 'మూలాల' మేడలుగా చెప్పి, వీటిని అనుభవాల జాడలో చేశాడుకవి.

చివరికి ఒక కవితల గ్లోబలైజేషన్ వలన కలిగేవి ధ్వంసాన్ని గూడా, తన సహజమైన విసురుకంటే విభిన్న మార్గంలో చెప్తాడు.

'ఇక్కడో నాగరికత ఉండేది
ఎవరు తుడిచేశారు
విశిష్టమైన సంస్కృతి ఉండేది
ఎవరు విషం కలిపారు.
మిత్రులారా కళ్ళు తెరవండి
'ఇక్కడో దేశముండేది'
అని ప్రశ్నించే పరిస్థితికి తేకండి'

ఉద్యమ కవిత్వానికి ఒక బలమైన ప్రతిబింబం 'జీవితం ఒక ఉద్యమం'

**(జీవితం ఒక ఉద్యమం వచన కవితా సంపుటి, కవి : డా. ఎస్వీ సత్యనారాయణ, పేజీలు : 104, వెల: రూ. 50/-, దొరుకుచోటు : విశాలాంధ్ర బుక్‌హౌస్(అన్ని బ్రాంచీలు) నవయుగ బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్, దిశబుక్‌సెంటర్, సహచర బుక్‌హౌస్)**

**ఎం.కె.**

---

## కల - వరం




**వ**రం ప్రకటించిన రెండవ కవితా సంపుటి 'కల-వరం' కవిత్వం ఒక నిరంతర యాత్ర. సగటు మానవుని పట్ల, పేదసాదలపట్ల ఆర్ద్రతగల కవి. ఈయన కవితలు ఆవేదనకు, ఆలోచనకు చేరువైన నివేదనా చిత్రాలు. గుండెమంటలకు దివిటీలెత్తిన దీప చిత్రాలు. సమాజంలోని అంతరాల దొంతరలు, అక్రమాలు, అవినీతి, స్త్రీలపై అత్యాచారాలు, ఆర్థిక దోపిడీ - వీటికి విమోచనా మార్గం చూడాలంటాడు కవి.

పుస్తకంతో చెలిమి అంతులేని కలిమి అంటాడు 'జ్ఞానకోటి' కవితలో ఎంత సత్యం పుస్తకాన్ని పుస్తకంలోకి ఆహ్వానిస్తాడు.

వెల తెలిసిన అందరికీ విలువ తెలీదు. ఆకలికి ఒళ్ళమ్ముకునే స్త్రీ దైన్యాన్ని చూపిస్తూ కవి - మనసు మాట కడుపు మంటకి ఖరీదు కడుతుందంటాడు మేలుకొన్న అమ్మతనం కవితలో సమాజంలో ఉన్న అసమత విషమతకి దారి తీసింది. డబ్బుగాయమైన దేహం ఆత్మీయతా లేపనం కోసం ఎదురు చూస్తుంది.

బొద్దింకలు పాకే బుర్రల్లో బోధి వృక్షాలు మొలవవు. మత మౌఢ్యం గురించి చెబుతూ కవి - హిందూ, ముస్లిం, క్రిస్టియన్లు, బాహ్యంగా ముగ్గురూ మిత్రులే. స్వగతంలో బురద జల్లుకునే మూఢులు అంటూ ప్రేమానురాగాలతో ప్రతి ఎదనూ వెతికితే ఎందరో దేవుళ్ళు కనిపిస్తారంటాడు 'ఎదలోనే వెతకండి' కవితలో.

రాజకీయం కుల మతాల చిపుకుల్ని పోగు చేస్తే అధికార ప్రతిపక్షాలు మంటపెడుతున్నాయని, రాజకీయ శునకవాలం వంకర మారదని, ఈ హింసకి శాంతి కపోతం కనిపించకుండా పోయిందని 'వెతికి తీసుకురండి' అనే కవితలో పావురాన్ని తీసుకురమ్మంటాడు.

కొడుకుతో సమానంగా కూతుర్ని చదివించమంటూ ఆడవాళ్ళు సాధనలో, శోధనలో ఎవరికీ తీసిపోరనీ అయినా వాళ్ళకి తాళి బంధంతో వాళ్ల చదువులకీ, ఉత్సాహానికి కళ్లెం వేసేస్తున్నా మంటాడు' చదువుకి ఉరితాళి కవితలో.

భ్రమావరణంలో మీడియా, జోలపాడే చలనచిత్రాలు, డ్రగ్స్, కాక్ టెయిల్స్ ఇవన్నీ యువతని నిర్వీర్యం చేస్తున్నాయి. ఇందుకు స్త్రీ శక్తి పూనుకుని అసాంఘిక కార్యకలాపాల నెదుర్కోవాలంటాడు. 'అడ్డా నడ్డి విరిచేయి' కవితలో. నేటితరంలో హృదయ ధర్మం మందగించి బుధ్యుత్కర్ష మకుటం పెట్టుకుంటోంది. ఇండియా మేధ విదేశాలకు వలస వెళ్ళి లక్షల డాలర్లు పండించుకుంటోంది. భారత జీవన సారాన్ని గ్రోలి మేధావులై విదేశాలకు వలసపోతున్నారు. ఇలా బ్రెయిన్ డ్రెయిన్ జరుగుతోంది. ఇది తప్పని, దేశానికి తీరని నష్టమని చెబుతాడు 'డాలర్ క్రేజీ' కవితలో.

మనిషి కాటు పడ్డ మానవత్వానికి ఏ యాంటీబయాటిక్ మందు పని చెయ్యదు. కరువు కాటేస్తే నగరానికి వలస వెళ్ళడం మందుకాదని, నగరమంటే మాయాజాలం, నడమంత్రం, నయవంచనల నిలయమని, నగరంలో అలా ప్రవర్తించకుంటే కష్టమని బతకలేమంటాడు. కష్టమైనా కన్నీరు తుడిచే గ్రామమే ఎంతో ముద్దు అని, కాబట్టి నగరాలకు 'వలసవద్దు' అంటాడు కవి.

అన్ని ఇంద్రియాల్లో కన్ను ప్రధానమని, కాబట్టి మరణానంతరం అంధులకు నేత్రదానం చేస్తే మరణించి జీవిస్తావు అంటాడు 'మరణించి జీవించు' కవితలో.

సంగ్రహత్వం, సాంద్రత, అభివ్యక్తి రమ్యత అనే త్రికరణాలు కవికి ఆయువుపట్టు. అవి సాధించే దిశగా కవివరం కృషి చేయాలి. ఈ కవి నుండి మరింత పదనుతో, అవగాహనతో మరిన్ని కవితా సంపుటాలు రావాలని నా ఆకాంక్ష, ఆశ.

**(కవితా సంపుటి పేరు : కలవరం, కవి : వరం, పేజీలు : 84, వెల : రు.60/-, దొరుకుచోటు : పి. నీలావజ్రమణి, ఎపిఆర్‌బిసి బాలుర పాఠశాల, హిల్‌కాలనీ, నాగార్జునసాగర్, నల్లగొండ జిల్లా - 508 202.**

# తొలి తెలుగు పరిశోధకులపై జాతీయ సదస్సు

**పసునూరి రవీందర్**

తెలుగులో తొలితరం పరిశోధకులు చేసిన కృషిపైన నవంబర్ 7-9 తేదీలలో హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో జాతీయ సదస్సు జరిగింది. తెలుగు సాహిత్యంలో పరిశోధనకు దారులు వేసిన "తొలితరం పరిశోధకులను" ఒకసారి వారిని, వారి కృషిని గుర్తు చేసుకోవడం జరిగింది. సదస్సు ప్రారంభ సభను ద్రావిడ విశ్వవిద్యాలయం పూర్వ కులపతి ఆచార్య రవ్వా శ్రీహరి తన ప్రసంగంతో ప్రారంభించారు. ప్రారంభ సభలో ముఖ్య అతిధిగా విచ్చేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పూర్వకులపతి ఆచార్య జి.వి. సుబ్రమణ్యం కీలకోపన్యాసం చేశారు.

"పరిశోధకుడంటే అంతకు ముందు లోకానికి తెలియని ఒక నూతన విషయాన్నో, సిద్ధాంతాన్నో సమాజానికి అందించాలి. అందుకోసమే తెలుగులో పరిశోధన అనేది ఒక ప్రత్యేక విధానంగా రూపొందింది. పరిశోధనంతా కూడా శాస్త్రీయంగా మాత్రమే సాగాలి. అప్పుడు మాత్రమే మంచి ఫలితాలు వస్తాయి. ఇక ఈ సదస్సు రెండు కోణాల నుండి జరుగు తున్నట్లు అనిపిస్తున్నది. 1) కాలం రీత్యా - తొలితరం పరిశోధకులు, 2) ఒక ప్రక్రియ వికాసం రీత్యా తొలితరం పరిశోధకులు. తొలితరం పరిశోధకులు చేసిన కృషి అపారమైంది. వారి పరిశోధన యూనివర్శిటీ లలో పి. హెచ్.డి.లు లేకున్న ఆగకుండ ముందుకు సాగిందే తప్ప ఆగలేదు. ప్రతి పరిశోధకుడు తాను పరిశోధన చేసే ప్రక్రియ యొక్క తొలిదశను తెలుసుకోవాలి. తాను ఎక్కడ ఉన్నాడో తెలుసుకుంటే తన పరిశోధన సులభమవుతుందని'' సుబ్రమణ్యంగారన్నారు.

ఈ సదస్సులో సమర్పించే పత్రాలను ముందుగానే ఒక సంకలనంగా రూపొందించడం ఒక ప్రత్యేకాంశం. ఈ సంకలనాన్ని మానవీయ విభాగాధిపతి ఆచార్య సుధాకర్ మరాఠే ఆవిష్కరించారు. ఈ ప్రారంభ సభకు హైదరాబాద్ విశ్వవిద్యాలయం తెలుగు శాఖ పూర్వాధ్యక్షులు ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య సభాధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ సమావేశానికి ముందు సదస్సు సంచాలకులు, తెలుగు శాఖ అధ్యక్షులు పరిమి రామనరసింహ సదస్సు యొక్క ఉద్దేశ్యాన్ని వివరించారు. ఈ పత్రాల సంకలనాన్ని "తెలుగులో పరిశోధనకు దారులు పరిచిన తొలి వెలుగులకు" అంకిత మిస్తున్నట్లుగా ప్రకటించారు.

సదస్సు మూడు రోజులు ఎనిమిది సెషన్లుగా ముగిసింది. ఈ సదస్సులో 40 మంది పత్రాలను సమర్పించారు. ఈ 40 మందిలో ఈ యూనివర్శిటీ పి. హెచ్.డి, ఎం.ఫీల్ విద్యార్థుల పత్రాలు 15 ఉన్నాయి. ఈ పత్రాలు తెలుగులో తొలి పరిశోధకులైన డా॥ చిలుకూరి నారాయణ రావు, మారేపల్లి రామచంద్రశాస్త్రి, కందుకూరి, గురజాడ, వసంతరావు వెంకటరావు, ఖండవల్లి లక్ష్మీరంజనం, బండారు తమ్మయ్య, శ్రీ వజ్ఝలవారు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, గంటి జోగి సోమయాజి, గిడుగు రామ్మూర్తి పంతులు, జి.ఎన్.రెడ్డి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, కట్టమంచి, మానవల్లి, పింగళి, కోరాడ, వేటూరి ప్రభాకర శాస్త్రి మొదలగు వారి కృషిని వివరించాయి. పత్రాలు సమర్పించిన ప్రముఖుల్లో ఆచార్య పరిమిరామ నరసింహం, చేకూరి రామారావు, జి.ఎస్. మోహన్, అమరేశం రాజేశ్వరశర్మ, ఎస్వీ రామారావు, బేతవోలు రామబ్రహ్మం, ఆనందరామం, లంకసాని చక్రధర్‌రావు, కోవెల సంపత్కుమారాచార్య, వేటూరి ఆనందమూర్తి, వై. బాలగంగాధరరావు, సి. ఆనందరామం, యు.ఎ. నరసింహమూర్తి, పి. భాగ్యలక్ష్మి, ద్వా.నా. శాస్త్రి, ఆచార్య ఎస్. శరత్ జ్యోత్స్నారాణి, డా॥ జి. అరుణకుమారి, డా॥ పిల్లలమర్రి రాములు, డా॥ తుమ్మలరామకృష్ణ, డా॥ డి. విజయలక్ష్మి, డా॥ పవన్‌కుమార్, డా॥ దార్ల వెంకటేశ్వరరావు, డా॥ పాలకుర్తి మధుసూదనరావు, తదితరులున్నారు.

సదస్సు ముగింపు సమావేశానికి హైదరాబాద్ విశ్వవిద్యాలయ మానవీయ శాఖ పూర్వాధిపతి, తెలుగు శాఖ పూర్వాధ్యక్షులు ఆచార్య కె.కె. రంగనాధాచార్యులు ముఖ్య అతిధిగా విచ్చేశారు. విశిష్ట అతిథిగా ఆచార్య వై. నరసింహులు, ఆత్మీయ అతిథిగా ఆచార్య సి. ఆనందరామం విచ్చేశారు. సదస్సు మూడు రోజులపాటు ఆచార్య పరిమి రామనరసింహం పర్యవేక్షణలో విజయవంతంగా ముగిసింది.

*

# నానీల ఎనిమిదేళ్ళ కవితాయాత్ర

డాక్టర్ ద్వా.నా. శాస్త్రి



నానీ కవులతో నానీల సృష్టికర్త ఆచార్య ఎన్. గోపి

2005 అక్టోబర్ ఎనిమిదో తేదీన హైదరాబాద్ త్యాగరాజ గానసభలో ఒక విశిష్టమైన రాష్ట్ర స్థాయి సదస్సు జరిగింది. అదే నానీల సమాచాలోచనా సదస్సు. కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ నిర్వహించిన ఈ ఉత్సవం రాష్ట్రం నలుమూలల నుంచి వచ్చిన కవులతో, విమర్శకులతో విజయవంతమైంది.

ఒక కవితా రూపానికి వార్షికోత్సవం జరగటం ఇదే ప్రథమం అనుకుంటాను. ఎనిమిదేళ్ళ క్రితం 1997లో ఆచార్య ఎన్. గోపి 'వార్త' పత్రికలో "నానీలు" పేరుతో ఒక కొత్త కవితా రూపాన్ని ఆవిష్కరించారు. 1998లో 365 నానీలతో ఒక సంకలనం వెలువరించారు. ఇది రెండో ముద్రణ కూడా పొందింది. 2002లో మరో 365 నానీలతో మరో కవితా సంపుటి వెలువరించారు. "గోపీనానీలను చదువుతుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఎన్ని అనుభూతులు! ఎన్ని రీతులలో! మరెన్ని నీతులలో!..... ఒకటేమిటి? మానవ జీవన వైవిధ్యాన్ని అద్దంలో కొండలా చిన్న చిన్న నానీల్లో ఎంత గాఢంగా చిత్రించారో" అని విమర్శకులు, సమీక్షకులు ప్రశంసించారు.

నానీలు అనే కవితా రూపం నాలుగు పాదాలలో వుంటుంది. 20 - 25 మధ్య అక్షరాలుంటాయి. సామాన్యంగా మొదటి రెండు పాదాలు ఒక యూనిట్‌గా, తర్వాతి రెండు పాదాలు మరో యూనిట్‌గా వుంటాయి. చాలామంది ఈ నియమాలు పాటిస్తూ నానీలు రాశారు. 'నాని' అనేది అచ్చమైన తెలుగు పదం. 'చిన్న' అని అర్థం. నానీలు కూడా చిన్నవే. ఆచార్య గోపి "వినీవి వెరసిమనవి" అని వివరణ ఇచ్చారు. నాగభైరవ కోటేశ్వరరావు గారు "ముత్యాల సరం గురజాడగారి మానసిక పుత్రిక అయితే, నానీ గోపీగారి కవితా పుత్రిక. తన ప్రయాణంలో ఫాలోయర్స్ ఉంటే కవి దారి సరైందే" అనడం గమనార్హం.

ఇటువంటి నానీలు పుట్టి ఎనిమిది సంవత్సరాలైంది. అన్ని ప్రాంతాల కవులు, అన్ని భావజాలాల కవులు నానీలు రాశారు. ఒక కొత్త కవితా రూపం వందమందిని పైగా ప్రభావితం చేసిందంటే స్థిరపడినట్టే గదా! ట్రెండ్ సెట్టర్ అయింది. అందుకే ఈ వార్షికోత్సవం.

భారీ ఎత్తున సదస్సు నిర్వహించిన మద్దాళి రఘురాం స్వాగత వచనాలు పలకగా - పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ ఆవుల మంజులత సదస్సు ప్రారంభించారు. ముఖ్య అతిథిగా అధికార భాషా సంఘం అధ్యక్షులు ఎ.బి.కె. ప్రసాద్ పాల్గొన్నారు. ఈ సదస్సులో సమర్పించిన పత్రాలను పుస్తక రూపంగా తీసుకురావడానికి తమవంతు సహకార మిస్తానని ఆవుల మంజులత హర్షధ్వానుల మధ్య ప్రకటించారు. 'నానీల నాన్న'గా ప్రశంసించబడిన ఆచార్య ఎన్. గోపి చేసిన కీలకోపన్యాసం ఆకట్టుకుంది. నానీల రూపం ఎలా ఆవిర్భవించి ఎలా వ్యాప్తి చెందిందో వివరిస్తూ నానీల ప్రాశస్త్యాన్ని తెలిపారు. అంతేకాదు - నానీల కవులకి కొన్ని సూచనలు కూడా ఇచ్చారు. వీరి ఉపన్యాసం సద్విమర్శకి ఉదాహరణగా సాగింది.

సదస్సులో మొదటగా డాక్టర్ సంగంనభట్ల నర్సయ్య "నానీలు - రూప నిర్మాణ శిల్పం" అనే అంశంపై సాధికారికమైన ఉపన్యాసమిచ్చారు. నానీలలో సమకాలీనత ఏవిధంగా వుందో సవిమర్శకంగా తెలిపారు.

| | | | ఆవిష్కర్త |
|---|---|---|---|
| 1. | సునామీ నానీలు<br>కవి - శ్రీ టి. సంపత్ కుమార్ (ఢిల్లీ) | - | ఆచార్య పి. సుమతీ నరేంద్ర |
| 2. | ఎన్. గోపి కవితా రూపసృష్టి<br>- శ్రీ నారాయణశర్మ | - | ఆచార్య సి. నారాయణరెడ్డి |
| 3. | పచ్చబొట్టు<br>- డా. పత్తిపాక మహన్ | - | శ్రీ జూకంటి జగన్నాథం |
| 4. | శారద బాణీలు<br>- శ్రీమతి శారదా అశోకవర్ధన్ | - | ఆచార్య సి. నారాయణరెడ్డి |
| 5. | దళిత నానీలు<br>- శ్రీ నేతల ప్రతాప్‌కుమార్ | - | శ్రీ బి.ఎస్. రాములు |
| 6. | పూలు పిలుస్తున్నాయి<br>- శ్రీ కోసూరి గాంధీ | - | శ్రీ శిలా వీర్రాజు |
| 7. | హృదయనాదాలు<br>- శ్రీ దుగ్గిరాల సోమేశ్వరరావు | - | శ్రీమతి ఎన్. అరుణ |
| 8. | వెలుగుపూలు<br>- శ్రీ చిమ్మపూడి శ్రీరామమూర్తి | - | ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి |
| 9. | నానీ బాణీలు - లక్ష్మణరావు నానీలు<br>- ఆడియో సీడీలు | - | ఓల్గా |

ఆచార్య ఎస్వీ సత్యనారాయణ. ద్వా.నా. శాస్త్రి ట్రెండ్ సెట్టర్‌గా నానీలు" అనే అంశంపై సోదాహరణంగా సోహపత్రికంగా ప్రసంగించారు. ఈ సదస్సుకి కోట్ల వెంకటేశ్వరరెడ్డి సమన్వయకర్తగా సమయ పాలనతో సమర్థవంతంగా నిర్వహించారు.

భోజన విరామం తర్వాత సదస్సుకు ప్రెస్ అకాడమీ మాజీ అధ్యక్షులు ఐ. వెంకట్రావు ముఖ్య అతిథిగా పాల్గొని తాము నిర్వహించే పత్రికను గురించి, గోపీగారి నానీలు గురించి అల్పాక్షరాలలో అనల్పార్థ రచనలా మాట్లాడారు. ఆంధ్రప్రభ సంపాదకులు సతీష్ చందర్ కవితారంగం గురించీ, నానీల గురించి వివరంగా ప్రసంగించారు. మాకినీడి సూర్యభాస్కర్ సమన్వయ కర్తగా వ్యవహరించిన ఈ సదస్సులో శిఖామణి "నానీలు - కవితాత్మకత"పైనా, డాక్టర్ మాసన చెన్నప్ప "నానీలు - దేశహిత" అనే అంశం పైనా ప్రసంగించారు. అయితే సమయ పాలన పాటించ లేదు.

సాయంకాలం అంబల్ల జనార్ధన్ అధ్యక్షతన కవి సమ్మేళనం అత్యంత సమర్థ వంతంగా, అత్యుత్సాహంగా జరిగింది. శ్రోతలను ఆకట్టుకొన్న ఈ కవి సమ్మేళనం నానీలు - ట్రెండ్ సెట్టర్ అని మరోసారి చాటి చెప్పింది. ముగింపు సభలో ఆచార్య సి. నారాయణరెడ్డి ముఖ్య అతిథిగా సన్మానకర్తగా పాల్గొని చేసిన ప్రసంగం నానీల వైశిష్ట్యాన్ని తేటతెల్లం చేసింది. నానీల కవి డాక్టర్ తలతోటి పృధ్వీరాజ్ సదస్సు నివేదికను వివరించారు.

నానీల సదస్సులోని మరొక విశేషం ఒకే వేదికపై పది నానీల కవితా సంపుటాలు ఆవిష్కరించబడటం. ఎస్.ఆర్. భల్లం సంపాదకత్వంలో వెలువడిన "గోపి నానీల సమాలోచనం" అనే వ్యాస సంపుటిని ఆచార్య సి. నారాయణరెడ్డి ఆవిష్కరించారు.

ఈ గ్రంథాల సంక్షిప్త పరిచయం నానీల కవి డాక్టర్ ఎస్. రఘు చేయగా, నానీల కవయిత్రి డాక్టర్ చిల్లర భవానీదేవి వ్యాఖ్యాతగా సభను రంజింపచేశారు. ఆచార్య ఎన్. గోపి సదస్సులో పాల్గొన్న కవుల్ని, వక్తల్ని, అతిథుల్ని జ్ఞాపికలతో సత్కరించారు. నానీలలో సినారె అనే కవితా సంపుటిని డాక్టర్ ద్వా.నా. శాస్త్రి ఆచార్య ఎన్. గోపి గార్కి అంకితమిచ్చారు. ఉదయం పది గంటల నుంచి రాత్రి పది గంటల వరకు నానీల కుటుంబ ఉత్సవంగా జరిగిన ఈ సదస్సు ఎందరికో స్ఫూర్తిని - మరెందరికో ఆనందానందాన్ని కలిగించింది.

---

# ఐ.సీ.సీ.యూ.

**ఆచార్య ఫణీంద్ర**



సీరియస్సటంచు సిస్టర్లు, డాక్టర్లు
పరుగులిడగ లోకి, బయటకొకటె -
అటు నిటూగినట్టి ఆ స్ప్రింగు డోర్లలా
కొట్టుమిట్టులాడె గుండె నాది!

గాజు గదిలోని నీ బాధ కాననీరు-
గదికి బయట నా హృది బాధ కానరెవరు!
వైద్యుడా 'ఐ.సి.సి.యు.' నుండి వచ్చి, అంత
చావు కబురు నాతో చెప్పె చల్లగాను!

"పరి పరి రీతులన్ నిలుప ప్రాణము, మాదు ప్రయత్నమెంతయో
జరిపితిమైన - ఆయువది చాలకపోయె!" నటంచు పల్కి ఓ
ఇరువది వేలు కట్టి, శవ మింటికి కొన్మని చెప్పె నాతడే!
త్వరపడి ఎట్లు చచ్చితివి? దార, సుతుల్ కనిపించకుండిరా!

చీకటివేళ నీదు హృది చెంత శిరంబదియుంచి తృప్తిగా
లోకమునెల్లయున్ మరచి, లోతుగ నిద్దుర మున్గ 'వెర్రి మా
లోకపు' నన్ను లేపి, హృది లోపల నొప్పియటంచు తెచ్చియున్,
చీకటి చేసినా విచట జీవిత మీ గతి - ప్రాణ నాయకా!

"పెద్ద వైద్యశాల! పేరున్న వైద్యులున్
కలరు! చింత నీకు వలద"టంచు -
నీవె పల్కి ఇటుల నిలువుగా ముంచుచున్
మాట తప్పినావు మగడ! అయ్యో!

ఎంతటి ప్రేమ జూపితివి ఇన్ని దినంబులు నీవు మాదుపై -
అంతయు నిత్య సత్యమని అందముగా తలపోయునట్టి ఓ
వింతగు భ్రాంతిలో నిలిపి, ప్రీతి సుఖామృత మందజేసితే!
చెంతన నీవు లేవనెడి చేదును నేడెటు మ్రింగమందువో!

నా పాపం బదియేమో! వైద్యుడనినన్ - నారాయణుండందురే!
ఆ పూర్వ స్థితి అంతరించె - భువిపై ఆ పుణ్యమేమాయెనో?
వ్యాపారం బయిపోయె కాల మహిమన్ - వైద్యంబు సైతంబయో!
రూపాయే విజయంబునొందె తుదకున్ రోగాల యుద్ధంబులో!

ఐ.సీ.సీ.యూ. లోపల
చేసిరో ఏ టెస్టులు? - మరి, చేత్రాదంతన్
తీసిరి కంప్యూటర్ బిల్!
"తీసుక రా పైక" మన్న తెచ్చెద నెటులన్?

వచ్చెడి వేళ, చేతగల పైక మదేదియొ వెంట తెచ్చి, నా
కిచ్చితి పెద్ద మొత్తమునె - ఎంతయొ సైతము చూడలేదు! నే
తెచ్చితి మందులేవీ కొని తెమ్మని వైద్యులు కోర నన్నియున్ -
కచ్చితమింక! నాదు కడ కల్గిన దిప్పుడు రిక్తహస్తమే!

ఎప్పుడు చెప్పకుంటివయ! ఇచ్చట ఇంతయు నున్నదంచు - నే
నెప్పుడు సెంత కోరనది ఇచ్చితి - వంతకె సంతసించితిన్!
ఇప్పుడు నిట్టివేళ యొకటిట్టుల రాగలదంచు నెప్పుడున్
తప్పియునైన చింతనము దాల్చకపోతిమి - ఘోరమయ్యెరా!

చచ్చితి వీవటంచు నిటు చచ్చెదనా విలపించి? లేక ఈ
చచ్చిన నీదు దేహమును, చాలిన పైకము గట్టి ఇంటికిన్
తెచ్చుట ఎట్టులో యనుచు తేలక నేనటు రోదనమ్ముతో
చచ్చెదనా? అయో! ఎటుల చచ్చెద, చొచ్చెద - నీవె చెప్పుమా!

# సామాజికోద్యమాలు తెలుగు సాహిత్యం




**ఎ. హరినాథరెడ్డి**

అనంత కరువులకు నిలయం కావచ్చు. కానీ కలలకు కరువు లేదనే విషయం మరోసారి నిరూపించుకొంది. ''ఇటీవలి సామాజికోద్యమాలు - పరిణామాలు - తెలుగు సాహిత్యం'' అనే అంశంపై అక్టోబర్ 22, 23న రెండు రోజుల పాటు రాష్ట్ర స్థాయి సదస్సును అనంతపురం పట్టణంలో మహజన ప్రాంగణం వేదికపై 'జిల్లా రచయితల సంఘం' (జి.ర.సం) వారు నిర్వహించారు.

ఈ సమావేశాలలో 'దళితోద్యమాలు - దళిత సాహిత్యం', 'బహుజన ఉద్యమాలు - బహుజన సాహిత్యం', 'స్త్రీవాదోద్యమాలు - స్త్రీవాద సాహిత్యం', 'ఇస్లాంవాద సాహిత్యం' ఆదివాసీ సాహిత్యంలలోని ఉద్యమాలు, కవిత్వం, కల్పనా సాహిత్యాలు (కథ - నవల) గూర్చి సాహితీ ప్రముఖులు ఉపన్యాసాలిచ్చారు.

'ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించిన డాక్టర్ జూపల్లి ప్రేమ్‌చంద్ మాట్లాడుతూ ప్రపంచీకరణ, మతతత్వవాదుల ప్రభావంతో అణగారిన వర్గాలు తమ తమ అస్తిత్వాల్ని నిలుపుకొనేందుకు సాహిత్య సృష్టి జరుగుతోందని, ఈ నేపథ్యంలో ఆయా ఉద్యమాల సాహిత్య పరిణామాల అవగాహనకే ఈ సదస్సు నిర్వహిస్తున్నట్లు తెలిపారు. సదస్సు ప్రారంభకులుగా విచ్చేసిన డాక్టర్ బి. విజయభారతి మాట్లాడుతూ ప్రాచీన సాహిత్యంలో అణగారిన వర్గాలకు తీవ్ర విఘాతం కలిగించినదని అణగారిన వర్గాల దృష్టితో సాహిత్యాన్నంతా మరోసారి పునరాలోచించాలని అన్నారు.

విశిష్ట అతిథిగా విచ్చేసిన ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ మాట్లాడుతూ ఏ ఉద్యమమైనా ఒక భావజాలాన్ని, తాత్విక ధోరణిని కలిగి ఉండి పోరాటాలను నిర్మించేదిగా ఉండాలని అన్నారు. కేవలం రెండు, మూడు కులాలు నిర్మించిన చరిత్రే భారత చరిత్ర సంస్కృతిగా వుందని, ఆ వర్గం చరిత్రే భారతదేశ చరిత్రగా పరిగణించబడు .1- అళతోందన్నారు. మారుతున్న ఆర్థిక స్వరూపంలో కొన్ని ఇతర అగ్రకులాలు ఆధిపత్య స్థాయిని పొందుతున్నాయని తెలిపారు. సంస్కృత భారత, రామాయణాలను రాసినది నిమ్న కులాలవారే అయినా తరువాత అవి అగ్రకులాల వారు తమకు తగిన విధంగా ఉపయోగించుకున్నారని అన్నారు. దళిత సాహిత్యం ప్రథమ దేశీ స్వతంత్ర తెలుగు సాహిత్యమని, పాశ్చాత్య దేశాలలో వచ్చి నల్ల కవిత్వ తాత్విక దృష్టిని మరింత లోతుగా అధ్యయనం చేయాలని తెలియజేశారు.

## రాచపాలెం కీలకోపన్యాసం

ఈ సమావేశాల కీలకోపన్యాసం చేసిన ఆచార్య రాచపాలెం చంద్రశేఖరరెడ్డి మాట్లాడుతూ ఇటీవలి సామాజికోద్యమాలు అంటే ఎమర్జెన్సీ అనంతరం అంటే గత 30 సం॥ల నుండి వస్తున్న సామాజికోద్యమాలు, పరిణామాలు ప్రతిఫలంగా వచ్చిన సాహిత్యంగా భావించాలని అన్నారు. ఆయా వాదాల నేపథ్యాలు ఇంతవరకు వచ్చిన మార్పులు, అవి ఏమి కోరుతున్నాయి? నూతనంగా రావలసిన మార్పులేమి? అన్న అంశాలపై సింహావలోకనంగా ఈ సమావేశాలను అభిప్రాయపడ్డారు.

పంథొమ్మిదో శతాబ్దంలో భారతదేశంపై నాలుగు ప్రభావాలు వచ్చాయి.

1. **విక్టోరినియనిజం :** అంటే పెట్టుబడిదారీ వ్యవస్థను నిలబెట్టేందుకు వచ్చిన వాదం.
2. **గాంధీయిజం :** పెట్టుబడిదారీ విధానాన్ని ఆహ్వానిస్తూ, ఫ్యూడలిజాన్ని నాశనం చేయాలని భావనతో వచ్చిన వాదం.
3. **మార్క్సిజం :** వర్గ దృష్టితో సమాజాన్ని చూడాలనే వాదం
4. **అంబేద్కరిజం :** కుల దృష్టితో సమాజ పరిణామాల్ని చూడాలనే వాదం

పై ప్రభావాలను అనుసరించే అనేక ఉద్యమాలు వచ్చాయని తెలిపారు. ప్రాచీన సాహిత్యం బానిసత్వ విధానానికి ప్రతీక కాగా, ఆధునిక సాహిత్యం ప్రశ్నకు ప్రతీకగా తెలిపారు. సోమనాథుడు, వేమన, బ్రహ్మంగారు లాంటి కొంతమంది అభ్యుదయ దృక్పథంతో సమాజాన్ని వీక్షించారని సంఘ సంస్కరణ, జాతీయోద్యమ సాహిత్యాలలో సంఘ సమస్యలను ప్రశ్నించారని అన్నారు. వామపక్ష ఉద్యమ ఆధారంగా వచ్చిన సాహిత్యం వర్గ దృష్టి ఆధారంగా వచ్చినదని, వర్గ దృష్టి కన్నా కుల దృష్టి ప్రధానమనే

వాదంతో అనంతర కాలంలో దళితవాదం వచ్చిందని అన్నారు. అంతేకాకుంటే స్త్రీవాద, బహుజనవాద, మైనారిటీవాద, ఆదివాసీ, ప్రాంతీయ అస్తిత్వవాద ఉద్యమ సాహిత్యాలు తమ ప్రత్యేక కోణాలలో సాహిత్య సృష్టి జరుగుతోందని అన్నారు. ఆయా ఉద్యమాల వల్ల వారు కోరే నూతన సమాజ స్వరూపముల ఉన్నత స్థితి గూర్చి సాహిత్యంలో తెలియజేయాల్సి వుందని అన్నారు.

ఆధునికమే కాని ఈ సమాజంలో ఆధునికోత్తర వాదం గూర్చి మాట్లాడటం వృధా అని, ఆధునికోత్తర వాదం పత్రికల్లో వ్యాసాలకు మాత్రమే పరిమితమని అన్నారు.

జిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి బిక్కి కృష్ణ నివేదిక ప్రకటనతో ప్రారంభ సమావేశం ముగిసింది.

### దళిత సాహిత్యోద్యమం

అనంతరం మొదటి సమావేశం దళితోద్యమాలు - దళిత సాహిత్యంపై మల్లెల నరసింహమూర్తి అధ్యక్షతన జరిగింది. 'దళితోద్యమాలు"పై జె. గౌతమ్ మాట్లాడుతూ ''దళిత'' అనగా 'విభజించబడిన వర్గాలు' అని ఈ పదాన్ని జ్యోతిబా మహాత్మా పూలే నాటకరంగంలో ఉపయోగించారని 1940లో అంబేద్కర్ దీని గూర్చి చర్చ గావించారని తెలిపారు.

దళిత పదం అస్పృశ్యుల సంబంధ మైనదిగా చూడాలని, ఇతర కులాలు ఈ పద పరిధిలోకి రానవసరం లేదని తేల్చి చెప్పారు. దళిత పాంథర్స్ మ్యానిఫెస్టోలో బిసిలు, మైనారిటీలను దళితులుగా చేర్చారని, ఆచరణలో దళిత ఉద్యమం అస్పృశ్య వర్గాల చేతిలోనే ఉందని తెలిపారు. దళిత ఉద్యమమే - బిసిలను, మైనారిటీలను, ఆదివాసీలను సంలీనం చేసుకుంటున్న పరిస్థితిని వివరిస్తూ, రాజ్యాధికార స్థాపనలో దళితులు ఒక్కరే చేయలేరని, ఈ గ్రామంలో ఇతర పీడిత వర్గాలను దళితవాదంలో సమీకరించే అవసరముందన్నారు.

దళితకవిత్వంపై ఎండ్లూరి సుధాకర్ మాట్లాడుతూ సమాజం మారాలి అని ఎందరో అన్నారు. కాని ఎట్లా మార్చాలి అన్న అంశంపై రెండు ప్రధాన సిద్ధాంతాలు వచ్చాయని, అవి మార్క్సిజం, అంబేద్కరిజం అని, ఒకదాంట్లో ఆర్థిక ప్రధానమైన వర్గ దృక్పథం కాగా, ఇంకొక దాంట్లో కుల ప్రధానమైన వర్ణ దృక్పథం ప్రధానమని అన్నారు. ఆర్థికంగా సమానత్వం ఉన్నంత మాత్రాన గొప్ప సమాజం రాదని, సాంఘిక సమానత్వం ప్రధానమని అన్నారు.

ప్రాచీన సాహిత్యంలో ఉన్న దళిత కోణాల్ని వివరిస్తూ, భారతంలో గరుత్మంతుడు కౌశికుడు ఏకలవ్య కథలలోని దళిత కోణాల్ని తెలిపారు. కులాల నిర్మూలనలో బసవేశ్వరుని కృషిని, ఆముక్తమాల్యదలో మాల దాసరి కథలోని దళితుని ఔన్నత్యాన్ని, వేమన, గుఱ్ఱం జాషువాల కృషిని వివరంగా తెలియజేశారు.

దళిత కల్పనా సాహిత్యంపై డాక్టర్ శిఖామణి మాట్లాడుతూ ప్రగతిశీల శక్తులు ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పోరాడు తున్నాయని, అదే స్థాయిలో దళితుల అంశాలపై పోరాడాలని అన్నారు. దళిత సాహిత్య ఆరంభ కాలం నుండి వచ్చిన దళిత కథ, నవలలను ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలలో ఎలా పరిణామము చెందాయో తెలిపారు. దళిత సాహిత్యంలో దళితేతరుల కృషిని ప్రస్తావించారు.

### బహుజన సాహిత్యం

రెండవ సమావేశంలో 'బహుజన ఉద్యమాలు - బహుజన సాహిత్యం' అంశంపై బండి నారాయణస్వామి అధ్యక్షతన జరిగింది.

నాళేశ్వరం శంకరం మాట్లాడుతూ దళిత ఉద్యమంలో భాగంగా బహుజన రచయితలు రచించేవారని, నేడు దళిత ఉద్యమం ఊపందుకోవడంతో బహుజన రచయితలు వేదికలెక్కే పనిలేకుండా శ్రోతలుగా ఉండాల్సిన పరిస్థితుల్లో బహుజన రచయితలు తమ అస్తిత్వ రక్షణం సాహిత్య సృష్టి ప్రారంభమైనదని అన్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో కులవృత్తులు అదృశ్యమయ్యాయని, బహుజనుల జీవితం చింపిన విస్తరిలా తయారయిందని, తమ హక్కుల రక్షణకై ఎంతోమంది కవులు కవిత్వం రాస్తున్నారని తెలిపారు. కవిత్వంతో పాటు "పాట"లో బహుజనతత్వం మరింత గాఢత చేకూరిందని అన్నారు.

ఈ దేశంలో మెజారిటీ ప్రజలు బహుజనులేనని, కాని హక్కుల పరంగా మైనారిటీలని, ఈ స్థితిలో దేశవ్యాప్తంగా ఉన్న బహుజనులు ఐక్యమైతే రాజ్యాధికారం వారిదేనని తెలిపారు.

ఈ లక్ష్య సాధన దిశగా వస్తు, కథ, నవల, సాహిత్యాన్ని వివరంగా సమీక్షించారు.

### స్త్రీవాద సాహిత్యం

రెండవ రోజు ఉదయం జరిగిన సమావేశంలో 'స్త్రీవాదోద్యమాలు - స్త్రీవాద సాహిత్యం' అంశంపై డాక్టర్ మోక్ష ప్రసూన అధ్యక్షతన జరిగింది. కార్యక్రమ నిర్వహణ డి. శిరీష్ చేశారు. డాక్టర్ మోక్ష ప్రసూన మాట్లాడుతూ మహిళలు రాజకీయ, సాంఘిక, కుటుంబపరంగా, ఉద్యోగ, వైద్య, సాహిత్య రంగాలలో ఎదుర్కొంటున్న వివక్షను గణాంకాలతో సహా వివరించారు. శిలాలోలిత మాట్లాడుతూ స్త్రీ వాద ఉద్యమం భావ స్వేచ్ఛ, వ్యక్తి స్వేచ్ఛ పోరాటాలకు మాత్రమే పరిమితం కాదని, స్త్రీలు అన్ని రంగాలలో ముందుకు వచ్చేవరకు సాగుతుందని అన్నారు. స్త్రీవాద కవిత్వంలో భాగంగా వచ్చి కవిత్వాలను, వాటి నేపథ్యాలను వివరించారు.

స్త్రీ వాద కల్పనా సాహిత్యం అంశంపై నల్లూరి రుక్మిణి మాట్లాడుతూ స్త్రీవాద మౌలికాంశాలను, నేపథ్యాన్ని స్త్రీవాదోద్యమ సిద్ధాంతాలలోని వైరుధ్యాల్ని వివరంగా తెలిపారు.

అమెరికాలో వచ్చిన స్త్రీవాద ఉద్యమాల ప్రభావంతో భారతదేశంలో ఫెమినిజం ప్రవేశించిందని తెలిపారు. సంఘ సంస్కరోణద్యమం, జాతీయోద్యమాలలో స్త్రీల పాత్ర విశిష్టమైనదని అన్నారు.

ఫెమినిజం ప్రధాన అజెండాగా పునరుత్పత్తి, కుటుంబ హింస, మాతృత్వం అనే అంశాలపై చర్చ జరుగుతోందని

తెలిపారు. అయితే మార్క్సిస్టు పంథా పునరుత్పత్తికి పునాది స్థానం వద్దని 'ఉత్పత్తే' పునాది స్థానంలో ఉండాలని వర్గ పోరాటంలో భాగంగా స్త్రీల సమస్యలు తీరుతాయని తెలియజేస్తోందన్నారు. కానీ స్త్రీవాదులు పునరుత్పత్తి పునాది రంగమంటున్నారు అని అన్నారు. స్త్రీ వాద విషయంలో మార్క్సిస్టు దృక్పథం పరిష్కారమని రుక్మిణి అభిప్రాయపడ్డారు.

1975-85లలో ఎంతో స్త్రీవాద సాహిత్యం వచ్చిందని, మూడు విధాలుగా చూడవచ్చని అన్నారు.

1. ఫెమినిస్ట్ సిద్ధాంతం ఆధారంగా వచ్చిన సాహిత్యం.

2. ఫెమినిజాన్ని నమ్మి, ఆర్థిక సామాజికాంశాలను పరిగణనలోకి తీసుకొని వచ్చిన సాహిత్యం.

3. ఫెమినిజాన్ని సానుభూతితో అర్థం చేసుకొని వచ్చిన సాహిత్యం (స్త్రీయేతరులు)

ఈ క్రమంలో వచ్చిన రంగనాయకమ్మ, ఓల్గా, కుప్పిలి పద్మ, డి. సత్యవతి, సి. సుజాత, కరుణ, గురజాడ, చలం, కో.కా., శ్రీపాదల వారి రచనలలోని స్త్రీవాద దృక్కోణాల్ని సమీక్షించారు.

అనంతరం మధ్యాహ్న సమావేశంలో కవి సమ్మేళనం జరిగింది. పలూరి మంగన్న, డి. కృష్ణమూర్తి, హిదయతుల్లా, వెంకటేష్, రామశేషయ్య, ఓబులేసు, శిరీష, చిలుకూరి దీవెన, ఉద్దండం చంద్రశేఖర్, నూక రాంప్రసాద్‌రెడ్డి, శిఖామణి, అజీద్, నబీ రసూల్ తమ కవితల్ని వినిపించారు. ఈ కార్యక్రమంలో భాగంగా శిఖామణి "నల్ల గేటు తెరుచుకొంది - నందివర్ధనం పూసింది" అన్న కవితా సంకలనాన్ని ఆవిష్కరించారు.

**ఇస్లాంవాద సాహిత్యం**

షేక్ కరీముల్లా ప్రసంగిస్తూ ఇస్లాం అనగా శాంతి అని అర్థమని అన్నారు. నేడు ఇస్లాం అనే పదం కొందరికి పెనుభూతంలా కనబడుతున్నదని విమర్శించారు. ఇస్లాం అనేది మతం కాదని అది జీవన విధానమని, ఎన్నో రకాల జాతులు ఇస్లాం సిద్ధాంతాలను నమ్మి అందులో చేరాయని అన్నారు. ఈ క్రమంలో భాగంగానే ముస్లిం జాతి ఇస్లాంలో భాగమేనని అన్నారు. కావున ముస్లిం వాదానికి తాత్విక చిరునామా ఇస్లాం అని అన్నారు. ఏ కవిత్వమైనా ఎదుటివారిని గాయపరిచేలా ఉండకూడదని, ద్వేషాల్ని పెంచే విధంగా రచనలు చేయటం మంచిది కాదని తెలిపారు.

ఈ సమావేశాలలోనే ఇస్లాం వాదానికి వ్యతిరేకంగా "ఇస్లాం వాదం అంటే ముమ్మాటికి మత సాహిత్యమే" అని కరపత్రం ముస్లిం రైటర్స్ ఫోరం, హైదరాబాద్ పేరు మీద పంచబడింది. ముస్లింల సామాజిక వెనుకబాటు గూర్చి మాట్లాడుతున్న ముస్లింవాదం గూర్చికాక, మత ప్రాతిపదికన మాట్లాడుతున్న సంకుచిత భావజాలం గల ఏ ఒక్కదాన్ని వేదికెక్కించి, మత ప్రచారం కావించటం సరైన చర్య కాదని ముస్లింవాదులు కరపత్రంలో తెలియజేశారు.

**ముగింపు**

రెండురోజుల పాటు జరిగిన ఈ సమావేశాలలో ఆయా సామాజికోద్యమాల కవిత్వం, కల్పనా సాహిత్యంకంటే ఆ ఉద్యమాల మూలాలు, నేపథ్యం, సైద్ధాంతిక అంశాలపై ఎక్కువగా కేంద్రీకరించినట్లు ఉంది. జిల్లాలోని యువ రచయితలకు ఆ ఉద్యమాలపై అవగాహ నకు ఈ సమావేశాలు ఎంతో ఉపకరించాయి. ఉపన్యాసాలతో పాటు, ముఖాముఖి చర్చా కార్యక్రమంకు అవకాశం ఉంటే బాగుండేదని శ్రోతలు అభిప్రాయ పడ్డారు. ఏమైనప్పటికీ సామాజికోద్యమాలలోని సాహిత్య పరిణామాల్ని అవగాహన కల్గించేందుకు ప్రయత్నించిన జిల్లా రచయితల సంఘం (జిరసం) వారిని అభినందించాల్సిందే.

ఈ సమావేశాలను జిరసం జిల్లా నాయకత్వం డాక్టర్ జూపల్లి ప్రేమ్‌చంద్, బిక్క కృష్ణ, ఎస్.వి. ప్రసాద్, రాచపాలెం చంద్రశేఖరరెడ్డి, సింగమనేని నారాయణ, శాంతి నారాయణ, మొదలగువారు నిర్వహించారు. సమావేశాల ఆద్యంతం అభ్యుదయ గేయాలను పాడిన లక్ష్మీనారాయణను సాహిత్యాభిమానులు అభినందించారు.

*

---



## తెరచిన కన్ను

**డాక్టర్ మానేపల్లి**

ఒక తెరిచిన కన్ను
అంతా తెరిచిన కన్నే
అంతే తెరిచిన కన్ను

అర్జునుణ్ణి మించిన వాళ్ళు
శతఘ్నులు ఎక్కుపెట్టారు
అమెరికా స్వయంగా అణ్వస్త్రం సంధించి
ఆ వెనుక ఇంగ్లండ్ తన వంతు
ప్రయత్నించింది
పిమ్మట ఎన్నెన్నో డైనోసర్‌లు
తెరచిన కన్ను చెక్కు చెదరలేదు
ముఖాలకు మాస్కులు మార్చుకొని

రాజులు రారాజులు రారారాజులు
ఘోరాతి ఘోర యుద్ధాలు చేశారు
ఆఖరికి అహింసాయుద్ధం
కూడా చేసి చూశారు
అక్షరాల యుద్ధంలో
విశ్వ (విద్యాలయ) ప్రయత్నం చేశారు

తెరిచిన కన్ను
కసికంద లేదు
తెరచిన కన్ను కద

సామ్రాజ్యాలు జడుసుకుంటున్నాయి
ఆఖరికి ఐరాస కూడా
కాంతి సంవత్సరాలు దాటి శుక్రుణ్ణి సైతం
ఛిన్నాభిన్నం చేయగల క్షిపణులు
నిరుపయోగమైపోయాయి

ఇంతా చేస్తే తెరచిన కన్ను
దాని చుట్టూ పసిపిల్లలు ఆడుకుంటున్నారు.

# లాటరీ

బస్సు బైపాస్ రోడ్డు మలుపు తిరగగానే, విశాల్ లేచి, "కాస్త ఆపండి" అని అన్నాడు. కండక్టర్ విజిల్ వేసి బస్ ఆపించాడు. విశాల్ తన సామాన్లు తీసుకుని కిందకి దిగాడు. బస్ వెళ్ళిపోగానే, అతడు తన సంచీని భుజాన తగిలించుకుని



చుట్టుపక్కల కలియజూశాడు. ఆ కూడలిలో చాలా 'సెవన్ సీటర్ ఆటోలు' ఆగి వున్నాయి. క్రితం ఏడాది వరకు ఈ కూడలి దాదాపు నిర్మానుష్యంగా ఉండేది. కాని కిళ్ళీ కొట్లు, ఆటోలు రావడంతో ఇప్పుడు రద్దీగా కనపడుతోంది. చిన్న చిన్న గుడిసెలలో టీ కొట్లు కూడా వచ్చాయి.

**హిందీ : రాకేష్ త్యాగి**

**అనువాదం : కొల్లూరి సోమశంకర్**

విశాల్ తన ఇంటికి నడిచి వెళ్ళాలంటే సుమారు 20 - 25 నిమిషాలుపడుతుంది. కాని ఆ దారిలో ఏదో ఊరేగింపు జరుగుతోంది. ఇంకో దారిలో ఇంటికి వెళ్ళాలంటే ఆటోలో వెళ్ళక తప్పదు. ఆటో స్టాండు కేసి చూశాడు. అక్కడ వరుసలో సిద్ధంగా ఉన్న ఆటోలో దాదాపు ఐదారుగురు కూర్చుని ఉన్నారు. విశాల్ కూడా అందులో ఎక్కి కూర్చున్నాడు. కాసేపటికి మరో ఇద్దరు విద్యార్థులు కూడా వచ్చి కూర్చున్నారు. డ్రైవరు ఆటోని స్టార్ట్ చేసి, చుట్టుపక్కలా చూడసాగాడు.

"ఇంక పోనీవయ్యా, సీట్లు నిండిపోయాయి" అని వెనుకనుంచి ఎవరో అరిచారు.

"ఇంకో ఇద్దరు కూర్చోవచ్చు" అన్నాడు డ్రైవరు. ఇంతలో ఇంకో డ్రైవరు వచ్చి ఈ డ్రైవరుతో మాట్లాడసాగాడు.

– "అన్నా, నిన్న కొద్దిలో తప్పిపోయింది. 'రెండో నెంబరు' వచ్చింది. నేను పది టికెట్లే కొన్నాను. ఏదో టీ ఖర్చులకు సరిపోయేంత వచ్చింది..." చెప్పాడతను.

"నేనైతే నిన్న అసలు టికెట్ కొనలేదు. పగలంతా ఈ డొక్కు బండిని బాగు చేయించడమే సరిపోయింది. సాయంత్రం కాలువ దగ్గర ఆఫీసర్ గారు కనిపించి, 'పద! షరాన్‌పూర్ వెళ్ళి కుర్చీ, మేజా బల్ల తెచ్చుకుందాం' అంటూ పిల్చారు. 'ఏం చేస్తాం, తప్పదు' అని అనుకుంటూ వెళ్ళి ఆయన సామానులు వాళ్ళ ఇంటి దగ్గర దింపాను. ఆయనను డబ్బులేం అడుగుతాం? పైగా ఆయన జేబులో చేయి కూడా పెట్టలేదు..." అన్నాడు విశాల్ ఎక్కిన ఆటో డ్రైవర్ రుసరుసలాడుతూ.

"ఏం చేస్తాం అన్నా, ఎక్కడ చూసినా ఇలాంటివాళ్ళే ఎక్కువయ్యారు..." అని అన్నాడు ఇంకో డ్రైవరు. ఇంతలో ఇంకో ఇద్దరు ప్రయాణీకులు వచ్చి డ్రైవరుకి రెండు ప్రక్కలా కూర్చున్నారు.

"గోవింద్, నేనొక రౌండ్ వేసొస్తాను' అని అంటూ ఆటోని పోనిచ్చాడు డ్రైవరు. ఆటో పరుగెడుతుంటే విశాల్ దారికి అటూ ఇటూ పొలాలలో కనిపిస్తున్న గోధుమ పైరుని చూడసాగాడు. ఆ దృశ్యం మనోహరంగా ఉంది. కొంచెం దూరంగా ప్రవహిస్తున్న నది ఇంకా అందంగా ఉంది. "పట్టణ ప్రాంతంలోని జనాలకు దూరంగా, పల్లెలకు, అందులోను పర్వత ప్రాంతాలకు రావడం ఎంతో బావుంటుంది..." స్వగతంలో అనుకున్నాడు విశాల్.

"గవర్నమెంట్ ఆఫీసుల దగ్గర ఎవరైనా దిగాలా" అని అడిగాడు డ్రైవరు.

"నేను దిగాలి. కాస్త ఆపు" అని అన్నాడు విశాల్. ఆటో దిగి డబ్బులిచ్చి, ఇంటి వైపు నడవసాగాడు. ఆ దారిలోంచి వెడుతుంటే, గజానికి ఒకరు చొప్పున, స్టూలు స్టాండ్ పెట్టుకుని లాటరీ టికెట్లు అమ్ముతున్నవాళ్ళు కనపడ్డారు. వాళ్ళని చుట్టుముట్టి ఉన్న కొనుగోలుదార్లు, వీళ్ళ అరుపులు, కేకలతో వీధి వీధంతా గోల గోలగా ఉంది. కొండ ప్రాంతంలోని ఈ చిన్న ఊరిలో లాటరీ ఇంతలా విజృంభిస్తుందనుకోలేదు విశాల్. ఒకప్పుడు 'ఉత్తరాంచల్' రాష్ట్రం ఏర్పడకముందు, అక్కడక్కడ చెదురు మదురుగా ప్రత్యేక రాష్ట్రం కోసం జరిగే ఆందోళనలు, అంతకు ముందు 'మందిరం - మసీదు' ల గొడవలు తప్ప ఈ ప్రాంతంలో మరే సమస్య ఉండేది కాదు. చాలా ప్రశాంతంగా ఉండేది ఈ ఊరు.

గాలి బాగా వీస్తోంది. నేలపైన సగం చింపి పడేసిన లాటరీ టికెట్లు కొన్ని ఎగిరొచ్చి విశాల్ మీద పడ్డాయి. కిందకి జారిన వాటిని కాలితో తొక్కిపెట్టి, ఒక టికెట్ ముక్కని పైకి తీశాడు. దాని మీద 'స్టార్ డైలీ లాటరీ' అని రాసుంది. దాన్ని ఉండలా చుట్టి విసిరేసి, ఇంటి వైపు నడిచాడు. విశాల్ సొంత ఊరికి వచ్చి దాదాపు ఏడాది కావస్తోంది. ఈ మధ్య కాలంలో ఊరిలో చాలా మార్పులు వచ్చాయి.

★ ★ ★

విశాల్ సాయంత్రం షికారుకి బయల్దేరు తుండగా, సునీల్‌కాంత్ ఎదురయ్యారు.



"ఎప్పుడొచ్చావు?" అని ఆయన విశాల్‌ని అడిగారు. "పొద్దున్నే" అని చెప్పాడు విశాల్. ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకోసాగారు.

"మన ఊర్లో లాటరీ తన ప్రతాపం చూపిస్తున్నట్లుంది" అని అన్నాడు విశాల్.

"ఈ ప్రలోభం చాప కింద నీరులా వ్యాపిస్తోంది. లాటరీ కోసం జనాలు వెర్రెక్కిపోతున్నారు. ప్రతి మనిషి పిచ్చివాడైపోతున్నాడు..." చెప్పారు సునీల్‌కాంత్.

"దీని దుంపతెగ! కాని ఇంత చిన్న ఊర్లోకి లాటరీ ఎలా రాగలిగింది?" అంటూ ఆశ్చర్యపోయాడు విశాల్.

"ఈ ప్రశ్న మాత్రం నన్ను అడగొద్దు. గత ఎనిమిది, తొమ్మిది నెలలుగా ఉప్పెనలా ముంచెత్తుతోంది. లాటరీ ఒకసారి ఊర్లోకి అడుగుపెట్టడమే కష్టం. ఒకసారి ప్రవేశించాక విస్తరించడం ఎంతో సులభం! అందరూ సులువుగా ధనవంతులైపోవాలని ఆశపడుతున్నారు. సాయంత్రం ఆఫీసవగానే, లాటరీ సెంటర్ల దగ్గరికి చేరిపోతారు..." నిస్పృహగా చెప్పారు. సునీల్‌కాంత్.

"అత్యాశకి పోయి డబ్బంతా వృధా చేస్తున్నారు. ఇది కూడా జూదమే" అన్నాడు విశాల్.

"మొత్తం జీతమంతా ఈ లాటరీ టికెట్లకే ఖర్చు చేసేవాళ్ళున్నారు..." చెప్పారు సునీల్‌కాంత్. మళ్ళీ ఆయనే మాట్లాడుతూ, "అన్ని జాగ్రత్తలు పాటించి లాటరీ టికెట్లు కొంటారు. గత కొన్ని నెలల ఫలితాలను మథించి, ఏ నెంబరుకి లాటరీ తగులుతుందో లెక్కేసుకుని మరీ కొంటారు..." అని చెప్పారు.

"తమ తెలివితేటలన్నీ ప్రదర్శిస్తారేమో..." అన్నాడు విశాల్ చిన్నగా నవ్వుతూ.

"అవును, ఎక్కడ విన్నా నెంబర్ల మాటే! జనాలకి ఏ మైకం కమ్మిందో తెలియదు, ఆడా మగా, పిల్లలనే తేడా లేదు. అందరూ లాటరీ సెంటర్లపై ఎగబడుతున్నారు. స్కూలు పిల్లలైతే, పుస్తకాలని అమ్మేసి మరీ లాటరీ టికెట్లు కొంటున్నారు" చెప్పారు సునీల్‌కాంత్.

"ఈ లాటరీల వల్ల ఎంత ఉపద్రవమో మీకు తెలియనిది కాదు. మీకు జ్ఞాపకం ఉందా? కొన్నేళ్ళ క్రితం 'ఇన్‌స్టెంట్ లాటరీ' లని నడిచేవి. 'నవభారత్ టైమ్స్'కి చెందిన విలేకరి ఒకరు కనీసం లాటరీ టికెట్ల వంకైనా చూడకుండా ఏ నెంబరుకి లాటరీ తగులుతుందో కోర్టులో నిరూపించాడు. అప్పుడే కదా కోర్టు' ఇన్‌స్టెంట్ లాటరీ'లను నిషేధించింది" అని గుర్తు చేశాడు విశాల్.

"ఏమన్నావు? ఉపద్రవమా? ఉత్సాహంగా పందాలు కాస్తున్నారిక్కడ. ఏ నెంబరుకి లాటరీ తగిలేది పందాలు కాసుకుంటున్నారు. జనాలు లాటరీ టికెట్టు కొనడమే కాకుండా, పందాలు కట్టి మరీ డబ్బు పోగొట్టుకుంటున్నారు" వాపోయాడు సునీల్‌కాంత్. మళ్ళీ ఆయనే మాట్లాడుతూ "లాటరీ నిర్వాహకులకి, పందాలను ప్రోత్సహించేవాళ్ళకి మధ్య సంబంధాలుంటాయి. జనాలు ఎక్కువ ఏ నెంబరుపై పందెం కాస్తారో, ఆ నెంబరుకి లాటరీ అస్సలు తగలదు" అని అన్నారు.

"అవును, తమకి నష్టం రావాలని వాళ్ళెందుకు కోరుకుంటారు? వాళ్ళేమీ ఉచిత సేవలు అందించడం లేదే? ప్రజలే నిజానిజాలు గ్రహించాలి" అన్నాడు విశాల్ ఆలోచనగా.

విశాల్ వైపుకి కొద్దిగా వంగి, "ఈ పందాలను మట్కా అని అంటారు. ఎవరైనా రెండు లాటరీ టికెట్ల నెంబర్లపై పందెం కాస్త, దాన్ని 'కంబైన్డ్' అని అంటారు" చెప్పారు సునీల్‌కాంత్.

"కానీ ఫలితాలను ప్రకటించేది అధికారులు కదా. మరి పందాలను ప్రోత్సహించేవాళ్ళు ఫలితాలను ఎలా ప్రభావితం చేయగలరు?" అనడిగాడు విశాల్.

"చెప్తాను. టికెట్‌లోని చివరి అంకెను నిర్వాహకులే ముందుగా ప్రకటిస్తారు. ఈ పందాలన్నీ, ఆ చివరి అంకె కలవడానికే..." అన్నారు సునీల్‌కాంత్.

"ఆహా, అప్పుడే జనాలు రెండంకెల టికెట్టా, లేక నాలుగంకెల టికెట్టా అనేది నిర్ణయించుకుంటారన్న మాట..." అన్నాడు విశాల్.

"ఈ అంకెల ఆటకి బాగా డబ్బు కావాలి. ఎంత డబ్బు కావాలంటే, మనం కోరుకున్న నెంబరు తగిలే వరకు, అదే నెంబరు మీద రోజు రోజుకి రెట్టింపు టికెట్లు కొనేంత కావాలి..." చెప్పారు సునీల్‌కాంత్.

విశాల్ తనకేసి అర్థంకానట్లు చూసేసరికి, మరింత వివరించసాగారు సునీల్‌కాంత్.

"ఉదాహరణకి నువ్వు ఈ రోజు ఆరో నెంబరు టికెట్ ఒకటి తీసుకున్నావనుకో. రేపు రెండు టికెట్లు, ఎల్లుండి నాలుగు టికెట్లు... అలాగన్న మాట! ఇలా నెలంతా ఆరో నెంబరు టికెట్టే కొంటుంటే, నువ్వు ఎంత ఖర్చు చేశావో, దానికి రెట్టింపు డబ్బు వచ్చే అవకాశం ఉంది. ఎందుకంటే ఉన్నవి 9 అంకెలే కదా. నువ్వు అనుకున్న అంకె ఏదో ఒక రోజు వచ్చి తీరుతుంది."

"లాటరీ విషయాలని మీరు బాగా అధ్యయనం చేసినట్లున్నారు. మీరెప్పుడైనా లాటరీ టికెట్ కొన్నారా?" అడిగాడు విశాల్.

"కొనాలని ఓ రోజు ఊగిసలాడాను. ఉదయం ఎందుకో నాలుగో నెంబరుకి లాటరీ తగులుతుందనిపించింది. కాని టికెట్ కొనలేదు. సాయంత్రం ఫలితాలను ప్రకటించాకా. నిజంగానే నాలుగో నెంబరు టికెట్‌కి లాటరీ వచ్చింది. అప్పుడు కొంచెం బాధనిపించింది" చెప్పాడు సునీల్‌కాంత్. ఆయన స్వరంలో పశ్చాత్తాపం ధ్వనించినట్లయింది.

ఆయన మాటలకి విశాల్‌కి నవ్వొచ్చింది. నవ్వుని దాచుకుని, ఆయన వద్ద సెలవు తీసుకుని ఇంటి ముఖం పట్టాడు. ఇంట్లోకి అడుగుపెడుతుంటే, వీధిలో ఓ చిత్రమైన దృశ్యం కనపడింది. దాదాపు 50 - 52 ఏళ్ళ వయసున్న ఆసామి ఒకరు సైకిల్‌పై వెడుతున్నాడు. ఆయన చుట్టూ సుమారు 9 కుక్కలు కూడా వెడుతున్నాయి - నాయకులకుండే ఎస్కార్టులా!



విశాల్ లోపలికి వెళ్ళి వాళ్ళమ్మని ఆయనెవరని అడిగాడు. "ఆయనా, భీమ్‌సింగ్! ఒంటరివాడు కదా, అందుకని కుక్కల్ని పెంచుకుంటుంటాడు. సంపాదించేదంతా, వాటిపైనే ఖర్చు చేస్తాడు. సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికి వచ్చేటపుడు వాటి కోసం బిస్కట్లు, బ్రెడ్ తెస్తుంటాడు" అని చెప్పారావిడ.

"కుక్కలకి మారాజు అన్నమాట!" అని అన్నాడు విశాల్ హాస్యంగా.

"ఈ కుక్కలు కూడా ఆయనని వదలవు. ఆయన ఆఫీసుకి వెళ్ళేటప్పుడు బస్‌స్టాప్ దాకా వెడతాయి. తిరిగి సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికి వచ్చేటప్పుడు ఆయన బస్ వచ్చే సమయానికే బస్‌స్టాప్ వద్ద ఎదురు చూస్తాయి. వీటికి ఆ సమయం ఎలా తెలుస్తుందో ఏమిటో? ఆయన వంట చేస్తున్నా, నిద్రపోతున్నా కూడా ఈ కుక్కలు ఆయన వెంటే ఉంటాయని అంటుంటారు..." అని చెప్పారు ఆవిడ. మళ్ళీ ఆవిడే మాట్లాడుతూ, "నిజానికి వీటివల్లే ఆయనకా అదృష్టం పట్టింది. ఒక లక్ష రూపాయల లాటరీ తగిలింది. తన జీతంతోనే ఆయనకు అవసరాలన్నీ తీరిపోతాయి. ఇక డబ్బంతా ఏం చేసుకుంటాడో?" అని అన్నారు.

తన ఇంట్లో కూడా లాటరీ ప్రస్తావన వచ్చేసరికి విశాల్ విస్తుపోయాడు.

"లాటరీ తగిలిన తర్వాత కొన్ని రోజులకి భీమ్‌సింగ్ ఇంట్లో దొంగలు పడ్డారు. ఈ కుక్కలే లేకపోతే, ఆ రోజు ఆయన చనిపోయి వుండేవాడే. ఎంతగా కొట్టారంటే పాపం తల మీద చాలా కుట్లుపడ్డాయి..." అని చెప్పారు. విశాల్ వాళ్ళ అమ్మగారు సానుభూతిగా.

ఆ రాత్రి నిద్రలో విశాల్‌కి రకరకాల కలలు వచ్చాయి. లాటరీ టికెట్లన్నీ, అందునా బహుమతి వచ్చిన టికెట్లన్నీ ఒక నదిలా ప్రవహిస్తున్నట్లు, టికెట్లను పరుపులా చేసుకుని తను నిద్రపోతున్నట్లు, ఇంకోసారి భీమ్‌సింగ్ తన కుక్కలతో సహా నడుస్తున్నట్లు, లాటరీ టికెట్లను గాలిలోకి ఎగరవేస్తే కుక్కలు వెళ్ళి నోట కరచుకుని తెస్తున్నట్లు కల కన్నాడు విశాల్.

★ ★ ★

మర్నాడు సాయంత్రం నదీతీరం వెంబడి షికారుకి వెడుతుండగా, ప్రభుత్వ ఆసుపత్రి సమీపంలో చాలామంది గుమికూడి కనిపించారు. సంగతి ఏమిటో కనుక్కుందామని విశాల్ అక్కడికి వెళ్ళాడు.

అక్కడ ఓ ఆవిడ పెద్ద పెద్దగా రోదిస్తూ ఉంది. మధ్య మధ్యలో "ఈ లాటరీ మా కొంప ముంచిందీ బాబోయ్" అంటూ శోకాలు పెడుతోంది. తన పక్కనే నిలుచున్న వ్యక్తిని ఏం జరిగిందని అడిగాడు విశాల్. అతడు చెప్పసాగాడు – 'వీళ్ళు ఒకప్పుడు పంజాబ్‌లో వ్యాపారం చేసుకుని బ్రతికేవారుట. అక్కడ తీవ్రవాదుల బెడద ఎక్కువై ఆస్తులని, బంధువులని వదిలేసి ఇక్కడకొచ్చి స్థిరపడ్డారట. వీళ్ళాయన మొదట్లో ఆటో అద్దెకి తెచ్చుకుని నడిపేవాడట. చాలాకాలం పాటు డబ్బుకి ఇబ్బందిగా ఉండేదిట. పదేళ్ళ తర్వాత పరిస్థితి మెరుగై, వాయిదాల మీద ఆటో కొనుక్కోగలిగాడట. జీవితం సుఖంగా గడిచిపోతోందనుకున్న సమయంలో అతడికి లాటరీ మైకం కమ్మింది. రోజువారీ సంపదలో చాలా భాగం లాటరీ టికెట్ల కోసమే ఖర్చు చేస్తున్నాడట. అప్పుడప్పుడు ఏదో పదో వందో బహుమతిగా వచ్చేవి. అలాగే, తనలాగే లాటరీ వ్యామోహం ఉన్న జనాలందరిని పోగుచేసి, ఎప్పుడు లాటరీ గురించే మాట్లాడుతూ, ఆటో తిప్పడం కూడా నిర్లక్ష్యం చేయసాగాడట. దీంతో ఇంట్లో గొడవలు మొదలయ్యాయట.

మొన్న పొద్దున ఈవిడ పిల్లల స్కూలు ఫీజు కట్టాలని, ఇంకా ఇంటి ఖర్చులకి కొంత డబ్బు కావాలని అతడిని అడిగిందట. ఆ విషయం మీదే వాళ్ళకి పెద్ద తగాదా అయిందట. పగలు ఆటో తీసుకుని బయటికి వెళ్ళిన అతడు, రాత్రి ఆలస్యంగా వచ్చి పడుకున్నాడట. నిన్న పొద్దున్న ఏమీ తినకుండా, తాగకుండా ఆటో తీసుకుని బయటకు వెళ్ళినతను, మధ్యాహ్నం రెండు గంటల సమయంలో ఇంటికి వచ్చాడట. కాని ఆటో తేలేదట.

'రిపేరుకి ఇచ్చుంటాడులే' అని ఈవిడ అనుకుందట. ఎందుకంటే ఆటో ఇబ్బంది పెడుతోంది, మెకానిక్‌కి చూపించాలి అని ఆ మధ్య ఎప్పుడో అన్నాడట.

అన్నం పెట్టి, నిశ్శబ్దాన్ని భగ్నం చేయడానికి, 'ఆటో ఏది?' అని అడిగిందట. అతను కంచం కేసి చూడనైనా చూడకుండా, ఆమె

చేతికి ఓ సంచి ఇచ్చి, 'దీన్ని జాగ్రత్తగా ఉంచు. ఆటో అమ్మేశాను. ఆ డబ్బుతో లాటరీ టికెట్లు కొన్నాను. ఈ రోజు తప్పనిసరిగా మనకి బహుమతి వచ్చి తీరాలి. 'మన దరిద్రం వదిలిపోవాలి' అని అన్నాడట. ఆ రోజు అతడు అన్ని ఐదో నెంబరు టికెట్లు కొన్నాడట. 'సాయంత్రం ఫలితాలు వస్తాయి. ఈ సంచిని భద్రంగా ఉంచు' అని చెప్పి బయటకు వెళ్ళిపోయాడట.

ఆమె నిర్ఘాంతపోయిందట. ఏం చేయాలో తోచలేదట. ఆ సంచిని తీసుకుని బజారులోకి వచ్చి ఏడుస్తు టికెట్లని అమ్మేయడం ప్రారంభించిందట. కొందరు పెద్దమనుషులు కూడా ఆమెకి సహాయంగా టికెట్లను అమ్మిపెట్టారుట. చాలా టికెట్లని అమ్మినప్పటికీ, ఇంకా సుమారుగా 100 టికెట్లు మిగిలిపోయాయట. పిల్లలు బడి నుంచి ఇంటికి వచ్చే సమయానికి ఇల్లు చేరిందామె.

అక్కడ ఆమె భర్తేమో తన మిత్ర బృందంతో కలసి వెళ్ళి నది ఒడ్డున కూర్చున్నాడట. తనకి లాటరీ వస్తే సరి, లేదంటే నదిలో దూకి చస్తానని ప్రకటించాడట. సాయంత్రం ఫలితాలు వచ్చాయి. అనుకున్నట్లే ఐదో నెంబరు టికెట్‌కి బహుమతి లభించింది. మిత్ర బృందం వెళ్ళి అతడికి వార్తనందించారు. అతడు ఉత్సాహంగా ఇంటికి వచ్చాడు. కాని ఇంటి దగ్గరి దృశ్యం వేరు. చాలా టికెట్లని ఆమె అమ్మేసిందని తెలియగానే అతడు మూర్ఛ పోయాడు. వెంటనే ఆసుపత్రికి తీసుకు వెళ్ళారట. ఇప్పుడు స్పృహ రాగానే, ఏవో పిచ్చి పాటలు పాడసాగాడు. పాపం, అతడికి మతి భ్రమించింది..." అంటూ ఆ వ్యక్తి ముగించాడు.

విశాల్ మనసు కరిగిపోయింది. అతడి పరిస్థితికి జాలి పడుతూ, ఇంటికి చేరుకున్నాడు. ఈ ప్రశాంతమైన ఊరిలో లాటరీ ఎంత కలకలం రేపిందోనని అనుకున్నాడు.

మర్నాడు దినపత్రికలో ఓ వార్త చూశాడు – లాటరీకి వ్యతిరేకంగా మహిళలు జిల్లా వ్యాప్తంగా ఆందోళన నిర్వహించారు. కలెక్టరుని ఘెరావ్ చేశారట. జిల్లాలో లాటరీని నిషేధిస్తామని హామీ ఇస్తే గాని వదలలేదట!

ఈ వార్త చదవగానే విశాల్ మనసు శాంతించింది. ప్రజలందరు చైతన్యవంతులై, ప్రలోభాలని, సాంఘిక దురాచారాలని రూపుమాపగలిగితే ఎంత బావుంటుందో కదా అని అనుకున్నాడు. లాటరీ వ్యతిరేక ఉద్యమమైనా, సారా వ్యతిరేక ఉద్యమమైనా ఆడవాళ్ళే ముందుండి నడిపిస్తున్న సంగతి అతడికి హఠాత్తుగా స్ఫురించింది. చెట్లని కొట్టేయకుండా కాపాడే చిప్కో ఉద్యమంలో కూడా మహిళలే ముఖ్య పాత్ర వహించడం అతడికి గుర్తొచ్చింది.

"అవును, ఉద్యమాలలో ఆడవాళ్ళే ఎందుకు ముందుంటున్నారు?" అని ఆలోచించసాగాడు.

*

---

# "నీళ్ళు పొయ్యండ్రా నాయనా.... నెత్తురొద్దు"

**ఆర్. రాఘవరెడ్డి**

అడవిలో చెట్లకిప్పుడు ఆకులు మొలుస్తున్నాయా...?
ఏమో... తుపాకులే కనిపిస్తున్నాయ్
వెదురు పొదల నుండొచ్చేగాలి
'హంసధ్వని' పలికిస్తోందా?
ఏమో... హింసధ్వనే వినిపిస్తోంది
వనదేవతలై తిరుగాడుతున్నారా గిరిజనులిక్కడ?
ఏమో... భయం గుప్పెట్లోనే బ్రతుకీడుస్తున్నారు
అసలిది నల్లమలేనా...?
ఏమో... రక్తం ప్రవహిస్తోన్న 'ఎర్రమల' కావచ్చు
తొలి తూటా పేల్చిందెవడి తుపాకీ?
ఎవడిది చర్య? ఎవడిది ప్రతిచర్య?
... సాగుతూనే ఉంటుందనంతంగా ఈ చర్చ
అది కౌంటరైనా, ఎన్‌కౌంటరైనా ఆగేశ్వాస మాత్రం క్రింది స్థాయిదే.
అస్తవ్యస్తమయ్యే జీవనం.. ముమ్మాటికీ సామాన్యుడిదే
నాడు రాజరికం, నేడు ప్రజాస్వామ్యం... వ్యవస్థ ఏదైతేనేం?
రాజులూ, ముఖ్యనాయకులూ భద్రమే
సైన్యం బ్రతుకు మాత్రం ఛిద్రమే.
కత్తులూ, గొడ్డళ్ళతో నరికే చేతులు వ్యవస్థను మారుస్తాయా?
చెట్లకు కట్టేసి కాల్చేసే చేతులు వ్యవస్థను రక్షిస్తాయా?
జవాబు దొరకని సమాధానం... రాని ప్రశ్నలే అన్నీ
ఐనా బ్రతుకే ఒక ప్రశ్నార్థకమైనవేళ... సమాధానాలాశించడమే ఫన్నీ
అవును... పరస్పర విరుద్ధ శక్తుల మధ్య ఘర్షణ అనివార్యం
కానీ... ఆ ఘర్షణకూ ఒక నీతి ఉండాలి
సామాజికామోదం లభించే రీతి ఉండాలి.
రుధిరం చిందించడమే 'రీతి..నీతి' అయితే
సమన్వయం సాధించాల్సిన యంత్రాంగం
రాజకీయ పబ్బం గడుపుకోవడానికే పరిమితమైతే
'ఉద్ధరణాత్మనాత్మానాం' గీతా వాక్యమే శరణ్యం సామాన్యుడికి
కదలాలి... నిర్లిప్తత వదలాలి
గళం విప్పాలి... సంఘటితమవ్వాలి
అటు పిడివాదాన్నీ ఖండించాలి... ఇటు పెదథోరణుల్నీ దండించాలి
ఈ నేల తడవాల్సింది నీటితో... నెత్తుటితో కాదని శాసించాలి

# స్త్రీత్వపు అఖిలత్వాన్ని నిరూపించిన "తొలెరుక"



ముదిగొండ శివకౌముదీదేవి

స్త్రీల గురించి, వారి అస్తిత్వ వేదన, అస్తిత్వ నిరూపణాకాంక్షల గురించి స్త్రీవాదులు ఎంతో వ్రాశారు. అయితే స్త్రీని పునరుత్పత్తి శక్తిగా గుర్తించి, ఆమె పునరుత్పత్తి శక్తుల గురించి, ఆమెకు తనపై తనకు హక్కులు రావడం కావాలని కోరుతూ (పూర్వులు మాతృత్వాన్ని ఉన్నతీకరించారు తప్ప నిజానికి) స్త్రీలకు మాతృత్వం ఉన్నతీకరించాల్సినంత ఘన విషయం కాదని చెపుతూ కూడా పుస్తకాలు వెలువడినాయి. అదొక దృష్టి కోణంగా కూడా రూపొందుకున్నది. కాని స్త్రీ మాతృత్వంలోని దివ్యత్వాన్ని, మాతృత్వపు విశ్వవ్యాప్తతను, మహిళల అఖిలత్వాన్ని, ఔన్నత్యాన్ని, ప్రాచీన ఉదాహరణల సహితంగా వివరిస్తూ, స్త్రీ అఖండత్వాన్ని ప్రతిపాదిస్తూ సాగిన రచన ఛాయరాజ్ తొలెరుక.

ఈ విశ్వం ముందుకు సాగడానికి ప్రధాన చోదక శక్తులు స్త్రీ పురుషులు అయినా, స్త్రీ తన మాతృత్వం వల్ల అఖిలత్వాన్ని, అఖండతనూ పొందుతున్నదని, ఆమె ప్రకృతి శక్తుల భౌతిక, అధి భౌతిక స్వరూపం అనీ నిరూపించిన రచన తొలెరుక. ఇక్కడ కవి మాతృత్వాన్ని ప్రతి స్త్రీలో, మొత్తంగా స్త్రీ జాతిలో కనుగొన్నాడు. వేదకాలం నాటి స్త్రీ అదితి (సూర్యుని తల్లి)తో ప్రారంభించి, నదిగా ప్రవహించిన సరస్వతిని, రుగ్వేదంలో వివరించిన ఏడు ఛందస్సుల పేర్లతో భాషను తల్లిగా గుర్తిస్తూ, నిరూపిస్తూ ఈ "తొలెరుక" జన్మ కావ్యం సాగుతుంది. వారి అస్తిత్వ పోరాటాలను, చరిత్రను గుర్తు చేస్తాడు కవి. అమ్మతనంలోని అమూర్తత్వాన్ని, దాని విశ్వవ్యాప్తతను గుర్తించి, చిత్రించి, ప్రశంసించి, ఆరాధించిన కవిత తొలెరుక.

కడుపులో ఉన్న బిడ్డకు తల్లికి మధ్య సంభాషణను గతంలో ఓల్గా "పుట్టని బిడ్డకు తల్లి ఉత్తరం" కవితలో వ్రాశారు. అయితే తొలెరుక అందుకు భిన్నంగా తాను పుట్టకముందే తన తల్లిని బాల్యం నుండే చూసి, ఆమే తల్లి అయి, వృద్ధురాలు అయ్యే వరకూ, మృతి వరకూ తలచుకున్న ఒక కొడుకు స్మరణ. ఆ విధంగా ఒక పుత్రుడు తన తల్లి గతంలోకి అభౌతికంగా ప్రవేశించి, గమనించి వర్ణించడంలో కొంత మేజిక్ రియలిజం ధోరణి ఉన్నది. కేవలం తన తల్లి పట్లనే కాకుండా మొత్తం స్త్రీ జాతిలోనే తల్లిని దర్శించడం ఇటువంటి జన్మ కావ్యం రచించడం కవికి గౌరవం. ఇది ఒక ఉత్తమ దృక్పథాన్నే కాకుండా సాంప్రదాయ భారతీయ సంస్కారాన్ని కూడా సూచిస్తుంది.

సృష్టి ఆరంభం పెద్ద విస్ఫోటనంతో జరిగిందని ఖగోళ శాస్త్రంలో బిగ్ బ్యాంగ్ సిద్ధాంతం చెపుతుంది. ఈ కవితలో ఛాయరాజ్ ఆ సృష్టి ఆరంభం నుండి రుగ్వేద కాలం నుండి స్త్రీ శక్తి స్వరూపాలను, అడవి, నదులు, మేఘం, మెరుపు, వాయువు, వర్షం, హరితం వంటి ప్రకృతి శక్తులలోనూ, పంచ భూతాలలోనూ, వాటి ఇతర బహిర్‌రూపాలలోనూ స్త్రీని అమ్మగా దర్శించి వర్ణించిన తీరు అద్భుతం. అనితర సాధ్యం.

స్త్రీ పాదం నుండి పొలం, శ్రమ నుండి అన్నం, కౌగిలి నుండి ఆవాసం, హృదయం నుండి అమృతం పుట్టినట్లు వర్ణించడంతో రచయిత తన రచనకు మాంత్రిక వాస్తవికతా దృక్పథం కల్పించడమే కాకుండా, తన జన్మకావ్యాన్ని ప్రాచీన సంస్కృత కావ్యాల స్థాయికి తీసుకుని వెళ్ళారు. స్త్రీని కేవలం భోగవస్తువుగా చూసే ప్రబంధ యుగ సాహిత్యం, స్త్రీని విపణి అవసరంగా, ఫ్యాషన్ డాల్‌గా చూసే ప్రపంచీకరణ సందర్భంలో స్త్రీ ఔన్నత్యాన్ని, అందలి ఔచిత్యాన్ని గుర్తించి, వివరించిన తొలెరుక స్త్రీల గురించి పురుషులు వ్రాసిన కావ్యాల్లో ఒక కలికి తురాయిగా నిలుస్తుంది.

ఈ కథాత్మక జన్మకావ్యంలో కవి తను గతంలోకి, వర్తమానం లోకి, భవిష్యత్‌లోకి ప్రయాణిస్తూ తల్లిని ఆమె బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం, మరణం వరకూ వర్ణిస్తాడు. ఇంతే కాదు. కవి దేశదేశాలలోని స్త్రీ మూర్తులను గుర్తించి వందన మొనర్చుతున్నాడు. ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్, గోద్రాలలోని స్త్రీలనుభవించిన హింసను ఖండిస్తూ, అందుకు దుఃఖిస్తూనే స్త్రీ సార్వజనీనతనూ, సార్వకాలీనతను, తెలుపుతాడు. ఐదు ఖండికలున్న ఈ కావ్యంలో కవి రెండవ ఖండికలో తాను శిశువుగా మాతృగర్భంలో ఉన్నప్పటి జ్ఞాపకాలను మనతో పంచుకుంటాడు.

మూడవ ఖండికలో స్త్రీని వివిధ బంధు రూపాలలో తల్చుకుంటాడు. సూర్యుని తల్లి అదితి రెండు లక్షల శబ్దాలను సృష్టించినదని చెపుతూ, ఆమె శబ్దాలు విశ్వమంతా పాలభాషగా మారినట్లు వర్ణిస్తాడు. ఇక్కడ కవి విశ్వ పరిణామ క్రమాన్ని, మానవ పరిణామ క్రమాన్ని భాషతో పోల్చి చెప్పడం చాలా బాగుంది. నాదం, నాట్యం, మాటలు, వాక్యాలు, విశ్వమంతా విస్తరించాయనడం కవి అభివ్యక్తి సాంద్రతకు, ఊహా విస్తృతికి, స్త్రీ పట్ల, ఆమె అస్తిత్వంలోని దివ్యత్వం, మార్మికత్వం, మహిమల గురించిన కవి ఎరుకకు ఉదాహరణ. ఈ ఖండికలో కవి మాతృభాషను కూడా మాతృత్వపు రూపంగా కీర్తిస్తాడు.

సూర్యోదయాన్ని చిర్నవ్వు కృశ్చన్ మార్కుకి వేలాడదీయడం, భుజాన ప్రతీకలు మోయడం వంటి పోలికలు మ్యాజిక్ రియలిజం ధోరణిని చెబుతాయి. ప్రతి ఖండికలో స్త్రీ ఎలా విశ్వవ్యాపిత, అఖిల అస్తిత్వమయి అయినదో వివరించిన తీరు అద్భుతం. నాలుగో ఖండికలో కవి తన కుమార్తెను కూడా తన కడుపున పుట్టిన తల్లిగా భావిస్తాడు. ఇక్కడ కవి మార్క్సిస్టు ధోరణి కూడా అభివ్యక్తమే. తల్లిని శ్రమకు ప్రతిరూపంగా భావిస్తాడు కవి. రైతు కూలీల్లో, కార్మికుల్లో తల్లినే దర్శిస్తాడు.

"కనీసాన్ని పరిష్కరించి జీవితాన్ని అన్నంతో అలంకరించు" వంటి అద్భుత కవితామయ వాక్యాలు తొలెరుకలో ఉన్నవి. కవి స్త్రీని పునరుత్పత్తి శక్తిగా గుర్తించడమే కాక యుద్ధాన్ని నివారించి, భూమిని పంచమని, ప్రపంచంలో ఆకలి లేని అందచందాలను సృజించి, ప్రపంచ సౌందర్యాన్ని ఉద్దీపింపచేయమని, తన తల్లికే కాక కూతురుకే కాక స్త్రీ జాతికే ఆదర్శాన్ని నిర్దేశిస్తున్నాడు. ఇక్కడ ఋగ్వేదకాలంలో ఉషస్సు అనే దేవతను ఇంద్రుడు ఆమె ఎడ్లబండిని విరిచి తరిమేసిన విషయం చెబుతూ వేద కాలంలోనే దేవతా స్త్రీకి జరిగిన అన్యాయాన్ని, ఇంద్రుని దౌర్జన్యాన్ని వివరిస్తాడు. ఋగ్వేద ఋషులు ఆమెను 21 శ్లోకాలతో స్తుతించిన విషయం ప్రస్తావిస్తాడు. మెసపొటేమియా, హరప్పా - మొహంజొదారో వంటి సింధు నదీ నాగరికతలలో స్త్రీ శక్తి స్వరూపాన్ని స్మరిస్తూ, ఆమె యుగయుగాల త్యాగాలకు, అస్తిత్వానికి అంజలి ఘటిస్తాడు కవి. ఇక్కడ కవి పురాణకాలం నుండి ఆధునిక కాలం వరకూ సీత, కుంతి, ద్రౌపది, శకుంతల నుండి మృచ్ఛకటిక నాయిక వసంతసేన, గురజాడ, మధురవాణిల నుండి, పురుష దౌష్ట్యానికి, మోసానికి బలయిన ప్రత్యూష, శ్రీలక్ష్మిల వరకూ స్త్రీ లందరినీ తలచుకుని వందనమొనర్చుతాడు.

అదే సమయంలో స్త్రీ అంతర్జాతీయ క్రీడల్లో బొమ్మగా, విపణీకరణ చెందిన సంస్కృతిలో ఫ్యాషన్ బొమ్మగా మిగలడాన్ని తలచి దుఃఖిస్తాడు.

ఐదవ ఖండికలో స్త్రీ బహుముఖ అస్తిత్వాన్ని, అఖండ స్త్రీత్వాన్ని, అఖిలత్వాన్ని, శక్తి స్వరూపాన్ని, శ్రమ స్వరూపాన్ని, పునరుత్పత్తి స్వరూపాన్ని, యుద్ధోన్ముఖ స్వరూపాన్ని, పోరాట స్త్రీలను స్మరిస్తూ వారికి వందనాలు సమర్పిస్తాడు.

తెలుగులో స్త్రీ అఖండ వ్యక్తిత్వాన్ని, బహుముఖ అస్తిత్వాన్ని, అఖిలత్వాన్ని, దివ్యత్వాన్ని విశదంగా చెబుతూ, విపులంగా వర్ణించిన ఇటువంటి కావ్యం మరొకటి లేదనుకుంటాను. ఇందుకు ఛాయారాజ్ అభినందనీయుడు. తొలెరుక మనందరికీ తొలెరుక అవుతుంది. స్త్రీల పట్ల వివక్ష, చిన్న చూపు, స్త్రీకి సమాజంలో ద్వితీయ శ్రేణి గుర్తింపు, వ్యవస్థీకృతమైన హింస, అణచివేత, పీడన, దమనకాండలను యుగయుగాలుగా స్త్రీలు ఎదుర్కొంటున్న నేపథ్యంలో, అభివృద్ధి చెందని సమాజాల్లోనే కాకుండా చెందిన సమాజాలలో కూడా స్త్రీలు ఇంకా అస్తిత్వ పోరాటాలు చేయవలసిన స్థితిలో ఉన్న సమకాలీన దశలో ఇటువంటి మరెన్నో తొలెరుకలు వస్తే గాని మన జాతి గాఢ నిద్ర నుండి మేల్కొని జాగృదావస్థలోకి ప్రవేశించదు. ఈ పుస్తకం ఒక కనువిప్పు. పురుషాహంకారంపై ఒక కొరడా దెబ్బ.

స్త్రీని సామాజిక ఉత్పత్తి శక్తిగా, పునరుత్పత్తి శక్తిగా గుర్తించిన కవి ప్రాచీన ఐతిహ్యాలతో పాటూ, పురాణ ప్రతీకలతో పాటూ, ఆధునిక ధోరణి, మార్క్సిస్టు దృక్పథం జోడించడం వలన ఈ జన్మకావ్యం సమగ్రంగా రూపుదిద్దుకున్నది. పుస్తకాన్ని ప్రచురించిన ఏ.పి. టీచర్స్ ఫెడరేషన్ వారు ప్రశంసనీయులు.

---

# ఏరులా పారుతున్న రక్తం



**డాక్టర్ ప్రసాద్**

ప్రకృతిలో లేచే
వణుకు పుట్టించే
భయం గొలిపే పరిణామాలు
'తెలియని శక్తిదరి' వైపు అడుగులేయించాయి.

అలల సముద్రం మనసు
పరిమళంతో నిశ్శబ్దంగా విచ్చుకునే
పువ్వవుతుందని
లోకమంతటా మేల్కొన్న
ఎన్నో రకాల పూజా మార్గాలు
చిందుతున్న చెమట
అన్నంగా నోటి ముందుకు రానంత వరకు
మనసెలా తీయని పాటలా పండుతుంది?

రానురానూ
ఒకడి నీడన సుఖంగా సేద తీరుతున్న వాళ్ళకు
మతం రక్షణ వలయమైంది

భిన్నదారుల ఆధ్యాత్మికతలు
కలిసి సాగుతున్న బతుకుల్లో
మెజారిటీ జనాన్ని ఓట్లుగా మార్చుకొని
పదవిపై కులికేందుకు
రక్తాన్ని ఏరులా పారిస్తున్నారు.

# శరత్‌బాబు 'భారతి' టెర్రరిస్టు ఉద్యమం




శరత్ తన రచనల్లో ముఖ్యంగా కేంద్రీకరించిన విషయాలు సమాజంలోని కీలక వైరుధ్యాలుగా నేటికీ నిలిచి ఉన్నాయి. స్త్రీలు, హిందూ సమాజంలోని మూఢాచారాలు, జాతీయోద్యమపు తొలి సంవత్సరాలలోని కొన్ని ధోరణులు ఇవి ప్రధానంగా శరత్ కథాంశాలు. అవి ఇప్పటికీ పరిష్కారం కావలసిన వైరుధ్యాలుగానే ఉన్నాయి. ఈ మూడు విషయాలనూ శరత్ మానవతా దృష్టితో వివేచించి రచనలు చేశాడు. ఆ వివేచన, ఆ చర్చ ఇవాళ కూడా జరగవలిసే ఉంది. దానికి సాధనం కాబట్టే శరత్ సాహిత్యానికి అంత ఆదరణ.

**ఓల్గా**

శరత్ రచలన్నిటినీ విశాలాంధ్ర ప్రచురణాలయం వాళ్ళు పునర్ముద్రించడం చాలా సంతోషించాల్సిన విషయం. వంద సంవత్సరాల నుంచీ శరత్ పాఠకులు పెరుగుతున్నారే గాని తరగటం లేదు. ఎందువల్ల? శరత్ రచనా శక్తి గురించి ఎవరికీ సందేహం లేదు. చేయి తిరిగిన శిల్పి. కానీ కేవలం రూపం చూసి మాత్రమే శరత్ సాహిత్యాన్ని పాఠకులు ప్రేమిస్తున్నారనటం సరికాదు. లోపలి విషయాలు ఇప్పటికీ మనల్ని వేడెక్కించేవి, మన విలువలను తరచి తరచి చూసేవి కావడం వల్లే ఆ సాహిత్యానికి అంత శక్తి. శరత్ తన రచనల్లో ముఖ్యంగా కేంద్రీకరించిన విషయాలు సమాజంలోని కీలక వైరుధ్యాలుగా నేటికీ నిలిచి ఉన్నాయి. స్త్రీలు, హిందూ సమాజంలోని మూఢాచారాలు, జాతీయోద్యమపు తొలి సంవత్సరాలలోని కొన్ని ధోరణులు ఇవి ప్రధానంగా శరత్ కథాంశాలు. అవి ఇప్పటికీ పరిష్కారం కావలసిన వైరుధ్యాలుగానే ఉన్నాయి. ఈ మూడు విషయాలనూ శరత్ మానవతా దృష్టితో వివేచించి రచనలు చేశాడు. ఆ వివేచన, ఆ చర్చ ఇవాళ కూడా జరగవలిసే ఉంది. దానికి సాధనం కాబట్టే శరత్ సాహిత్యానికి అంత ఆదరణ.

శరత్ రచనలన్నిటిలో "భారతి" నవల ఒక ప్రత్యేకత గలది. ఇది భారత జాతీయోద్యమంలోని విప్లవ 'టెర్రరిస్టు ధోరణుల గురించి చర్చించిన నవల. శరత్ ఈ నవల రాసే నాటికి గదర్ ఉద్యమం ముగిసిపోయి ఉండవచ్చు. 1907వ సంవత్సరం నుంచీ మొదలైన ఈ విప్లవ టెర్రరిజం గురించి కొంత తెలుసుకుంటే భారతి నవల మరింత బాగా అర్థమవుతుంది. 1907 సంవత్సరాంతానికి భారత జాతీయ కాంగ్రెస్‌లో మితవాద అతివాద గ్రూపుల మధ్య విభేదాలు తారాస్థాయికి వచ్చాయి. బ్రిటిష్ పాలనతో, కాంగ్రెస్‌లోని అతివాద మితవాద రాజకీయ విభేదాలతో విసుగెత్తి అసహనంతో ఉన్న యువకులు వ్యక్తిగత సాహస కార్యాచరణలోకీ, విప్లవ టెర్రరిజంలోకీ అడుగుపెట్టారు. వీరికి తమ దేశభక్తిని ప్రదర్శించడానికి మరో మార్గం దొరకలేదు. అతివాదులు చేసిన ఆలోచనలు సరిగానే ఉనప్పటికీ (కోర్టులను, విద్యాలయాలనూ బహిష్కరించడం, విదేశీ వస్త్ర బహిష్కరణ మొదలగునవి) వాటిని ఆచరించడానికి వారు సరైన మార్గం చూపలేక పోయారు. మితవాదుల కంటే భిన్నమైన ధోరణితో ఉన్నప్పటికీ ఒక ఖచ్చితమైన ఉద్యమ స్వరూపాన్ని నిర్వచించి చెప్పలేక పోయారు. కొత్త రాజకీయ పోరాట రూపాలను ప్రజలకు అందించలేకపోవడంతో యువతరాన్ని కాంగ్రెస్‌లోని అతివాదులు ప్రభావితం చేయవలసినంతగా చేయలేక పోయారు.

### తొలి దశ

1906వ సంవత్సరంలోనే కలకత్తా నుంచి వచ్చే 'యుగంతర్' అనే పత్రికలో "బలాన్ని బలంతోనే అంతం చేయాలి" అనే ధోరణితో వ్యాసం వచ్చింది. అయితే ఏ రూపంలో ఇది జరగాలన్నప్పుడు ఈ యువకులకు ఆదర్శంగా ఐరిష్ జాతీయవాదులూ, రష్యా నిహిలిస్టులు నిలిచారు. ఆ ప్రభావంతో వీరు ప్రజా కంటకులైన బ్రిటిష్ ఆఫీసర్లను హత్య చేయాలనీ, అలాంటి పనులు పాలకులను భయపెట్టి, ప్రజలలో దేశభక్తి రేకెత్తించి వారికి బ్రిటిష్ పాలకులంటే ఉన్న భయాన్ని తగ్గిస్తాయనీ ఆలోచించారు. హత్యలు జరిగినపుడూ, యువకులను అరెస్టు చేసినపుడూ ప్రజలలో దీని గురించి ప్రచారం జరుగుతుందనీ, అది ప్రజల మనసుల్లో వలస పాలకుల మీద వ్యతిరేకతను మరింత పెంచుతుందని కూడా వారు ఆలోచించారు. దీనికి కావలసిందల్లా ప్రాణ త్యాగం చేయగలిగిన కొందరు యువకులు. అలాంటి యువకుల సంఖ్య క్రమంగా పెరిగింది. 1907, 1908 నుంచీ దేశంలో వరసగా బ్రిటిష్ అధికారులను అంతమొందించే చర్యలు జరిగాయి. రహస్య విప్లవ సంస్థలు ఏర్పడ్డాయి. వాళ్ళ ప్రధాన కార్యక్రమాలు క్రూరులైన బ్రిటిష్ అధికారులను చంపటం, తమ సంఘాల్లోని ఇన్‌ఫార్మర్లనూ, వంచకులనూ చంపటం, తమకు కావలసిన నిధుల సేకరణకు దోపిడీలు చేయటం. బెంగాల్‌లో ప్రఫుల్ల చాకీ, ఖుదీరాం బోస్, రాస్ బిహారీ బోస్, సచిన్ సన్యాల్, మదన్‌లాల్ ధింగ్రాలు ప్రముఖులు. కానీ ప్రజా పునాది లేకపోవడంతో బ్రిటిష్ పాలకుల అణచివేతను వ్యక్తులుగా వారు ఎక్కువకాలం భరించలేకపోయారు. అయితే దేశంలో జాతీయ భావాలు బలపడటానికి వారు చేసిన చర్యలు ఎంతో ఉపయోగపడ్డాయి.

### గదర్ పార్టీ ప్రభావం

మొదటి ప్రపంచ యుద్ధానికి కొంతకాలం ముందు అమెరికాలో మొదలైన గదర్ ఉద్యమం, యుద్ధ సమయంలో బ్రిటిష్ వారిపై దెబ్బ తీయాలనీ, స్వాతంత్ర్యం సాధించాలనీ ప్రయత్నించింది. విదేశాలలో గదర్ ఉద్యమం కింద సమీకృతులైన భారతీయులందరూ భారతదేశం వచ్చి భారత సైన్యాన్ని తమ భావాల వైపు ఆకర్షించి బ్రిటిష్ వారిపై యుద్ధం ప్రకటించాలనుకున్నారు.

యుద్ధ ప్రకటన కూడా చేశారు. జపాన్, ఫిలిప్పైన్స్, చైనా, హాంగ్‌కాంగ్, మలయ, సింగపూర్, బర్మా దేశాలకు ప్రముఖ నాయకులను పంపి అక్కడి భారతీయులను స్వదేశం వచ్చి తిరుగుబాటుదార్లలో చేరమని ప్రబోధం చేశారు. 1915లో గదర్ ఉద్యమాన్ని వలస పాలకులు అణచివేశారు. 45 మంది విప్లవకారులను ఉరి తీశారు. 200 మంది యావజ్జీవ శిక్ష అనుభవించారు.

అయితే గదర్ ఉద్యమం వల్ల విదేశాలలోని భారతీయ కార్మికులకు వలస పాలనలోని దోపిడి తేలికగా అర్థమయింది. గదర్ ఉద్యమం వల్ల జరిగిన మరొక ప్రధానమైన మేలు సెక్యులర్ భావాలు బలపడటం. జాతీయోద్యమంలోని సెక్యులర్ భావాలూ, అంతర్జాతీయ దృక్పథం పరిచయ మయింది గదర్ ఉద్యమం వల్లనే.

1908 నుంచీ 1918 వరకూ, ఈ పది సంవత్సరాల కాలంలో ఒక తరం మేధావి వర్గ విప్లవ నాయకత్వాన్నంతా బ్రిటిష్ ప్రభుత్వం తుడిచిపెట్టింది. ఆ నాయకులలో ఒకరు సవ్యసాచి పాత్రలో 'భారతి' నవలలో మనకు కనిపిస్తారు. ఆ పాత్ర కల్పితమే అయినప్పటికీ అటువంటి వ్యక్తులు టెర్రరిస్టు ఉద్యమంలో అనేకులు ఉన్నారు. గదర్ ఉద్యమానికీ, చంద్రశేఖర్ ఆజాద్, భగత్‌సింగ్‌ల రాజకీయ కార్యాచరణ సంవత్సరాలకూ మధ్య కాలంలో ఈ కథా నేపథ్యంగా భావించవచ్చు.

**భారతితో విప్లవకారులు**

'భారతి' నవలంతా రంగూన్‌లో జరుగుతుంది. కథ చాలా సాదా సీదాగా, అపూర్వబాబు అనే సనాతన యువకుడు ఉదర పోషణార్థం భయం భయంగా రంగూన్‌లో అడుగిడటంతో మొదలవుతుంది. అతనికి 'భారతి' అనే ఆంగ్లో ఇండియన్ అమ్మాయితో పరిచయం, విరోధులుగా తలపడి ఒకరి పట్ల ఒకరు ఆకర్షితులు కావటం ఇదంతా ఎంతో చక్కని ప్రేమ కథలా సాగుతుంది. అయితే ఆ సమయంలో రంగూన్‌లో భారతీయ విప్లవ సంఘం ఒకటి పనిచేస్తోంది. భారతి ఆ గ్రూపులో సభ్యురాలవుతుంది. మొదట భారతికి కూడా ఆ సంఘపు వేళ్ళు ఏ రాజకీయ దృక్పథంలోంచి వచ్చాయో తెలియదు. రంగూన్‌లోని భారత కార్మికుల సంక్షేమం కోసం పనిచేసే సంఘమనే అనుకుంటుంది. రంగూన్‌లోని మన కార్మికులు దుర్భరమైన



— * * * — — — —

**ఒక్క వ్యక్తి నిర్మించగల, ఒక్క వ్యక్తి సర్వనాశనం చేయగల సంఘాల, సంస్థల స్థానంలో ప్రజా ఉద్యమాలు వచ్చినపుడే ఇలాంటి దారుణమైన పనులు ఆగుతాయి. గదర్ ఉద్యమం తర్వాత వచ్చిన ఆజాద్, భగత్‌సింగ్‌లు అటువంటి దిశగా తొలి అడుగులు వేసిన తర్వాత భారత దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైంది.**

— — — — — * * * — — — —

పరిస్థితులలో జీవిస్తున్నారు. దరిద్రం, ఆకలి, అనారోగ్యం, తాగుడు అన్నీ వారిని చుట్టుముట్టి ఉన్నాయి. వారిలో చైతన్యం కలిగించే సమితిలో సభ్యురాలు భారతి. అపూర్వ బాబుకి ఆంగ్లేయ పాలన మీద ద్వేషం ఉందని తెలిసిన భారతి అతన్ని ఆ సంఘంలోకి తీసుకు వచ్చి సభ్యుడిని చేస్తుంది.

అపూర్వబాబుకి ఆంగ్లేయుల జాత్యహంకారం పట్ల ఆగ్రహం ఉండటం నిజమే గానీ ఆ ఆగ్రహం తనకు సమస్య తలెత్తినపుడు కలిగేదే గాని బ్రిటిష్ వలస పాలన గురించి, దాని ఫలితాల గురించీ అతనెన్నడూ లోతుగా ఆలోచించలేదు. సామాజిక సమస్యల్ని గురించి ఆలోచించినవాడు కాదు. సనాతన సంప్రదాయాలను ఒదిలినవాడు కాదు. అలాంటి వాడిని భారతి ఈ సంఘంలో చేర్చి నాయకులతో పరిచయం చేసింది. ఈ సంఘంలో నాయక స్థానంలో పరిచయమైన సవ్యసాచి, కృష్ణయ్యరు, సుమిత్ర, వ్రజేంద్రుడు వీరంతా టెర్రరిస్టులు. రకరకాల కార్యక్రమాలలో అనేక దేశాలు తిరుగుతుంటారు. సుమిత్ర రంగూన్‌లోని కార్మికులను చైతన్య పరిచే బాధ్యత తీసుకుని ఒక సమితి నేర్పరుస్తుంది. సవ్యసాచి అందరికీ నాయకుడు. చైనాలో చాంగైషేక్‌తో కూడా సంబంధాలున్న వ్యక్తి. అతను ఒక వ్యక్తిగానే పనిచేస్తుంటాడు. భారతితో అతనా విషయం స్పష్టంగా చెప్పాడు. "మొదటినుంచీ కూడా ఒక్కడినే పనిచేశాను భారతి. విదేశాలంటావు నాలుగు దిక్కులా దృష్టి ప్రసారితమవుతున్నంత వరకూ భగవంతుని రాజమార్గం వుండనే వుంది.... ఒక మూల లేచిన నిప్పురవ్వ నాలుగు మూలల వ్యాపించి దహించి వేస్తుంది భారతి. దాన్ని అడ్డగించలేరెవ్వరు. ఈ తాండవానికి దేశ విదేశాలంటూ హద్దులు లేవు" తన ప్రయాణం గురించి సవ్యసాచి భారతితో చెప్పిన వివరాలను బట్టి చూసినా అతను గదర్ ఉద్యమ కాలంలోని వాడని అనుకోవచ్చు.

"కాలి నడకనే దక్షిణ చైనాలోంచి క్యాంటీన్ వెడతాను. అక్కడి నుంచి అమెరికా వెళ్ళడం పడకపోతే మహా సాగర ద్వీపాలు చుట్టి మళ్ళీ ఇక్కడికే వచ్చేస్తాను. అక్కడినుంచి అగ్ని జ్వాలలు రేగనంతవరకూ ఇక్కడే ఉంటాను."

**ఆలోచనా ప్రేరకలు**

ఇంత లోతుగా ఉద్యమంలో పనిచేస్తున్న సవ్యసాచినీ, అతని మిత్రులను భారతి అపూర్వబాబుకి పరిచయం చేస్తుంది. సవ్యసాచి అతనితో చాలా సన్నిహితంగా మెలగుతాడు. వీరితో కలిసి అపూర్వబాబు ఒక బహిరంగ సభలో పాల్గొన్నపుడు అతన్ని పోలీసులు తీసుకుపోయి బెదిరిస్తే మొత్తం సమాచారమంతా చెప్పేస్తాడు. సవ్యసాచి కోసం పోలీసులెంత తీవ్రంగా గాలిస్తున్నారో అతని ప్రాణాలకు వారి నుంచి ఎంత ముప్పు ఉందో అపూర్వబాబుకి తెలుసు. కానీ అతనికి పోలీసులను ఎదుర్కొనే సాహసం గానీ, ఈ సంఘం పట్ల అంకితభావం గానీ లేదు. రావలసినవి రాబట్టుకుని పోలీసులతన్ని వదిలి వేస్తారు. అయితే అతను చేసిన ద్రోహాన్ని టెర్రరిస్టు విప్లవ బృందం ఎలా సహిస్తుంది? అపూర్వబాబుని పిలిపించి విచారణ చేసి మరణశిక్ష వేస్తారు. భారతికి అపూర్వబాబు మీద గల ప్రేమ తెలిసిన సవ్యసాచి ఒక్క మాటతో మిగిలిన వారి నిర్ణయాన్ని కాదని అపూర్వబాబుని శిక్షించకుండా పంపేస్తాడు. సవ్యసాచి మీద వ్రజేంద్రునికి అంతకుముందే ఉన్న వ్యతిరేకత ఈ సంఘటనతో పెరుగుతుంది. బతికి బైటపడ్డ అపూర్వబాబుకి ఎప్పుడు 'ఓడ ఎక్కి స్వదేశం వెళ్దామా అనే ఆలోచనే. రంగూన్ వచ్చినందుకు తనను తాను రకరకాలుగా నిందించుకుంటాడు. తనకు ప్రాణభిక్ష పెట్టిన సవ్యసాచి గురించి గానీ, దానికి కారణమైన భారతి గురించి కానీ, అసలు అన్నిటికంటే ముందు తాను అప్రూవర్‌గా మారటంలోని నీచత్వం, పిరికితనం గురించి కానీ ఆలోచించడు. ఈ విషయాల గురించి ఒక్కమాట మాట్లాడని

అతన్ని భారతి అసహ్యించుకుంటుంది. అతనికంటే అధముడ్నీ, క్షుద్రుడ్నీ తానెక్కడా చూడలేదంటుంది.

ఆ సందర్భంలో సవ్యసాచి భారతితో అన్న మాటలు అప్పుడే కాదు ఇప్పుడు కూడా చాలా ఆలోచించాల్సినవి. ముఖ్యంగా విప్లవోద్యమంలో పనిచేసేవారు ఒకటికి రెండు సార్లు తరచిచూసి ఆలోచించాల్సిన మాటలివి.

"ఒక్క అపూర్వబాబు ప్రవర్తనే సహించలేక విరాగివై పోతున్నావు. ఇక్కడే అనేక అపూర్వబాబులు, వాళ్ళ పెద్దన్నయ్యలూ సంచరిస్తున్నారు సుమీ. పరాధీన దేశానికి అన్నిటినీ మించిన అభిశాపం ఈ కృతఘ్నతే. నువ్వు ఎవరి ప్రాణాన్ని రక్షిస్తావో వాళ్ళే నిన్ను అంగడిలో అమ్మివేస్తారు. మూఢత్వమూ, కృతఘ్నతా నిన్ను అడుగడుగునా సూదుల్లా గుచ్చుకుని బాధిస్తూ ఉంటాయి. ఎక్కడా శ్రద్ధ లేదు. సానుభూతి లేదు. ఎవరూ దగ్గరకు కూడా రానీరు. విషసర్పంలా చూస్తూ దూరంగా నెట్టివేస్తారు. అదే దేశాన్ని ప్రేమించినందుకు మనకు తిరస్కృతి. ఇందుకు పరలోకంలో తప్ప ఎక్కడా ఫిర్యాదు చేసుకోలేవు. ఇటువంటి భయంకర పరీక్షకు నువ్వు ఎలా నిలుస్తావు భారతీ" అంటాడు సవ్యసాచి.

ఇక్కడ సవ్యసాచి కృతఘ్నతను మాత్రమే ప్రస్తావించాడు గానీ, ఉద్యమం పట్ల పూర్తి అంకితభావం లేనివారిని, వారి బలాలేమిటో, బలహీనతలేమిటో తెలుసుకోకుండా లోపలకు తీసుకోవడం తర్వాత వారు ద్రోహం చేశారని చంపివేయటం, వారి ద్రోహం వల్ల అమూల్యమైనవారి ప్రాణాలు పోవటం ఇది యిప్పటికీ జరుగుతూనే ఉంది. జరుగుతుంది కూడా. వ్యక్తిగతహింసా వాద కార్యాచరణలో ఇది తప్పదు. ప్రజా ఉద్యమాల నిర్మాణమే దీనికి పరిష్కారం సవ్యసాచి మీద వ్యక్తిగత కక్ష పెంచుకున్న అతని సహ టెర్రరిస్టు బ్రజేంద్రుడు చాలా ద్రోహం చేశాడు.

"క్యాంటీన్ నుంచి క్రూగర్ టెలిగ్రాం ఇచ్చాడు. షాంగైలోని క్లబ్బును తెల్లవారకముందే ముట్టడించారు పోలీసులు. వినోద్‌ను చంపేశారు. మెహతాబ్‌ను, సూర్యసింగ్‌ను అరెస్టు చేశాడు. అయోధ్య హాంకాంగ్‌లో ఉన్నది. దుర్గా, సురేశ్ ఫేనాంగ్‌లో ఉన్నారు. సింగపూర్ క్లబ్ సభ్యుల కోసం పట్నమంతా పోలీసులు గాలిస్తున్నారు."

— * * * — — — —



**ఆనాడు కాంగ్రెస్ లోని అతివాదులందరికీ టెర్రరిస్టులంటే సానుభూతే. ఈ యువకుల త్యాగాన్నీ, సాహసాన్నీ వారు పొగడకుండా ఉండలేకపోయారు. పొగిడి ఊరుకున్నారు తప్పితే ప్రజా సమూహాల ఆధారంగా జరిగే విప్లవోద్యమాలకూ, వ్యక్తుల సాహసాల ఆధారంగా జరిగే విప్లవ చర్యలకూ మధ్యనున్న తేడాను వివరించి చెప్పలేక పోయారు. ఆ సందిగ్ధత 'భారతి' నవలలోనూ కనిపిస్తుంది.**

— — — — * * * — — — —

ఇదంతా బ్రజేంద్రుడి పనే! ఒక్క వ్యక్తి నిర్మించగల, ఒక్క వ్యక్తి సర్వనాశనం చేయగల సంఘాల, సంస్థల స్థానంలో ప్రజా ఉద్యమాలు వచ్చినపుడే ఇలాంటి దారుణమైన పనులు ఆగుతాయి. గదర్ ఉద్యమం తర్వాత వచ్చిన ఆజాద్, భగత్‌సింగ్‌లు అటువంటి దిశగా తొలి అడుగులు వేసిన తర్వాత భారత దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైంది.

అపూర్వబాబు భారతదేశం వెళ్ళి అక్కడ తల్లి చనిపోవటం సోదరుల అమానవీయ ప్రవర్తనతో తిరిగి రంగూన్ వస్తాడు. భారతికి చేరువవుతాడు. ఇద్దరూ కలిసి భారతదేశం వెళ్ళి కర్షకుల కోసం గ్రామీణ ప్రాంతాలలో పనిచేయాలని నిర్ణయించుకుంటారు. కానీ సవ్యసాచికి కర్షకులు భారతదేశ విముక్తి సాధించగలుగుతారనే నమ్మకం లేదు. రష్యా విప్లవ భావాల ప్రభావం వల్ల కావచ్చు. భారతి సవ్యసాచితో అతనికి గ్రామాల యెడల సానుభూతి లేదనీ కార్ఖానాలనే చూస్తాడనీ, శిక్షితులైన మధ్యతరగతి వారినే తన పనిలో తోడ్పడేందుకు ఎంచుకుంటాడనీ అంటుంది. సవ్యసాచి దానిని అంగీకరిస్తాడు. "కార్మికులు, కర్షకులు ఒకటి కాదు భారతీ! కనుకనే కూలీల కార్ఖానాలలో నువు నన్ను చూడగలుగుతావు. ఎంత వెతికినా రైతుల పూరిపాకలలో కనపడను" అంటాడు. అయితే రైతులు కూడా చైతన్య వంతులయ్యే రోజు ఒకటొస్తుందని కూడా సవ్యసాచి నమ్ముతాడు.

### సందిగ్ధతకు మూలం

భారతికి, సవ్యసాచికీ మధ్య జరిగే చర్చలు మితవాద రాజకీయాలకూ, టెర్రరిస్టు రాజకీయాలకూ మధ్య జరిగే చర్చలే. శరత్ 'భారతి' నవల ద్వారా అక్షరబద్ధం చేయదలిచింది ఈ చర్చలనే. శరత్ వ్యక్తిగతంగా కాంగ్రెస్‌లోని అతివాదుల గ్రూపుకు చెందినవాడు. అందువల్ల టెర్రరిస్టు ధోరణిలోని లోపాలన్నీ చెప్పాడు. కానీ ఆనాడు కాంగ్రెస్‌లోని అతివాదులందరికీ టెర్రరిస్టులంటే సానుభూతే. ఈ యువకుల త్యాగాన్నీ, సాహసాన్నీ వారు పొగడకుండా ఉండలేకపోయారు. పొగిడి ఊరుకున్నారు తప్పితే ప్రజా సమూహాల ఆధారంగా జరిగే విప్లవోద్యమాలకూ, వ్యక్తుల సాహసాల ఆధారంగా జరిగే విప్లవ చర్యలకూ మధ్యనున్న తేడాను వివరించి చెప్పలేక పోయారు. ఆ సందిగ్ధత 'భారతి' నవలలోనూ కనిపిస్తుంది. పోలీసుల చేతిలో చిత్రహింసలు పడుతున్న, మరణిస్తున్న ఈ యువకులను రాజకీయంగానైనా విమర్శించడం సరికాదని కాంగ్రెస్ అతివాదులు భావించారు. అందువల్ల ఈ యువకుల వ్యక్తిగత సాహసాలు ప్రజలలో దేశభక్తినీ, జాతీయతా భావాన్నీ పెంచడానికి తోడ్పడ్డాయి. ఆ క్రమమంతా 'భారతి' నవలలో శరత్ పరోక్షంగా చెప్పారు. సవ్యసాచి వల్ల మరొక సవ్యసాచి ఈ నవలలో తయారు కాలేదు. గ్రామీణ ప్రజలలో పని చేసేందుకు భారతి, అపూర్వబాబు కార్యకర్తలుగా తయారయ్యారు. దేశంలో జరిగింది కూడా అదే.

అయితే సవ్యసాచి పాత్రను పరమోన్నత మానవమూర్తిగా నిలబెట్టడంతో శరత్ చంద్రుడు టెర్రరిస్టుల ప్రాణత్యాగానికి ప్రణమిల్లినట్లయింది. భారతి హింసామార్గం వల్ల మంచి జరగదని చేసిన వాదనల వల్ల యువకులను ఆలోచింపచేసే నవల అయింది.

### శరత్ అవగాహన

ఆనాటి భారతదేశ పరిస్థితి గురించి సవ్యసాచి చెప్పిన మాటలు వింటే శరత్‌కు సామాజిక రాజకీయ విషయాల మీద వున్న లోతైన అవగాహన మనకు తెలుస్తుంది. శరత్ మధ్యతరగతి యువకుల నిష్క్రియాపరత్వాన్నీ, స్త్రీల మానవత్వాన్నీ, సామర్థ్యాన్నీ తెలియచెప్పే కన్నీటి కథలు మాత్రమే రాశాడనుకునేవారు 'భారతి' చదివినపుడు. రచయితకు దేశ ప్రజల పట్ల ఎంత ప్రేమ, అంకితభావం ఉందో అర్థం చేసుకుంటారు. వలసదేశంగా భారతదేశ దరిద్రాన్నీ, గ్రామాలలోని దుర్భర పరిస్థితులనూ ఏదో ఒక సందర్భంలో శరత్ ప్రతి నవలలోనూ వర్ణిస్తాడు. కానీ 'భారతి' నవలలో ఆ వర్ణన

రాజకీయంగా పరిణతి చెందిన వర్ణన. భారతి క్రిస్టియను. ఆంగ్లో ఇండియన్. ఆంగ్లేయులందరినీ ఒకే గాటన కట్టి సవ్యసాచి విమర్శిస్తుంటే ఆమె సహించలేకపోతుంది. ఆంగ్లేయుల సద్గుణాలను అనేకం కళ్ళారా చూశానంటుంది. సవ్యసాచి దానికి చెప్పిన సమాధానం "వారి సద్గుణాలెన్నో కళ్ళారా చూశావు. అయితే విశ్వాన్ని యావత్తూ హరించుకోవాలని చూచేవాళ్ళ "ఎక్కడలేని ఆకలి"ని కూడా ఎరిగి ఉన్నావా? ఈ దేశపు యజమానులు వాళ్ళు. ఎప్పుడు యజమానులైనారో తారీఖు జ్ఞాపకం ఉంది కదూ. నేడు బ్రిటిష్‌వారు సంపద నిరుపమానంగా ఉంది. ఎన్ని ఓడలు, ఎన్ని కార్ఖానాలు, ఎన్ని వేల లక్షల భవనాలు. ఇంకా మనుష్యులను చంపే మారణ యంత్రాలు అసంఖ్యాకం... ఈ మహా ఐశ్వర్యం ఎలా వచ్చిందో తెలుసునా?... ఈ భారతదేశంలో సాలుకు లక్షలాది ప్రజలు మలేరియాతో చచ్చిపోతున్నారు. ఒక్కొక్క యుద్ధ నావకు అయ్యే ఖర్చును వెచ్చిస్తే లక్షలాది భారతీయ మాతృదేవతల కన్నీళ్ళు తుడవచ్చు..... శిల్పం పోయింది. వాణిజ్యం పోయింది. ధర్మం పోయింది. జ్ఞానం పోయింది. నదులు ఎండిపోయి మరుభూమి తయారు అవుతున్నది. రైతులకు కడుపునిండా కూడులేదు. శిల్పకారులు విదేశీయుల పంచలో కూలి చేసుకుంటున్నారు. దేశంలో నీళ్ళు లేవు. అన్నం లేదు... పాలు దొరక్క పసిపిల్లలు ఎండి చచ్చిపోతూ ఉండటం చూశావా భారతి."

"సిగ్గుమాలిన నగ్న స్వార్థము, పశు శక్తి వాళ్ళ మూల మంత్రాలు. సభ్యత అనే ముసుగులో నించి పిరికివారినీ, అసమర్థులనూ పీడించేందుకు ఒక మహా ముసలాన్ని ఆవిష్కరించారు.... ఐరోపీయుల ఈ బ్రహ్మాండమైన ఆకలి నుంచి ఏ చిన్న దేశమూ తన్ను తాను రక్షించుకోలేకపోయింది. స్వదేశ సంపద నుంచి ఎంతమంది దేశీయులు వంచితులు కాబడినారో తెలుసా? వాళ్ళ అపరాధం ఏమిటి? శక్తిహీనత. అంతే. ఓడిపోయిన జాతుల కల్యాణం కోసమే దాస్య శృంఖలాలు తగిలించి వారి సమస్త బాధ్యతలు తమపై వేసుకోవడమే తమ సభ్యతకు చరమ కర్తవ్యమట" ఇంకా సవ్యసాచి బ్రిటిష్‌వారు భారతదేశ చరిత్ర రచన పేరుతో ముస్లింల మీద ఎంత విష ప్రచారం చేశాడో చెప్తాడు.

ఇది చదువుతుంటే గతంలో బ్రిటిష్ వారి క్రూరత్వం, స్వార్థంతో పాటు ఇప్పటి అమెరికా విధానాల్లోని క్రూరత్వమూ, స్వార్థమూ కూడా మనకు కళ్ళకు కట్టినట్లు కనపడతాయి.

ప్రపంచీకరణ నేపథ్యంలో అమెరికాకు వ్యతిరేకంగా అనేక టెర్రరిస్టు గ్రూపులు తయారవుతున్న నేపథ్యంలో 'భారతి' నవల తప్పక చదవాలి. టెర్రరిస్టులను తయారుచేస్తున్న అగ్ర రాజ్య, సామ్రాజ్యవాద దౌష్ట్యమూ, వ్యక్తిగత సాహసాలతో, గమ్యం తెలియని మార్గంలో ప్రజా పునాది గురించి పట్టించుకోకుండా తాము బలవుతూ, అనేక మంది అమాయకులను బలి చేస్తున్న టెర్రరిస్టుల నిస్సహాయతా, అవివేకం మనకు అర్థమవుతాయి. టెర్రరిస్టుల శక్తి సామర్థ్యాలను ప్రజా ఉద్యమాల దిశగా మళ్ళించగలిగే సరికొత్త సాహిత్యాన్ని సృష్టించుకోమనే ప్రేరణను 'భారతి' నవల ఇస్తుంది.

"పాలకుల, పాలితుల నైతికబుద్ధి ఒకటే అయితే అంతకన్న దేశ దౌర్భాగ్యం మరొకటి ఉండదు."

ఇది కేవలం పరిపాలించేవారికీ, ప్రజలకే అన్వయించ నవసరం లేదు. అణచివేసే వర్గాలు, అణచివేయబడుతున్న వర్గాలు వారు ఎవరైనా సరే - పురుషులు - స్త్రీలు, అగ్రవర్ణాలు - దళితులు, ప్రభుత్వాలు, విప్లవోద్యమాలు ఈ అధికార సంబంధాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలలో శరత్ చెప్పిన వాక్యం అన్వయించు కోకపోతే ప్రజలకు చాలా నష్టం జరుగుతుంది. "యజమాని ఆయుధాలతో యజమాని సౌధాన్ని బద్దలు కొట్టలేమని" నల్లజాతి రచయిత్రి చెప్పిన మాటల అర్థం కూడా అదే. ప్రజా ఉద్యమాల సంస్కృతి కచ్చితంగా వేరుగా ఉండాలనే విషయం మళ్ళీ మళ్ళీ గుర్తుంచుకోవలసిన విషయం. శరత్ ఎంతో ముందుగానే ఈ విషయాన్ని గుర్తించి చెప్పాడు.

*

---

# వేట



**- ఎ. సత్యభాస్కర్**

ఈ దేశంలో...
వేట నిషిద్ధం!
('మృగాలను' మాత్రమే)!
జంతువులను మనుషుల్లాగా
వేటాడటం... తప్పు, తప్పు!
మనుషులను వేటాడినట్టు
జంతువులను వేటాడటం నిషిద్ధం!
మనుషులను కాల్చి చంపినట్లు
పిట్టలను కాల్చి చంపడం నిషిద్ధం!
కృష్ణ జింక పాటి విలువ
నెమలి మాంసం ఖరీదు
చేయదు మనిషి ప్రాణం!
గోవధ నిషిద్ధం!
చేసిన వాళ్ళను సజీవ దహనం చేయాల్సిందే!
మతం పేరిట, కులం పేరిట
నెత్తురు ఏరులయి పారాల్సిందే!
దళిత వాడలు దగ్ధం కావాల్సిందే!
కుక్కలు, పాములు, చీమలు
వాటికి నేస్తాలెందరో
వాటి కోసం తపించే
మానవతా దీపాలెందరో!
ఆకలితో అలమటిస్తూ
పసిబిడ్డలను మోస్తున్న కన్నతల్లులు
కనబడరు వీళ్ళకు
అదంతా వాళ్ళ పాపం అంటూ
అటు చూడను కూడా చూడరు వీళ్ళు!
దృష్టంతా
నోరులేని మూగజీవాల మీదే
నోరెత్తి అడిగే వాళ్ళను
వేటాడి వధించాల్సిందే

# సాహిత్య శిల్పం లోతు చూపిన నవీన్

**ఆధునిక నవలను పరిశీలిస్తూ నవీన్ అన్న మాటలు – "పాత విలువల్ని నేటి మానవుడు పరిత్యజించాడు. వాటి స్థానంలో యింకా కొత్త విలువలూ, కొత్త విశ్వాసాలు ఆవిష్కరింపబడలేదు. ఒక విధంగా విజ్ఞానవంతుడైన నేటి మానవుడిలో ఒక "శూన్యత్వం" ఏర్పడింది. ఒక రకంగా ఆధునిక సాహిత్యం నేటి మానవునిలో ఏర్పడిన శూన్యత్వాన్ని చిత్రిస్తుందనవచ్చు. ఆధునికత లక్ష్యాన్ని వివరిస్తూ – కేవలం బాహ్య పరిస్థితుల వల్ల ఒక పాత్రను అర్థం చేసుకోలేం. ఒక పాత్ర అంతరాంతర జ్యోతిస్సీమల్లోకి రచయిత చొచ్చుకుని పోవాలి. తన పాత్ర చైతన్యాన్నే కాదు, సుప్త చైతన్యాన్ని కూడా చూపించాలి.**

## ఇంద్రగంటి సుబ్బరాయ శాస్త్రి

ఆధునిక చైతన్యంతో నవ నవలాడే తెలుగు నవలల్ని సృష్టించిన రచయిత, 'కాల రేఖలు' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత నవీన్. ఆధునికతత్వాన్ని ఊపిరిగా గ్రహించిన వ్యక్తి. ఈ ఆధునిక తత్వం కొత్త కోణంలోంచి వ్యక్తినీ, కుటుంబాన్నీ, సమాజాన్నీ, దాని పరిణామ క్రమాన్నీ, సంఘర్షణనీ విశ్లేషించడంలోనూ, అవగాహన చేసుకోవడం లోనూ, మానవ వికాసానికి దోహదం చేసే ఆధునిక విజ్ఞానాన్ని, సంస్కారాన్ని, హృదయపూర్వకంగా ఆహ్వానించడం లోనూ బుద్ధిని పువ్వులా వికసించడంలోనూ ఉందనుకుంటాను.

ఈ దృక్పథానికి చెందిన కొందరు రచయితల నవలలు, కథలు, కవితలు విశ్లేషిస్తూ వివిధ పత్రికలలో తను రాసిన సాహిత్య వ్యాసాలను ఇంటర్వ్యూలలోనూ 7 భాగాలుగా విభజించి పుస్తకంగా నవీన్ ప్రచురించారు.

అందులో కొన్ని వ్యాసాలు ఆధారంగా నవీన్ విమర్శలోని పటిమని ఈ వ్యాసంలో వివరిస్తాను.

నవలా శిల్పం అనే విభాగంలో –

ఆధునిక నవలను పరిశీలిస్తూ నవీన్ అన్న మాటలు – "పాత విలువల్ని నేటి మానవుడు పరిత్యజించాడు. వాటి స్థానంలో యింకా కొత్త విలువలూ, కొత్త విశ్వాసాలు ఆవిష్కరింపబడలేదు. ఒక విధంగా విజ్ఞానవంతుడైన నేటి మానవుడిలో ఒక "శూన్యత్వం" ఏర్పడింది. ఒక రకంగా ఆధునిక సాహిత్యం నేటి మానవునిలో ఏర్పడిన శూన్యత్వాన్ని చిత్రిస్తుందనవచ్చు.

ఆధునికత లక్ష్యాన్ని వివరిస్తూ – కేవలం బాహ్య పరిస్థితుల వల్ల ఒక పాత్రను అర్థం చేసుకోలేం. ఒక పాత్ర అంతరాంతర జ్యోతిస్సీమల్లోకి రచయిత చొచ్చుకుని పోవాలి. తన పాత్ర చైతన్యాన్నే కాదు, సుప్త చైతన్యాన్ని కూడా చూపించాలి. ఇలా ఫ్రాయిడ్ అభిప్రాయాలు రచయిత దృష్టిని అంతర్ దృష్టిగా మార్చివేశాయి.

ఈ ఆధునికతలో అంతర్ దృష్టి ప్రధాన లక్ష్యం. నేడు ప్రతి మానవుడు ఏకాంతజీవి. అతని అంతర్గత చైతన్యంతో ఏకాంతంగా జీవిస్తాడు. మానవుని ఈ ఏకాంతాన్ని చూపించడం, ఆధునికత మరొక ముఖ్యమైన లక్షణం, లక్ష్యం కూడా.




ఆధునికత మరొక లక్షణం సింబాలిజం.

"ఒక వస్తువు ఒక వ్యక్తిలో ఏదో ఒక భావాన్ని ప్రేరేపించటం, ఆ ప్రేరణ వెనుక అతనిలో దాగి వున్న ప్రవృత్తులు బయల్పడటం – వాటి ద్వారా ఆ వ్యక్తిలో దాగి వున్న ఒక నిజం బయటపడటం జరుగుతుంది. సరిగ్గా దీన్నే కళాత్మకంగా చూపిస్తే సింబాలిజం అవుతుంది.

చివరకు మిగిలేది, అల్పజీవి, నిజమైన ఆధునిక నవలలు.

ఈ అభిప్రాయాలు ఆధునిక వచన సాహిత్య స్వభావాన్ని, స్వరూపాన్ని తెలియ జేస్తాయి. ఈ దృష్టి అభిరుచి గల పాఠకుని బుద్ధికి పదును పెడుతుంది. అవగాహన శక్తిని పెంచుతుంది.

**చివరకు మిగిలేది**

చివరకు మిగిలేది నవలను ఈ విధంగా విశ్లేషిస్తారు :

కాల్పనికోద్యమ ప్రభావం నుంచి విడివడి, జీవితాన్ని జీవిత సత్యాన్ని చివరకు మిగిలేదిలో ఒక కళా ప్రక్రియగా బుచ్చిబాబు తీర్చిదిద్దారు. అంతర్ దృష్టితో, పాత్రల బాహ్య జీవితానికి అంతర్జగత్తుకు ఉండే సంబంధాన్ని, ఘర్షణలను, ఆధునిక విజ్ఞానం అందించిన అనేక దృక్కోణాలతో చిత్రించి గొప్ప రసానుభూతిని కల్గించడం, జీవితంపై ఒక జిజ్ఞాసను, దృక్పథాన్ని వ్యక్తిలో కల్గించడం నవలా రచనలో ఆధునికతగా నవీన్ గుర్తించారు.

ఇందులోని నాయకుడు 'దయానిధి' ఆధునిక మానవునికి ప్రతినిధి. మానవుడి సమస్యలనీ, విషాదాన్ని దయానిధిలో చూడవచ్చు. ప్రతీ విషయాన్ని, ప్రతి భావాన్ని, నిశితంగా, మానవుడు వివిధ రంగాలలో సాధించిన విజ్ఞాన జ్యోతితో పరిశీలించి, వివిధ దృక్కోణాల నుండి తర్కించి, యేదీ తేల్చుకోలేక సందిగ్ధంలో పడే తత్వం. సంప్రదాయం, స్థిరమైన విలువల పట్ల విశ్వాసరాహిత్యం ఇలాంటి మనస్తత్వం గలవాడు నేటి మానవుడు. దయానిధి ఈ తత్వాన్ని బాగా జీర్ణించుకున్న వ్యక్తి. మనిషికీ మనిషికీ మధ్య, సమాజం, చరిత్ర, సంప్రదాయం, ఆర్థిక అసమానత్వం, మతం మొదలైనవి కట్టిన తెరల్ని ఛేదించి, మనిషిని మనిషిని స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూడాలనుకుంటాడు.

ఈ నవల యేదో ఒక భావాన్ని పాఠకుడి మీద రుద్దకుండా, జీవితాన్ని వివిధ కోణాల నుండి చూపెడుతుంది. మానవుడు తన అంతర్ బహిర్లోకాలలో – తనతో తను, బాహ్య ప్రపంచంతోను ఘర్షణ పడి, ఆ

రెండింటికీ సమన్వయం సాధించడాన్ని కళాత్మకంగా చిత్రించిన కళాఖండం.

చివరకు మిగిలేది సులభంగా అర్థమయ్యే నవల కాదు. మామూలు నవలలో మాదిరిగా కథ కోసం, సంఘటనల కోసం చదివితే ప్రయోజనం లేదు. చాలా లోతుగా అంతర్ దృష్టితో చదివితేనే నవలలోని సొగసు అర్థం అవుతుంది. ప్రతీ వర్ణన వెనుక, ప్రతీ వ్యాఖ్యానం వెనుక దయానిధి పాత్ర పోషణ యిమిడి ఉంది. వాటి లోతుల్ని అవగాహన చేసుకోవాల్సిన అవసరం పాఠకుడికీ, విమర్శకుడికీ ఉంది.

**సమత, మట్టి మనిషి**

వాసిరెడ్డి సీతాదేవి రెండు ప్రసిద్ధ నవలలు – 'సమత', 'మట్టి మనిషి' – నిశితంగా విశ్లేషించి నవలల్లోని నాణ్యతని ఈ విధంగా వివరించారు.

"సమత"లో అరుంధతీ – సీతాపతుల మధ్య అరుంధతి, రాజారావు సన్మాన సభకు వెళ్తాననడం ఎంత తీవ్ర సంఘర్షణకు దారితీసిందో ఆ సన్నివేశంలోని సంభాషణల ద్వారా తెలుస్తుంది. ఇక్కడ దంపతులుగా, ఆ పాత్రల అంతరంగపు లోతుల్ని కూడా వాస్తవంగా చూపించడం జరిగింది.

ఈమె నవలలో కనిపించే వాస్తవికత "సవిమర్శక వాస్తవికత" అన్నారు. అంటే యదార్థ పరిస్థితుల్ని చిత్రించడమే కాకుండా ఆ పరిస్థితులు అలా ఎందుకున్నాయో విశ్లేషించడం ద్వారా పాఠకుల్ని ఆలోచింపచేయడమే యిందులోని ప్రత్యేకత.

మట్టి మనిషి నవల "మాగ్నమ్ ఓపస్" కావడానికి దోహదం చేసిన అంశాలు – ఎప్పటికీ సజీవంగా నిలిచే ఊరబోయిన సాంబయ్య వరూధిని వంటి పాత్రలూ, పురాతన వ్యవస్థల స్థానంలో పెట్టుబడిదారీ వ్యవస్థ, మధ్య దళారీల ప్రాబల్యం, వ్యష్టి కుటుంబాలు, స్త్రీ స్వేచ్ఛ మొదలైన ఆధునిక ప్రభావాలు ప్రవేశిస్తున్న సంధికాలంలో, మారిపోతున్న సామాజిక సంబంధాలు, ఉత్పత్తి సంబంధాలు, జీవితపు విలువలు, దృక్పథాలు నవలలో శక్తివంతంగా చిత్రించబడటం అన్నారు.

సరళంగా, సూటిగా సాగే రచనా సంవిధానం, నాటకీయమైన శైలి, నిండుదనాన్ని ఇతివృత్తంగా ఎంచుకున్న విషయం మీద సంపూర్ణమైన, సాధికారికమైన అవగాహన, ఈమె నవలలకి ప్రసిద్ధిని తీసుకువచ్చాయన్నారు.

ఈ నవలలో చివరలో అరుంధతి రామనాథబాబు కనకయ్యలు, భూములన్నిటిని

— — — — — * * * — — — — —

**మట్టి మనిషి నవల "మాగ్నమ్ ఓపస్" కావడానికి దోహదం చేసిన అంశాలు – ఎప్పటికీ సజీవంగా నిలిచే ఊరబోయిన సాంబయ్య వరూధిని వంటి పాత్రలూ, పురాతన వ్యవస్థల స్థానంలో పెట్టుబడిదారీ వ్యవస్థ, మధ్య దళారీల ప్రాబల్యం, వ్యష్టి కుటుంబాలు, స్త్రీ స్వేచ్ఛ మొదలైన ఆధునిక ప్రభావాలు ప్రవేశిస్తున్న సంధికాలంలో, మారిపోతున్న సామాజిక సంబంధాలు, ఉత్పత్తి సంబంధాలు, జీవితపు విలువలు, దృక్పథాలు నవలలో శక్తివంతంగా చిత్రించబడటం అన్నారు.**

— — — — — * * * — — — — —

వేరొకరికి రిజిష్టరు చేస్తున్నట్లు సాంబయ్య చేత బలవంతంగా సంతకాలు పెట్టించుకున్న సన్నివేశం, నగరంలో సర్వ సౌకర్యాలతో హాస్టల్లో చదువుకుంటున్నదని, విలాసంగా




కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న సాంబయ్యతో కలిసి జీవించడానికి ఎంతో ఉత్సాహంగా అంగీకరించడం నమ్మశక్యంగా లేదని సహృదయంతో సూచించారు. వాస్తవికతకు దూరమైన దానిని సూటిగా, మృదువుగా చూపించడం ఈయన పరిశీలనకు నిదర్శనం.

**కథానికా శిల్పం**

'కథలు రాయడం ఎలా' అనే వ్యాసంలో స్వానుభవాన్ని చెబుతూ మంచి కథ రూపుదిద్దుకోవడానికి ఎంత తపన, పరిశ్రమ, పరిజ్ఞానం, పరిశీలన, శిల్పం అవసరమో తన కథల ద్వారా వివరించి చూపించారు.

కథా రచయితగా నవీన్ అందించిన అనుభవ సత్యాలు –

(1) కలం పట్టి రాయడానికి ప్రతిభా, వ్యుత్పత్తులు మాత్రమే సరిపోవు.

(2) కఠోరమైన భౌతిక పరిశ్రమ చేయగలిగినవాడే కథలు రాయగలడు.

(3) మనం ఎన్నుకున్న వస్తువును బట్టే శిల్పం కూడా నిర్ణయమవుతుంది.

(4) రాస్తున్న కథను ఎందుకు రాస్తున్నాడో, ఆ కథ ద్వారా తాను చెప్పదలచుకున్న జీవిత సత్యం ఏమిటో కథకుడు నిర్దేశించుకోవాలి. దీన్నే కథలో పాయింట్ అంటారు.

(5) బుచ్చిబాబు అన్నట్లు బాహ్య జగత్తులో సంఘటనలే కాక కొందరు వ్యక్తులు కూడా కథల్ని ప్రేరేపిస్తారు. ఒక్క చూపు, ఒక్క మాట, కంఠధ్వని, నడచిన విధం, ఏదన్నా ఆకర్షించి, కుతూహలాన్ని రేకెత్తించి కథకు పురికొల్పటం నాకు అనుభవమే.

(6) రచించిన కథలన్నీ తిరిగొస్తుంటే ఏ కథకుడూ తనలోని కథకుడిని సజీవంగా కాపాడుకోలేడు.

(7) నిజమైన ప్రతిభ ఏనాటికైనా గుర్తింపబడుతుందన్న వాదనపై నాకు నమ్మకం లేదు. సకాలంలో గుర్తింపు పొందని ప్రతిభ అణగారిపోతుంది.

(8) తన రచనను పది మంది చదివి బాగుందనో, బాగాలేదనో అనుకోవడమే రచయిత ఆశించే పారితోషికం.

బుచ్చిబాబు రాసిన "కలలో జారిన కన్నీరు'' కథలోని ముఖ్య పాత్రలు – అనసూయ, ఆనందం, కోదండ రామయ్యల అంతరంగ చిత్రణను నిశితంగా పరిశీలించారు. సంభాషణలను, పాత్రల మనోవైఖరిని, నిజమైన కళాకారుడి సంయమనంతో, తనదైన ప్రత్యేక శిల్పంతో, బుచ్చిబాబు హృదయం ద్రవించేలా ఎలా చిత్రించాడో సోదాహరణంగా నిరూపించారు. భార్యాభర్తలుగా జీవిస్తున్నా అంతరంగాల మధ్య దూరం తరగిపోకపోవడం వల్ల ఉత్పన్నమయ్యే విషాదం, స్త్రీకి ఏ ఆస్తి, అంతస్తులూ, ఏ నగలూ, చీరలూ యివ్వలేని హాయిని తన అంతరంగాన్ని అర్థం చేసుకొనే భర్త యివ్వగలుగుతాడు అనే రెండు జీవిత సత్యాలని తన విశ్లేషణలో ఆవిష్కరించారు.

**తిలక్ కథన కౌశలం**

"మరచిపోతున్న మంచి కథకుడు – తిలక్" అన్న వ్యాసంలో ఆయన కథల ప్రత్యేకతని ఈ విధంగా ప్రశంసించారు. "తిలక్ కథలకు ప్రాణం కవితాడంబరం లేకుండా సూటిగా, స్పష్టంగా సాగే వచన శైలి, కథకు అవసరమైన నాటకీయతను తగిన రీతిలో పోషించడం.

కొన్ని సమయాలలో మానవుని భయంకరమైన నిస్సహాయతనూ, వంచననూ, దోపిడీని, తిలక్ తన కథల్లో అద్భుతంగా చిత్రించాడు. ఆ చిత్రణలో పాఠకునికీ కన్నీళ్ళు

తెప్పిస్తాడు. కలవరపెడతాడు. పాఠకుడి హృదయాన్ని సంస్కరించి అతణ్ణి ఉదాత్తుడిని చేస్తాడు. తిలక్ కవిత్వం ఎంత బాగా హృదయానికి హత్తుకుంటుందో, ఆయన కథలు అంత ప్రభావితుల్ని చేస్తాయంటారు.

మధ్యతరగతి జీవితానికి చెందిన 'ఆశాకిరణం'లోని భయంకరమైన పేదరికం కారణంగా ఆత్మహత్య ఒకటే శరణ్యంగా భావించిన వెంకటేశ్వర్లు రైలు కింద పడి చనిపోవాలని నిర్ణయించుకుని, రైలు పట్టాల వైపు వెళుతూ ఉంటాడు. అతని మిత్రుడు సూర్యనారాయణ కనిపించి, అతని కూతురు వ్యభిచారం చేసి డబ్బు సంపాదిస్తోందని చెబుతాడు. వెంకటేశ్వర్లు అది విని అసహ్యించుకోడు. తన ఆకలిని తీర్చిన పెద్ద కూతురి దగ్గరకు వెళ్ళి కృతజ్ఞతలు చెప్పాలనుకుంటాడు. అవసరం అనేది మనిషిని ఎంతగా పతనం చేస్తుందో చిత్రించే ఈ కథను చదవగానే ఒళ్ళు జలదరిస్తుంది. మధ్యతరగతి జీవితంలోని నిజ స్వరూపాన్ని చిత్రించిన తిలక్ అంతరంగ శోధనని నవీన్ ఎంతో ఆవేదనతో గుర్తిస్తారు.

'పరివర్తన' అనే కథ ఎదుటి వ్యక్తిలోని ఉదాత్తత కారణంగా ఒక వ్యక్తి తనను తాను ఎలా ఉదాత్తంగా మార్చుకుంటాడో చూపిస్తుందన్నారు.

'సముద్రపు అంచులు' అనే కథలో సముద్రం పక్కనే చేపలు పట్టుకుని జీవించే బెస్తవాళ్ళ శ్రమను, మధ్య దళారులు ఎలా దోచుకుంటారో చిత్రించారు. ఏ తప్పూ చేయని వీరయ్య, చంద్ర చాలా దారుణమైన శిక్షలకు గురవుతారు. పేదవాళ్ళుగా పుట్టడమే వాళ్ళు చేసిన తప్పు.

మధ్యతరగతి జీవితాలనూ, అట్టడుగు జీవితాలనూ, లోతైన అవగాహనతో చూపించడం తిలక్‌లోని ప్రతిభగా నిరూపించారు. విమర్శకుల విభజన ప్రకారం – 'ఫ్లేట్ క్యారక్టర్స్', 'రౌండ్ క్యారక్టర్స్' అని రెండు రకాల పాత్రల్ని గురించి చెప్పి – కొన్ని పాత్రలు కథా ప్రారంభంలో ఒకలా ఉన్నప్పటికీ, కొన్ని సంఘటనల కారణంగా ఎంతో మార్పుకు లోనవుతాయి. ఇలాంటి పాత్రలు 'రౌండ్ క్యారక్టర్స్'. ఇవి పాఠకుల్లో మార్పు రావడానికి తోడ్పడతాయి. 'పరివర్తన' కథలో శంకరం, 'దొంగ' కథలో గవరయ్య, సీతాపతి కథలో సీతాపతి మొదలైన వాళ్ళు 'రౌండ్ క్యారక్టర్స్' ఈ విమర్శనాంతం తిలక్ పాత్రల్ని బాగా అర్థం చేసుకోవడానికి సహాయపడుతుంది.

తిలక్ రాసిన 21 కథల్లో "దేవుణ్ణి చూసినవాడు", "ఆశాకిరణం", "నల్లజెర్ల రోడ్డు", "ఊరి చివరి యిల్లు", "సముద్రపు


— — — — — * * * — — — — —



ఈ సారా కథల్లో అంత చేవను, శక్తినీ రావిశాస్త్రి నిక్షిప్తం చేశాడన్నారు. ఈ శ్రామిక జనులు వాడే భాష లోని యాసను, నుడికారాన్ని ఆయన ఎంతగా వశం చేసుకున్నదీ హృదయానికి హత్తుకునేలా విశ్లేషించారు. ఉపన్యాస ధోరణిలో నాటకీయతనూ, పాత్ర చిత్రణనూ మేళవించడం, చైతన్య స్రవంతి లోని ఇంటీరియర్ మోనోలాగ్ ద్వారా పాఠకునికి, పాత్రకి మధ్య రచయిత సాధ్యమైనంత తప్పుకుని, ఒక ప్రత్యక్ష సంబంధం కల్పించడం, రావిశాస్త్రి రచనలోని ప్రతిభకు గీటురాయి.

— — — — — * * * — — — — —


అంచులు'' సాహిత్యంలో శాశ్వతంగా నిల్చిపోయే గొప్ప కథలుగా గుర్తించారు.

**మధురాంతకం రాజారాం కథన శైలి**

మధురమైన కథకు వరవడి దిద్దిన రాజారాంగారిలో నవీన్ గమనించిన ప్రత్యేకతలు : ఏ యిజాలతోనూ నిమిత్తంలేని మానవతా వాదం, ఈ నేల తాత్విక ఛాయలు, సాంస్కృతిక వైభవ స్పర్శ.

"హింస, ద్వేషాలతో మన సమస్యలేవీ పరిష్కారం కావు. కరుణ, ఉత్తమ సంస్కారం మాత్రమే నిష్కృతులు" అని నాటి సాంఘిక వాతావరణంలో ధైర్యంగా ప్రతిపాదించడం. ఈయన పరిపూర్ణంగా మధ్య తరగతిలో ఒక భాగమై ఉంటూనే, తాను తటస్థంగా నిలిచి సామాన్య సంఘటనలోని నాటకీయతనూ, వైచిత్రిని ఎత్తి చూపుతాడు. కథ పాఠకులతో కాలక్షేపంగా మొదలై, మధ్యలో వేగం పుంజుకుని, ఒక కొసమెరుపు ద్వారా చెప్పదలచుకున్న విషయాన్ని పాఠకుడిలో ఆవిష్కరించడం. ఈయన కథలు చదివి మనల్ని మనం బాగా అర్థం చేసుకుంటాం.




మన అవివేకాన్ని చూసి జాలిపడగల్గుతాం.

ఈ వ్యాసంలో 'సన్మానం', 'కన్నెచెర' వంటి కథలలోని కథా వస్తువు వివరించి చూపించారు. రాజారాం నవలలు రాసినా కథల మీదనే ఎక్కువ పట్టుందని స్పష్టం చేశారు.

కథకుడిగా ఆర్.ఎస్. సుదర్శనం "తాత్వికతనీ" ఆయన కథల్లో అస్తిత్వ వాదాన్ని ఆవిష్కరించిన తీరుని, "మీనాక్షి", "ఎరువు" కథల ద్వారా విశ్లేషించారు. కుక్కపిల్ల జీవితంతో ప్రతీకాత్మకంగా చిత్రించిన "పంకజం", తాత – మనుమరాళ్ళ అనుబంధాన్ని చిత్రించే "రేగుపండు" కథలు ఆర్.ఎస్. సుదర్శనం సమగ్ర జీవిత దర్శనాన్ని కళ్ళకు కట్టినట్లుగా చూపిస్తాయన్నారు.

'ఏకాంతం' కథలోని ముగింపు ఆర్.ఎస్. సుదర్శనం నిశితమైన పరిశీలనకు, అవగాహనకు తార్కాణంగా ఉందన్నారు.

**రావిశాస్త్రి**

రావిశాస్త్రి 'ఆరు సారా కథలు' అన్న ప్రశంసా వ్యాసంలో – రావిశాస్త్రి దర్శించిన శ్రామిక జీవనుల జీవితాల్లోని కఠోర వాస్తవికతకు కళాత్మక రూపం 'ముత్యాలమ్మ' అనే ఈ కన్నీటి కణం అన్న నవీన్ వాక్యం ముత్యాలమ్మ సొదలోని హృదయ వేదనను విన్పించి కంట తడి పెట్టిస్తుంది. ఆరు సారా కథల్ని సాలిటరీ కన్‌ఫైన్‌మెంట్‌లోని అమానుషత్వాన్ని చిత్రిస్తూ గాల్సు వర్దీ రాసిన జస్టిస్ నాటకంతో పోల్చారు. ఆ ప్రదర్శన చూసిన చర్చిల్‌కి ఆ శిక్ష రద్దు చెయ్యాలి అన్న నిర్ణయం తీసుకోవడానికి దోహదం చేసిందన్నారు. యేడేళ్ళలో దేశమంతా మద్య నిషేధం పెట్టాలని కలలుగన్న అప్పటి ప్రధానమంత్రి మొరార్జీ దేశాయ్ ఈ కథలు చదివితే, కళ్ళు కొంచెమైనా తెరచుకుని ప్రపంచాన్ని ఉన్నది ఉన్నట్లుగా చూడగలుగుతాడన్నారు. ఈ సారా కథల్లో అంత చేవను, శక్తినీ రావిశాస్త్రి నిక్షిప్తం చేశాడన్నారు. ఈ శ్రామిక జనులు వాడే భాషలోని యాసను, నుడికారాన్ని ఆయన ఎంతగా వశం చేసుకున్నదీ హృదయానికి హత్తుకునేలా విశ్లేషించారు. ఉపన్యాస ధోరణిలో నాటకీయతనూ, పాత్ర చిత్రణనూ మేళవించడం, చైతన్య స్రవంతిలోని ఇంటీరియర్ మోనోలాగ్ ద్వారా పాఠకునికి, పాత్రకి మధ్య రచయిత సాధ్యమైనంత తప్పుకుని, ఒక ప్రత్యక్ష సంబంధం కల్పించడం, రావిశాస్త్రి రచనలోని ప్రతిభకు గీటురాయి. అందువల్ల పాఠకుడికీ, పాత్రకీ మధ్య తాదాత్మ్యం సులభంగా సాధ్యపడుతుంది, తద్వారా గొప్ప సానుభూతి కల్గుతుంది అన్నారు. నవీన్ విమర్శలో అంతర్

దృష్టి, లోతైన అధ్యయనం కన్పిస్తాయి. ప్రశంస ఏకపక్షంగా గాకుండా, రా.వి. శాస్త్రి ఆరు సారా కథల్లో, 'మోసం', 'పుణ్యం' అనే రెండు కథలు మిగతా కథల్తో పోలిస్తే అసంతృప్తికరంగా ఉన్నాయని ఖండితంగా చెప్పగలరు.

**పెద్దిబొట్ల**

పెద్దిబొట్ల సుబ్బరామయ్య కథలు – నీళ్ళు ముసురు, మిస్ భారతి బి.ఎ. మొదలైనవి – కలుషితమైపోతున్న నాటి వాతావరణంలో స్వచ్ఛమైన ప్రాణవాయువును పీల్చుకుంటున్న అనుభూతి కలిగించాయని అభినందించినా ఆయన కథల్లో నింపే కరుణ రసం పాఠకుల సానుభూతిని అయస్కాంతంలా ఆకర్షించడానికి వాడే ఫార్ములాలాగానే కన్పించి విసుగును కల్గిస్తుంది. ఇందుకు ప్రబలమైన కారణం ఆయన సృష్టించే పాత్రలు పరిస్థితులకు లొంగిపోవడమే తప్ప, ఎదిరించడం తెలీకపోవడం, ఒక విపరీతమైన ఆత్మన్యూనతా భ్రాంతి. 'గాలి' అనే కథలో దీన్ని విశ్లేషించి చూపించారు. ఇందుకు భిన్నంగా మిస్ భారతి బి.ఎ. అన్న కథలో చాలాకాలం తర్వాత కలుసుకున్న క్లాస్‌మేట్స్ విశ్వేశ్వరరావు, భారతి. అభిమానంతో ముందు ఉద్యోగం చేస్తున్నట్లు విశ్వం, పెళ్ళయిందని భారతి అబద్ధాలు చెప్పుకున్నా, విశ్వేశ్వరరావు చివరికి దాచకుండా నిజాన్ని బయటపెట్టడం, భారతి బయటపెట్టే లోపల కథ ముగియడం, ఆ విధంగా సృష్టించబడిన విషాదం, నిజమైన సానుభూతిని కల్గిస్తుంది అని ఆ కథని అభినందించారు. జీవితాన్ని సమగ్రంగా కాక, ఒకే వైపు నుంచి చూడటం వల్ల ఈ 'లోపం' సుబ్బరామయ్యగారి కథల్లో కన్పిస్తుందని అన్నారు.

**డబ్లి నర్స్ కథలు**

జేమ్స్ జోయిస్ 'డబ్లి నర్సు కథలు' అనే పరిశీలనా వ్యాసంలో, జాయిస్ నవలా సాహిత్యంలో ఎన్ని ప్రయోగాలు చేయడానికి వీలుందో అన్నీ చేసి చూపించాడనీ, గత శతాబ్దంలో రచింపబడిన గొప్ప నవలల జాబితాలో జాయిస్ "యూలిసెడ్" మొదటి స్థానంలోనూ, ఎ పోర్‌ట్రెయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ యంగ్ మెన్" మూడవ స్థానం లోనూ, "ఫన్నిగన్స్ వేక్" డెబ్బై ఏడవ స్థానంలోనూ ఉన్నట్లు చెప్పారు. దీనివల్ల ప్రపంచ నవలా సాహిత్యంపై అతని ప్రభావం ఎంత గాఢమైనదో, నవలా రచనలో ఎంత ప్రయోగశీలో తెలియజేశారు.

ఈ డబ్లినర్లు – కథల్లో నగరంలోని ముఖ్య వీధులు, అక్కడి సాంఘిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, రాజకీయ వాతావరణం, అక్కడ మనుష్యుల వేషభాషలు కన్పిస్తాయి. రచనల్లో తనకు అభిమాన పాత్రమైన నగరాన్ని యింతగా చిత్రించడం విశేషం. ఈ కథల్లో కథాకాలం కొన్ని గంటలు మాత్రమే. ఈ కథల్లో రచయిత కొన్ని పాత్రలనీ, సంఘటనలనీ మన ముందుంచుతాడే తప్ప తానేమీ చెప్పడు. చాలా అంశాల్ని పాఠకుల ఆలోచనకే వదిలేస్తాడు. కొన్ని క్షణాల్లో, కొన్ని సంఘటనలు కారణంగా కొందరు వ్యక్తులు జీవిత రహస్యమేదో బహిర్గతమయినట్లుగా, యేదో జ్ఞానోదయమైనట్లుగాను అనుభూతి కల్గటం జాయిస్ కథల్లో జరుగుతుంది.

పైకి స్వల్పంగా కనిపించే సంఘటనల కారణంగా కథల్లోని పాత్రలకు జ్ఞానోదయం అయినట్లుగా తోచడం, దాంతో వాళ్ళ వ్యక్తిత్వాలలో మార్పు రావడం, జాయిస్ "ఎప్లిఫాంగ్" అంటాడు. ఈ కొసమెరుపు అతని కథలకి ప్రాణం అని విమర్శకుల అభిప్రాయం. "సిస్టర్సు", "ఎ లిటిల్ క్లౌడ్", "ఎ మదర్", "ది డెడ్" "ఐ వీ డే యిన్ ది కమిటీ రూమ్" అనే కథల్లో విశ్లేషించి చూపించారు.

జాయిస్ ప్రభావం – నవీన్ తన రచనల్లోనూ, శ్రీశ్రీ, బుచ్చిబాబు, రచనల్లోనూ కన్పిస్తుందనీ, జాయిస్ రచనా శిల్పం అంత శక్తిమంతమైనదని అభినందించారు.

సంభాషణ ద్వారా కథని చెప్పి, చెప్పదల్చుకున్న విషయాన్ని చిన్న మలుపుతో సూచించడం, సమకాలీన సామాజిక జీవితాన్ని విశ్లేషించడానికి హాస్యం, వ్యంగ్యం పదునైన ఆయుధాలుగా ఎన్నుకున్నారన్నారు. 'వేదఘోష', 'నలభై రూపాయలు' అనే రెండు కథలలోని నేర్పునీ, కథన శిల్పాన్ని మెచ్చుకున్నారు.

చలన చిత్రరంగాన్ని ఆధారంగా చేసుకుని, రావూరి భరద్వాజ రాసిన పెద్ద నవల 'పాకుడు రాళ్ళు' ఈ నవలలో కేంద్ర బిందువు మంజరి పూర్వ జీవితం గురించి కొన్ని ముఖ్య విషయాలు :

— — — — * * * — — — —



**సినీతార కావాలన్న కోరిక, సినిమా ప్రపంచంలో అత్యున్నత శిఖరాన్ని అధిరోహించడం తన జీవిత లక్ష్యంగా మంజరి నిర్దేశించుకున్న విషయం, ప్రారంభంలో ఆవిష్కరించకపోవడం నవలలో కన్పించే పెద్ద లోపం.**

— — — — * * * — — — —

**పాకుడురాళ్ళు**

ఎలాంటి పరిస్థితులలో వేశ్యావృత్తికి సిద్ధపడింది, ఎక్కడ పుట్టింది? ఆమె తల్లిదండ్రులెవరు? వాళ్ళెలా బతికేవాళ్ళు, మంజరి బాల్యం ఎలా గడిచింది? సినీతార కావాలన్న కోరిక, సినిమా ప్రపంచంలో అత్యున్నత శిఖరాన్ని అధిరోహించడం తన జీవిత లక్ష్యంగా మంజరి నిర్దేశించుకున్న విషయం, ప్రారంభంలో ఆవిష్కరించకపోవడం నవలలో కన్పించే పెద్ద లోపం. ప్రధాన పాత్ర అయిన మంజరి ఎప్పుడూ పరిస్థితులకు లొంగిపోతుందే తప్ప ఏ దశలోనూ ప్రవాహానికి ఎదురీదడానికి ప్రయత్నించదు. ఇందువల్లనే మంజరి పట్ల పాఠకుల హృదయం ద్రవించిపోయేటంత సానుభూతి కలగదు. దీనికి రచయిత తన ప్రధాన పాత్ర పట్ల అనుసరించిన దృక్పథం కారణమవుతుందన్నారు. వాస్తవిక దృష్టితో యిది కీలకమైన అంశం.

చివుకుల పురుషోత్తం "ఆధునిక సావిత్రి" నవలలో పాత్ర చిత్రణ సిద్ధాంత పక్షపాతంతో ఉండటం వల్ల, కళాకారుని ప్రచార ధోరణిని బయటపెట్టిందనీ, కళారహితంగా ఉందనీ అభిప్రాయపడ్డారు.

**వసంతగీతం**

నవీన్‌కు నవల సమగ్ర సౌందర్యంతో రూపొందడానికి కావలసిన కీలకాంశాలపై స్పష్టమైన అవగాహన, అనుభవం రచయితగా ఉన్నందున పులి ఆనంద మోహన్ నవల 'వసంతగీతం'పై చేసిన సమీక్షలో పీపుల్స్ వార్ గ్రూపు దళ జీవితాన్ని చిత్రించడంలో దొర్లిన ప్రధానమైన కొన్ని లోపాలను ఈ విధంగా చూపిస్తారు :

(1) తను తీసుకున్న విశాలమైన జీవితాన్ని ఎలా రూపొందించాలో పూర్తిగా అర్థమయినట్టు లేదు.

(2) పాఠకుణ్ణి పట్టి చదివించే నవలకు ప్రాణప్రదమైన అంతసూత్రాన్ని, అవిచ్ఛిన్నతను ఎలా సాధించాలో తేల్చుకోలేకపోయాడు.

(3) నవలలో ఒక గట్టయ్య పాత్రకు తప్ప మరి యే ఇతర పాత్రకు సమగ్రమైన రూపం ఏర్పడలేదు.

(4) దళ జీవితాన్ని కూడా లోతుగా, విస్తృతంగా చిత్రించలేకపోయారు.

ఈ లోపాలున్నప్పటికీ 'వసంత

గీతం' ఒక మంచి ప్రయత్నం అని అభినందించారు. ఇది నా దృష్టిలో సమగ్రమైన విమర్శ. వై. రామకృష్ణారావుగారు రాసిన 'ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో చైతన్య స్రవంతి' అన్న వ్యాసాన్ని అభినందనపూర్వకంగా సమీక్షిస్తూ - "రామకృష్ణారావుగారి చైతన్య స్రవంతి నిర్వచనంలో 'యధాతథం' కల్తీ లేకుండా అదే మాటలు, పాక్షిక సత్యాన్ని మాత్రమే సూచిస్తాయి.

మనం ప్రపంచం అనే 'డిజ్‌ఆర్డర్'లో నుంచి 'రచన' అనే 'క్రమత' సృష్టించడానికి, చైతన్య స్రవంతి తరహా రచనల్లో కూడా కొంత 'వడపోత', 'ఎడిటింగ్' తప్పవు. మనస్సంచారాన్ని యధాతథంగా ప్రదర్శించడానికి, చైతన్య స్రవంతి రచయితలు నూటికి నూరుపాళ్ళు ప్రయత్నిస్తారు గాని, కృతకృత్యులవుతారని చెప్పలేము. అయినా రామకృష్ణారావుగారు, ఆ సంక్లిష్టమైన రచనా విధానాన్ని, సగటు పాఠకుడికి కూడా అర్థమయ్యేలా సరళమైన శైలిలో, అనువైన ఉదాహరణలతో చెప్పగలిగారన్నారు. ఇది నిజాన్ని నిష్కర్షగా చెప్పగలిగిన విమర్శ.

శ్రీశ్రీ కవితాశక్తిని, స్థానాన్ని, నవీన్ తన అంతర్‌దృష్టితో యీ విధంగా సమీక్షించారు :

మహాప్రస్థానంలో శ్రీశ్రీ అందుకున్న కవితా శిఖరాలని ఆ తర్వాత ఆయన రచించిన ఎన్నో గీతాలలో మళ్ళీ అందుకోలేకపోయాడు. మహాప్రస్థానంలో ఉన్న వాడీ, వేడీ, నెత్తురు, కన్నీళ్ళూ, నాదం, వేగం, ఉద్రేకాల ఉధృతం మరి యే యితర రచనల్లోనూ ఇంత విజృంభించి కన్పించవు. ప్రపంచ భాషలన్నిటిలోనూ వెలువడిన మహాగ్రంథాల సరసన కూర్చునే తర్వాత మహాప్రస్థానానికి ఉంది.

— — — — — * * * — — — — —



**మహాప్రస్థానంలో శ్రీశ్రీ అందుకున్న కవితా శిఖరాలని ఆ తర్వాత ఆయన రచించిన ఎన్నో గీతాలలో మళ్ళీ అందుకోలేకపోయాడు. మహా ప్రస్థానంలో ఉన్న వాడీ, వేడీ, నెత్తురు, కన్నీళ్ళూ, నాదం, వేగం, ఉద్రేకాల ఉధృతం మరి యే యితర రచనల్లోనూ ఇంత విజృంభించి కన్పించవు. ప్రపంచ భాషలన్నిటిలోనూ వెలువడిన మహాగ్రంథాల సరసన కూర్చునే తర్వాత మహాప్రస్థానానికి ఉంది.**

— — — — — * * * — — — — —

**చలం, శ్రీశ్రీ, కొడవగంటి కుటుంబరావులతో ఇంటర్వ్యూలలో :**

ఈ ముగ్గురు ప్రతిభావంతుల్నీ నవీన్ అడిగిన ప్రశ్నలు లోతైనవి, అర్థవంతమైనవి. వారి అంతరంగంలోనికి చొచ్చుకుని వెళ్ళి వారి రచనల వెనుక దాగి ఉన్న ఆంతర్యాన్ని సరియైన రీతిలో రాబట్టగలిగాయి :

చలం రచనల్లో విశేష ఆదరణ లభించిన 'పురూరవ', 'అరుణ'ల గురించి నవీన్ స్పందన ఎలా ఉంది?

**'పురూరవ'**లో చలానికి కలిగిన అనేక ఆధ్యాత్మిక సందేహాలను పురూరవుడి ప్రశ్నల రూపంలోనూ, చలం తన నిరంతరాన్వేషణ ద్వారా సాధించిన జ్ఞానాన్నంతా ఊర్వశి సమాధానాల రూపంలోనూ మనం చూస్తాం.

**అరుణ :** చలం వ్యక్తిత్వంలో ప్రతి అంశాన్ని గొప్పగా చూపించిన రచన. ఆయనకు స్త్రీలో కన్పించిన దైవంతో సమానమైన ఔన్నత్యం, శృంగార జీవితంపై ఆయన మోజు, కృత్రిమ విలువలతో నిండిన సమాజంపై ఆయన ఏహగింపు, చివరకు భౌతిక విలువలకు అతీతమైన శాంతిని సాధించాలనే ఆయన తహ తహ - ఆ నవలలో కన్పిస్తాయి.

విశ్వనాథ సాహిత్యం వెనుక హైందవ సాంప్రదాయం ఉంది. శ్రీశ్రీ సాహిత్యం వెనుక ప్రపంచాన్నంతా ఒక ఊపు, ఊపిన మార్క్సిస్టు సిద్ధాంతం ఉంది. కానీ చలం సాహిత్యం వెనక చలమే ఉన్నాడు. చలం హృదయం ఉంది. చలం అనుభవం ఉంది. తన జీవితంలో చలం చేసిన కఠోర ప్రయోగాలు ఉన్నాయి. చలం జీవితాన్ని, సాహిత్యాన్ని విడదీయడానికి వీల్లేదు. జీవిత రథ చక్రాల కింద నలిగితే గాని, నీ మార్గమేమిటో నీకు తెలీదు. ఆలోచనకంటే అనుభవం గొప్పది. అన్వేషణ గొప్పది. జీవిత రహస్యాల్ని మీకై మీరు తెలుసుకోండి. అనుక్షణం మిమ్మల్ని మీరు ఉన్నతీకరించు కుంటూ వెళ్ళండి. అప్పుడే మీరు ప్రేమించ లుగుతారు. ప్రేమలోనే మహత్తర ఆనందం ఉంది. ఆ ఆనందాన్ని మీరు స్వంతం చేసుకోండి. ఇదే సాహిత్యంలో బలాన్ని చిరంజీవిని చేస్తుంది. చలం రచనల గురించి ప్రస్తావించి - ఏ ప్రభుత్వ చట్టాలు, సిద్ధాంత రాద్ధాంతాలు, ఉవ్వెత్తున ఎగిసిపడే ఏ ఉద్యమాలు చేయలేని పనిని చలం పుస్తకాలు చేస్తాయి. అనుక్షణం మనచుట్టూ ముసిరే చీకట్లను పారదోలడానికి కరదీపికలుగా పనిచేస్తాయి. చలంపై ఐదు వ్యాసాలు రాసి ఆయన రచనలలోని వెలుగు - నీడలను సమగ్రంగా విశ్లేషించారు.

ఈ పుస్తకం చదివిన వారికి, నవీన్, విమర్శ పటిమ, అంతర్‌దృష్టి, ఆధునికతత్వం, మృదువైన మానవత్వం గల ఉత్తమ విమర్శకు డన్న అభిప్రాయం ఏర్పడుతుంది.

---

# నానీలు

**కోట్ల వెంకటేశ్వరరెడ్డి**

ప్రపంచీకరణ
వేయితలల సర్పం
శ్వాసనే కాదు
భాషనూ కాటేస్తది!

డాలర్
రూపాయిని మింగినట్లే
అమ్మను
మమ్మీ మింగేసింది!

వెయ్యేండ్ల
తెలుగు భాషకు
నన్నయ తడబాటు
ఇంకా తగ్గలేదు!

ఇవ్వాల్టి మనిషిది
వంటి భాష (Body Language)
దాంట్లో
హృదయమెందుకుంటుంది?

వెలగటానికి
కావలసినంత తైలమున్నా
భాషా దీపం
కొండెక్కుతుందేమి?

ఏమిటీ
పడమటి గాలి
విలువల్ని
వలువల్లా ఊడదీస్తోంది

భాషంటే
పట్టి
సమాచార వాహిక కాదు
అదో రక్తస్పర్శ

# "సమకాలీన కవిత్వంలో ప్రతీకలు - భావచిత్రాలు" ఆవిష్కరణ


'సమకాలీన కవిత్వంలో ప్రతీకలు - భావచిత్రాలు'ను డాక్టర్ అద్దేపల్లి ఆవిష్కరించారు

సమకాలీన కవిత్వంలో వచ్చిన సిద్ధాంత వ్యాసాలలో లంకా వెంకటేశ్వర్లు గ్రంథం వారి ఉత్తమ కృషికి ప్రతీకయైన పరిశోధన అని కవి, విమర్శకులు డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు అన్నారు. 'రసన' సాహితీ సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో అక్టోబర్ 16న ఏలూరులోని మధులత కాన్ఫరెన్స్ హాలులో లంకా వెంకటేశ్వర్లు రచించిన 'సమకాలీన కవిత్వంలో ప్రతీకలు - భావచిత్రాలు' ఎం.ఫిల్., సిద్ధాంత గ్రంథాన్ని డాక్టర్ అద్దేపల్లి ఆవిష్కరించారు. ఇప్పుడు వస్తున్న పరిశోధనల కంటే భిన్నంగా ఒక క్రొత్త అంశాన్ని, దృక్పథాన్ని తన సిద్ధాంత గ్రంథం ద్వారా తెలుగు సాహిత్య విమర్శకు అందించారని ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేసిన ప్రముఖ కవి డాక్టర్ ఎండ్లూరి సుధాకర్, కొనియాడారు.

ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేసిన ఆదివారం వార్త అనుబంధం సంపాదకులు శ్రీ గుడిపాటి ప్రసంగిస్తూ నేటి ప్రపంచీకరణ పరిస్థితులలో సంస్కృతి, సాహిత్యం తన ఉనికిని కోల్పోతున్న దశలో ఆకర్షణీయమైన కవిత్వ అభివ్యక్తిని ఆవిష్కరించేలా సాహిత్య విమర్శ ఉండాలని పేర్కొన్నారు. ప్రతి కవి, ప్రతి సాహిత్య విమర్శకుడు, ప్రతి కళాకారుడు "తెలుగు భాష విస్తృతి"ని వస్తువుగా చేసుకొని తనదైన శైలిలో ప్రతిఘటించవలసిన పరిస్థితి ఉన్నదని తెలుగు భాషోద్యమ సమాఖ్య ప్రధాన కార్యదర్శి, డాక్టర్ సామల రమేష్ బాబు ఆవేదన వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమంలో ప్రముఖ "హైకూ" కవయిత్రి శ్రీమతి వై. రత్నమాల గారి "వెన్నెల రాత్రి వాన" హైకూ సంపుటికి కీ॥శే॥ శ్రీమతి లంకా వెంకట రమణమ్మ స్మారక హైకూ నగదు పురస్కారాన్ని "ఇండియన్ హైకూ క్లబ్" వ్యవస్థాపక అధ్యక్షులు డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్ ప్రధానం చేశారు. "రసన" సాహితీ సంస్థ అధ్యక్షులు శ్రీ ఈదుపల్లి వెంకటేశ్వరరావు ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించగా, సంస్థ ప్రధాన కార్యదర్శి శ్రీ వి. బందా సభను నిర్వహించారు. ఈ కార్య క్రమంలో శ్రీ బి.వి.వి. ప్రసాద్, శ్రీ భగ్వాన్ జి.ఎస్.ఎస్. మూర్తి, డాక్టర్ కొప్పర్తి, శ్రీ రామ కృష్ణ, శ్రీ చిత్రపు రామకృష్ణ, శ్రీ అల్లూరి వెంకట నరసింహరాజు, శ్రీమతి అన్నపూర్ణాదేవి, శ్రీ భాస్కర యాదవ్, శ్రీ కె.పి. వెంకన్న, శ్రీ గూడూరి వెంకటేశ్వరరావు, శ్రీ అగస్టీన్ తదితరులు ప్రసంగించారు.

# "ఉత్తరాంధ్ర జానపద కళలు" గ్రంథావిష్కరణ



'ఉత్తరాంధ్ర జానపద కళలు' పుస్తకావిష్కరణలో మాట్లాడుతున్న గంటేడ గౌరునాయుడు, చీకటి దివాకర్, యోహన్‌బాబు, సన్నశెట్టి రాజశేఖర్, రచయిత బద్రికూర్మారావు

నవంబర్ 6న విజయనగరం స్థానిక హర్షా థియేటర్‌లో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో బద్రి కూర్మారావు రాసిన ఉత్తరాంధ్ర జానపద కళలు పుస్తకావిష్కరణ జరిగింది. ఈ కార్యక్రమానికి సాహితీ స్రవంతి కన్వీనరు చీకటి దివాకర్ అధ్యక్షత వహించగా ఆంధ్రా విశ్వవిద్యాలయం తెలుగు విభాగం అసోసియేట్ ప్రొఫెసర్ యోహన్‌బాబు ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ప్రముఖ రచయిత గంటేడ గౌరునాయుడు, కళింగ సాహిత్య సంస్థ వ్యవస్థాపకులు సన్నశెట్టి రాజశేఖర్ గ్రంథసమీక్ష చేశారు.

శ్రమజీవుల దైనందిన జీవితాలకు ఉత్తరాంధ్ర జానపద కళలు గ్రంథం దర్పణం పట్టిందని గంటేడ గౌరునాయుడు అన్నారు. కష్టజీవుల స్వేద బిందువుల మెరుపుల్లోంచే జానపద సాహిత్యం ఆవిర్భవించిందని, జానపద కళలతో ప్రతి ఒక్కరికీ అనుబంధం ఉంటుందన్నారు. అంతరించిపోతున్న జానపద కళావిన్యాసాలు కాపాడుకోవలసిన బాధ్యతను ఈ గ్రంథం తెలియజేస్తుందన్నారు. మౌఖికంగా వచ్చేదే జానపద కళ అని ఆయన వివరించారు. ఈ రోజు జానపద బాణీలో అనేక పాటలను కవులు రాస్తున్నప్పటికీ సహజంగా ఆ బాణీలను రూపొందించిన నిరక్షరాస్యులైన జానపద కళాకారులకే ఆ గౌరవం దక్కవలసి ఉందని అన్నారు. ఉత్తరాంధ్రలో ఎన్నో జానపద కళా రూపాలున్నాయని వాటిని భవిష్యత్ తరాలు వారికి

అందివ్వాలని పేర్కొన్నారు. రచయిత రాసిన ఈ గ్రంథం ప్రతి అక్షరం వెనుక రచయిత కృషి, శ్రమ జీవుల కథలు కన్పిస్తున్నాయని అన్నారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు అసోసియేట్ ప్రొఫెసర్ యోహన్‌బాబు మాట్లాడుతూ మానవజాతి ఆవిర్భావం నుంచి జానపద కళ పుట్టిందని ప్రాచీనమైన ఈ కళలు సజీవమైనవి దీనిని అందరూ కాపాడుకోవాలని అన్నారు.

సన్న శెట్టి రాజశేఖర్ మాట్లాడుతూ ఉత్తరాంధ్ర ఉత్తరాంధ్ర జానపద కళలు ఆది నుంచి నిరాదరణకు గురవుతున్నాయన్నారు. ఉత్తరాంధ్ర కళానైపుణ్యానికి ఈ గ్రంథం అద్దం పట్టిందని గ్రంథంలో కొన్ని విషయాలను పాటలతో ఉదహరించారు. ఈ జానపద కళల గొప్పతనాన్ని, జానపద బాణీలు తరువాత ఉద్యమాలకు ఎలా ఉపయోగపడ్డాయో వివరించారు.

సాహితీ స్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ మాట్లాడుతూ ప్రాచీన సాంఘిక పరిస్థితులు మనకు జానపద కళలు తెలియజేస్తాయన్నారు. మహోన్నతమైన సారాన్ని ఇమిడి ఉన్న జానపద కళలకు నేడు ముప్పు వాటిల్లిందని ఆవేదన చెందారు.

రచయిత బద్రి కూర్మారావు మాట్లాడుతూ తన చిన్నతనంలో జముకులు, జంగాలు మొదలగు జానపద కళాకారులు పాడిన పాటలు ద్వారా ఎన్నో విషయాలను నేర్చుకున్నానని, ఆ కళా కారులలో ఉండే సాహిత్యమే తన రచనలకు మూలమని చెప్పారు. వందలు, వేలు సంవత్సరాలు చరిత్ర కలిగిన జానపద కళలు నేడు టి.వి. సినిమాల ప్రవాహంతో కొట్టుకుపోతున్నాయని, జానపద కళలు, కళాకారులు చెల్లా చెదురయ్యారని, ఇటువంటి కళల పరిరక్షణకు తనవంతుగా ఒక కళా పీఠాన్ని స్థాపించానని పేర్కొన్నారు. ఇప్పటికీ కొన్ని కళలు అంతరించి పోగా మరికొన్ని కొన ఊపిరితో బతుకుతున్నాయని జానపద కళలకు ఆఖరితరము వారే ప్రస్తుతం మిగిలిఉన్నారని అన్నారు. ఈ ఉద్దేశ్యం తోనే జానపద కళలు, కళాకారులను సృశిస్తూ పుస్తకం రాసానన్నారు. ఈ సందర్భంగా గొర్లె తాతారావు బృందం పాడిన తంబుర పాట, శ్రీపూడి సూర్య నారాయణ భాగవతార్ తూర్పు భాగోతంలోని కొన్ని చరణాలను పాడి వినిపించగా శ్రీకాకుళానికి చెందిన విభూతి కృష్ణమూర్తి బృందం ప్రదర్శించిన రుంజవాయిద్యం, గంగిరెద్దుల మేళం సభికులను ఆకట్టుకున్నాయి.

ఈ కార్యక్రమంలో జానపద కళాకారులు, పట్టణంలోని సాహితీవేత్తలు డా॥ ఎ. గోపాలరావు, డా. రామసూరి, డా. చాగంటి తులసి, జి.యస్. చలం, అల మొదలగు వారు మరికొంత మంది కళా సంస్థల ప్రతినిధులు ప్రజలు పాల్గొన్నారు. జి.యస్ చలం వందన సమర్పణ చేశారు.




ఒకే రోజు వంద మందికి పైగా ఆధునిక కవులతో అనంత కవితోత్సవం ప్రారంభిస్తున్నవారు : టి. రాజారాం

# 'అనంత'లో కవితోత్సవం

అనంతపురం కొత్తూరు జూనియర్ కళాశాలలో అక్టోబర్ 2న స్పందన అనంత కవుల వేదిక ఆధ్వర్యంలో కవితోత్సవ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా పలువురు కవులు మాట్లాడుతూ ప్రతి ఒక్కరిలోనూ భావుకత ఉంటుంది. అయితే అది సృజనాత్మకంగా సాహితీ కోణంలో ఆవిష్కరించినప్పుడే పరిపూర్ణత సంతరించుకుంటున్నారు. జిల్లాకు కరవు జిల్లా అని పేరున్నా కళలకు కొదవలేదని నిరూపిస్తూ వందకు పైగా కవులు పాల్గొనటం నిజమైన సాక్ష్యమన్నారు. ఇటువంటి కార్యక్రమాలు నిర్వహించడం ద్వారా యువకవులు, వర్ధమాన రచయితలకు ప్రోత్సాహాన్ని, ఉత్సాహాన్ని కల్పించినట్లవుతుందన్నారు. ఈ కవితోత్సవం ఉదయం 9 గంటల నుంచి సాయంత్రం వరకు మూడు విభాగాలుగా నిరవధికంగా కొనసాగింది. ఈ కార్యక్రమానికి సభా ధ్యక్షులుగా, సమీక్షకులుగా, సలహాదారులుగా ఎస్కేయూ ప్రొఫెసర్ శ్రీనివాసుల రెడ్డి, స్పందన శ్రీరాములు, ప్రభుత్వ జూనియర్ కళాశాలల అధ్యాపకుల జిల్లా అధ్యక్షుడు టి. రాజారాం, కవి రాధేయ, డి. శిరీష, చంద్రశేఖర శాస్త్రి, ఉద్దండం చంద్రశేఖర్, మధురశ్రీలు వ్యవహరించారు. ఈ కార్యక్రమంలో మార్కండేయులు, కవులు మల్లెల, కృష్ణవాణి, ఆకాశవాణి శ్యాంసుందరశాస్త్రి, అజీజ్, దీవెన, స్నేహలత, శ్రీనివాస్ జిల్లా వ్యాప్తంగా వచ్చిన వందకు పైగా కవులు, తదితరులు పాల్గొన్నారు.

# 'భగ్వాన్'కు ఇండియన్ హైకూ క్లబ్ పురస్కారం



అనకాపల్లిలో ప్రముఖ కవి 'భగ్వాన్'కు
ఇండియన్ హైకూ క్లబ్ వారి జె.ఎం. నాయుడు సాహితీ పురస్కార సభ

ఆంధ్రా యూనివర్శిటీ మాజీ రిజిస్ట్రార్ జె.ఎం. నాయుడు పేరిట సాహితీ పురస్కారాన్ని ఇండియన్ హైకూ క్లబ్ ప్రముఖ కవి భగ్వాన్‌కు ప్రదానం చేసింది. దీనికి సంబంధించిన సభ అనకాపల్లి, ఇండియన్ హైకూ క్లబ్ స్థాపించిన బషో కాన్ఫరెన్స్ హాలులో జరిగింది. ఈ సభకు కథా రచయిత జి. రంగబాబు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా ఇండియన్ హైకూ క్లబ్ వ్యవస్థాపక అధ్యక్షులు డాక్టర్ తలతోటి పృధ్వీరాజ్ మాట్లాడుతూ భగ్వాన్ కవిత్వం చాలా పదునైనదనీ, ఎంతో సామాజిక స్పృహ కల్గి వున్నదనీ, ఎన్నో సామాజిక అంశాలను ఆయన కవిత్వీకరించారనీ అన్నారు. ఆయన కవితా సంపుటాలైన శబ్దాల్ని ప్రేమిస్తూ, బల్లకట్టు, వడ్ల బండి రాసిన హైకూ సంపుటి ఏటి ఒడ్డున ప్రయాణం మొదలగు నాలుగు పుస్తకాలపై నలుగురు వక్తలు గట్టి బ్రహ్మాజీ, మల్లారెడ్డి శంకర ప్రసాద్, వి.ఎస్.బి. దేవవర్మ మరియు పృధ్వీరాజ్ ప్రసంగించారు. అనంతరం ఆయా వక్తల ప్రసంగాన్ని ఆడియో సి.డి.లుగా రూపొందించి భగ్వాన్‌కు అందజేశారు. అనేకమంది లబ్ధ ప్రతిష్టులైన కవులు, రచయితల యొక్క ప్రసంగాలను వివిధ ఆడియో మరియు వీడియో సి.డి.లుగా రూపొందించింది. ముఖ్య అతిథిగా ఎస్. రాము పాల్గొన్నారు. ఆయన చేతుల మీదుగా కవి భగ్వాన్‌కు పురస్కారం అందజేశారు. అనంతరం కవి భగ్వాన్ మాట్లాడుతూ అధ్యయనం చేశాక మాత్రమే ఏ వస్తువునైనా కవిత్వీకరించాలని అన్నారు. కవిత్వ రచన ఒక తపస్సు వంటిదనీ, అందరూ ప్రయోజనకరమైన కవిత్వాన్ని రాయాలని కోరారు. డాక్టర్ పృధ్వీరాజ్ వందన సమర్పణతో సభ ముగిసింది.

# "అమ్మతనపు కమ్మదనం" పుస్తకావిష్కరణ



మునగాలలో "అమ్మదనపు కమ్మదనం" ఆవిష్కరణ సభ

వర్ధమాన బాల సాహిత్యవేత్త, విద్యావేత్త గంధం నరసయ్య రాసిన "అమ్మతనపు కమ్మదనం" పుస్తకావిష్కరణ సభ అక్టోబర్ 30న నల్లగొండజిల్లా మునగాల మండల కేంద్రంలో జరిగింది. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుల బి. వెంకటరెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ సభలో చి॥ అభిషిక్త పుస్తకావిష్కరణ చేయగా వికాస విద్య ఉపసంపాదకులు, బాలల రచయిత అమ్మిన శ్రీనివాసరాజు పుస్తక సమీక్ష చేస్తూ, పూర్వం మన పెద్దలు వారసత్వ సంపదగా అందించిన ధన, భూమి ఆస్తి సంపదలను ఎలా కాపాడుకుంటున్నాయో, అదేవిధంగా మన ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాల విలువలను, నైతిక విలువలను పదిలపరచు కోవాలన్నారు. అందుకు ప్రస్తుత బాల సాహిత్యమే చక్కని సాధనం అని, అందరూ ఆ దిశగా ప్రయత్నం చేయాలన్నారు. దాదాపు నలభై సంవత్సరాల తన సుదీర్ఘ బోధనానుభవంతో రంగరించిన పుస్తకమే కాని, కల్పనలలో వర్ణనలు చేయలేదని, తన ఆలోచనలను అన్ని వర్గాల వారు ఆచరించాలని పుస్తక రచయిత గంధం నరసయ్య పేర్కొన్నారు. ఇంకా ఈ సభలో స్థానిక విద్యావేత్తలు, అధికారులు, ప్రజా ప్రతినిధులు పాల్గొని నరసయ్య సాహితీ కృషిని కొనియాడారు. ఎస్. అజయ్‌కుమార్, నల్లపాటి శ్రీనివాస్, ఉప్పల కాంతారెడ్డి, కందిబండ సత్యనారాయణ, వెంకటయ్యలు పాల్గొని రచయితను అభినందించారు. జి. శ్రీనివాస్ స్వాగతోపన్యాసంతో ప్రారంభమైన ఈ పుస్తకావిష్కరణ సభ, బి.ఎస్. గిరిధర్ వందన సమర్పణతో విజయవంతంగా ముగిసింది.

# రామయ్య విద్యాపీఠం పుస్తకాల ఆవిష్కరణ

చుక్కా రామయ్య విద్యాపీఠం ఆధ్వర్యంలో గురువారం బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో నాలుగు పుస్తకాలను ఏకకాలంలో ఆవిష్కరించారు. ఎ. రాజాహుస్సేన్ రచించిన 'చదువుల సారం' పుస్తకాన్ని విద్యావేత్త చుక్కా రామయ్య 'ఆనవాలు'ను ఆంధ్రప్రభ సంపాదకులు సతీష్‌చందర్, పెన్నా శివరామకృష్ణ రచించిన 'ఎరుక' పుస్తకాన్ని జాతీయ కేంద్ర సాహిత్య అవార్డు గ్రహీత కోవెల సంపత్‌కుమారాచార్య, గుడిపాటి రచించిన 'సహజాతం' పుస్తకాన్ని ఆచార్య ఎన్. గోపిలు ఆవిష్కరించారు. అనంతరం సాహిత్య పరిశోధకులు జయధీర్ తిరుమలరావు అధ్యక్షతన సమావేశం జరిగింది. ఈ సందర్భంగా కేంద్ర సాహిత్య అవార్డు గ్రహీత కోవెల సంపత్ కుమారాచార్య మాట్లాడుతూ సాహిత్య విమర్శ చేసే సమయంలో తెలుగు పదాల అర్థాలు, గ్రంథాలలోని పాత్రలను తప్పక పరిగణనలోకి తీసుకోవాలని సూచించారు. పెన్నా శివ రామకృష్ణను సాహిత్య విమర్శలో నూతనత్వానికి ప్రతినిధిగా పేర్కొన్నారు. విద్యావేత్త చుక్కా రామయ్య మాట్లాడుతూ స్వాతంత్ర్యం తర్వాత 50 ఏళ్ళ పుస్తకాలను పరిశీలిస్తే ప్రతి పాఠంలో రాజకీయ లక్షణాలు కనిపిస్తాయని, ఈ విషయాన్ని 'చదువుల సారం'లో స్పష్టమవుతుందని పేర్కొన్నారు. ఆంధ్రప్రభ సంపాదకులు సతీష్‌చందర్ మాట్లాడుతూ సాహిత్య విమర్శలో బయటి నుంచి చూసే కోణం ఇంతవరకు రాకపోవడం పట్ల ఆవేదన వ్యక్తం చేశారు. ఆకలి కోసం జరిగే పోరాటాన్ని నిర్లక్ష్యం చేయవద్దని సూచించారు. ఆచార్య ఎన్. గోపి మాట్లాడుతూ గుడిపాటి 'సహజాతం' ఎంతో మేధస్సుతో కూడుకున్నదని, ఎంతో అవగాహనతో ఈ పుస్తకం రచించారని వివరించారు. సంకలనకర్త జూలూరు గౌరీశంకర్ నాలుగు పుస్తకాల ప్రాధాన్యతను వివరించారు. ఈ కార్యక్రమంలో సాహితీవేత్తలు, కవులు, రచయితలు పలువురు పాల్గొన్నారు.

# "ప్రవాహస్పర్శ" ఆవిష్కరణ

"ప్రజలకు అర్ధమయ్యే విధంగా వారి సమస్యలను, దైనందిన జీవితాన్ని సమస్యలపై స్పందించే జ్ఞానాన్ని వాటి సాధన కోసం కార్యోన్ముఖులను చేస్తూ ప్రజలతో మమేకమై సాగే చక్కని సాహిత్యానికి ఆదరణ ఎప్పుడూ ఉంటుందని ప్రముఖ కవి, ఎ.పి. ట్రాన్స్‌కో డివిజినల్ ఇంజనీర్ కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ అన్నారు.

ఖమ్మం జిల్లా పరిషత్ మీటింగ్ హాల్‌లో అభ్యుదయ కవి పోతగాని సత్యనారాయణ రచించిన "ప్రవాహ స్పర్శ" కవితా సంపుటి, సాహితీ ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి ఆవిష్కరించారు. "ప్రస్తుత కాలమాన పరిస్థితులలో కవులు వర్ణనలకు, ఉపోద్ఘాతాలకు, అనవసర ప్రాధాన్యమివ్వకుండా ప్రజల హృదయాలకు నచ్చేలా, మెచ్చేలా రచనలు చేసి మెప్పు పొందాలని, ఆ రచనల వల్ల సమాజ శ్రేయస్సు, ప్రజలలో చైతన్యం కలగాలని తెలకపల్లి ఆకాంక్షించారు. రచనలు యింకా విస్తృతంగా రావాలని, యివి ప్రజా శ్రేయస్సు వర్తమాన స్థితిగతులను విశ్లేషించి, పరిష్కార మార్గం చూపే విధంగా వుండాలని కోరారు. సమాజం నిత్య చైతన్యవంతంగా ప్రవహిస్తుంటుందనీ, కవికి సునిశితత్వం, సున్నితత్వం ఉండాలనీ పోతగానిలో ఇవి ఉన్నాయనీ సభకు అధ్యక్షత వహించిన కవి శ్రీ సాధనాల వేంకటస్వామినాయుడు అన్నారు.

"యువతరంలో కూడా చక్కని స్పృహ, మంచి కవిత్వం రాయగల వారున్నారని, అది నిత్యం సమస్యతో సతమతమయ్యే బడుగు వర్గాల, దళిత వర్గాలను కూడా కలుపుతూ కవిత్వం రాసిన పోతగాని సత్యనారాయణ అభినందనీయులని" మాజీ రాజ్యసభ సభ్యులు, ప్రముఖ వైద్యులు, డాక్టర్ వై. రాధాకృష్ణమూర్తి కొనియాడారు. ఖమ్మం జిల్లా సాహితీ స్రవంతి గౌరవాధ్యక్షులు, వైద్యులు, కవి డాక్టర్ కె. హరీష్ మాట్లాడుతూ "కవిత్వం మన కోసం రాసుకునేది కాదని, నలుగురుకు ఉపయోగంగా, అర్థమయ్యేలా వుంటేనే దానికి గుర్తింపు వస్తుంది, నూతన కవులు ఇంకా ముందుకు రావాలని కోరారు. ఈ కార్యక్రమానికి అభ్యుదయ కవి జి. లెనిన్ శ్రీనివాస్ స్వాగతం పలుకగా ఎం. శేషగిరిరావు, పోతగాని ప్రవాహ స్పర్శ పుస్తక పరిచయం చేశారు. అదేవిధంగా సాహితీ స్రవంతి కన్వీనర్ కె. ఆనందాచారి, కపిల రాంకుమార్, కె. శ్రీనివాసులు, బెల్లంకొండ రవికాంత్, రవిమారుత్, రౌతు రవి, శ్రీమతి వి. సునంద పాల్గొన్నారు. పోతగాని మురళి వందన సమర్పణ చేశారు.




ఖమ్మంలో 'ప్రవాహ స్పర్శ' కవితా సంపుటి ఆవిష్కరణ

### పుస్తకాల పరిచయం

ఈ కార్యక్రమంలో భాగంగా పుస్తక పరిచయ సభ జరిగింది. ఈ సభకు వి. సునంద స్వాగతం పలుకగా, కథా రచయిత మండవ సుబ్బారావు అధ్యక్షత వహించారు. హైదరాబాద్‌కు చెందిన సైంటిస్ట్ యాళ్ళ అచ్యుతరామయ్య రచించిన 'ఆమె నవ్వు', కథల సంపుటి, రమ్య సాహితీ అధ్యక్షులు ఎం.ఆర్.వి. సత్యనారాయణ మూర్తి రచించిన "అమ్మే జీవన వేదం" కవితా సంపుటిలను ప్రముఖ కథా రచయిత జాతశ్రీ, కవి సిహెచ్. ఆంజనేయులు పుస్తక పరిచయం చేశారు.

# ఎండ్లూరికి సినారె పురస్కారం

కరీంనగర్ 'సాహితీ గౌతమి' జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి పేర రాష్ట్ర స్థాయి పురస్కారాన్ని గత 15 సంవత్సరాలుగా బహూకరిస్తున్నది. 16వ పురస్కారాన్ని ఎండ్లూరి సుధాకర్‌గారి "నల్లద్రాక్ష పందిరి" కైవసం చేసుకొన్నది. ప్రతి యేటా కవితా సంకలనాలకిచ్చే ఈ పురస్కారానికి శాశ్వత పురస్కార ప్రదాత డాక్టర్ ఎడవల్లి విజయేంద్రరెడ్డి. వీరి ఆధ్వర్యంలో ప్రతి యేటా పురస్కార ప్రధానోత్సవం నిరాఘాటంగా కొనసాగుచున్నది. ఈ సంవత్సరం అక్టోబర్ 26వ తేదీ, బుధవారం రోజున స్థానిక ఐ.ఎం.ఎ. మీటింగ్ హాల్ యందు పురస్కార ప్రధానోత్సవం జరిగింది. డాక్టర్ ఎడవెల్లి విజయేంద్రరెడ్డి సభాధ్యక్షులుగా సాగిన ఈ సభకు ముఖ్య అతిథిగా డాక్టర్ సి. నారాయణరెడ్డి హాజరయ్యారు. వీరి చేతుల మీదుగా పురస్కార ప్రధానం జరిగింది. గౌరవ అతిథిగా జిల్లా కలెక్టర్ సి. పార్థసారధిగారు, ప్రత్యేక ఆహ్వానితులుగా స్మైల్‌గారు హాజరయ్యారు. పుస్తక పరిచయం డాక్టర్ జి. లక్ష్మణరావు చేశారు.

రాశులు రాశులుగా కవిత్వం రాసిపడేయటం కంటే రాసిందాంట్లో వాసి ఎంతో చూడటం ముఖ్యమని డాక్టర్ సినారె అన్నారు. కరీంనగర్‌లో కవిత్వానికి కరువు లేదని కలెక్టర్ పార్థసారధి అన్నారు. సుధాకర్ కవిత్వంలోని సౌందర్యాన్ని స్మైల్ ఆవిష్కరించారు. సాహితీ గౌతమి అధ్యక్షులు మాడిశెట్టి గోపాల్ గౌతమి కార్యక్రమాలను వివరించారు. తన జీవిత నేపథ్యంలోనే తన కవిత్వం బయటికొచ్చిందని ప్రతిస్పందన ఉపన్యాసంలో ఎండ్లూరి సుధాకర్ తెలిపారు. బి.వి.ఎన్. స్వామి స్వాగత వచనాలతో ప్రారంభమైన సభ అనంతాచారి వందన సమర్పణతో ముగిసింది. దాదాపు రెండువందల మంది సాహిత్యాభిలాషుల మధ్య జరిగిన ఈ సభలో నలిమెల భాస్కర్, జూకంటి జగన్నాథం, వారాల ఆనంద్, అన్నవరం దేవేందర్, బోయినపల్లి వెంకట రామారావు, నరహరి ఆచార్య, గోపులింగారెడ్డి, మచ్చ హరిదాసు తదితర ప్రముఖులు పాల్గొన్నారు.



– బి.వి.ఎన్. స్వామి
ప్రధాన కార్యదర్శి, సాహితీ గౌతమి, కరీంనగర్.

## తిరుపతిలో త్రిపురనేని ప్రథమ వర్ధంతి

మార్క్సిస్టు విమర్శకుడు త్రిపురనేని మధుసూదనరావు ప్రథమ వర్ధంతి సభ నవంబరు 28న తిరుపతి అంబేద్కర్ భవన్‌లో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగింది. రచయిత, సాహితీ స్రవంతి నగర కన్వీనర్ ప్రేమావతి అధ్యక్షత వహించారు. త్రిపురనేనితో తన అనుబంధాన్ని, సాహిత్య సామాజిక విశ్లేషణలో ఆయన విశిష్టతను ఆమె పేర్కొన్నారు.

త్రిపురనేని 'సాహిత్యంలో వస్తు శిల్పాలు' అన్న పుస్తకంపై సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి ప్రసంగించారు. తెలుగు సాహిత్యాన్ని మాత్రమే గాక సామాజిక చరిత్రను కూడా అధ్యయనం చేసేందుకు ఈ పుస్తకం అమూల్యమైన సాధనమన్నారు. తెలుగు సంస్కృత సాహిత్యాల పరిణామ క్రమాన్ని మార్క్సిస్టు దృక్పథం నుంచి వివరించడంలో త్రిపురనేని అవగాహన లోతు తెలుస్తుందన్నారు. ప్రధానంగా కవిత్వానికి సంబంధించిన వివిధ అంశాలను వివరించిన తీరు, అస్పష్టతకు మూలాలు చెప్పిన తీరు శాస్త్రీయంగా వివరించారన్నారు. త్రిపరనేని భావుకత కూడా తెలుస్తుందన్నారు. వివిధ కోణాలనుంచి తెలుగు సాహిత్యంపై వెలువడిన విమర్శనా గ్రంధాలను ఎలా అర్థం చేసుకోవాలనేది కూడా సుబోధకంగా తెలిపారని, అరసం విరసం దశల్లోని కవిత్వాలలో శిల్పాన్ని విశదపరచారని రవి చెప్పారు. చివరి వరకూ వామపక్ష భావాలకు కట్టుబడి, అందుకు సంబంధించిన వారందరినీ ప్రోత్సహిస్తూ వచ్చిన త్రిపురనేని సాహితీస్రవంతికి కూడా శ్రేయోభిలాషిగా నిలిచారని, ప్రత్యేకించి ప్రస్థానంపై వచ్చిన అనుచిత విమర్శలను గట్టిగా ఖండించా రని గుర్తుచేశారు. కవి, అధ్యాపకుడు దయాకర్ త్రిపురనేని సాహిత్య దృక్పథంపై విశ్లేషణాత్మకంగా ప్రసంగించారు. వర్షాలు, కరెంటు సమస్యల మధ్యనే సాహితీ మిత్రులు పెద్ద సంఖ్యలో హాజరై ఆయన పట్ల తమ అభిమానాన్ని చాటుకున్నారు. మొదట మోహన్ స్వాగతం పలికారు.

## జనప్రియనగర్‌లో సాహితీ సంరంభం

జనప్రియ సాహితీ-సాంస్కృతిక వేదిక, సాహితీ స్రవంతి సంయుక్త ఆధ్వర్యంలో హైదరాబాద్ మలక్‌పేటలోని జనప్రియనగర్‌లో ఆధునిక సాహితీ స్రష్ట "గురజాడ అప్పారావు" 144వ జయంతి సభను నిర్వహించారు. ఈ సమావేశంలో సాహితీవేత్తలు జ్వాలాముఖి, ఆర్.వి. రామారావు, సత్యభాస్కర్, మోతుకూరి నరహరి, డాక్టర్ మహంతయ్య, తంగిరాల చక్రవర్తి, సర్పంచ్ ఆర్. గౌతమి పాల్గొన్నారు. సాంస్కృతిక వేదిక ఆధ్వర్యంలో "అందరికీ ఆరోగ్యం" అనే అంశంపై ఆయుర్వేదం పత్రిక ఎడిటర్ ఆచార్య ఏల్చూరి వెంకట్రావు గారితో సదస్సు జరిగింది. 'గజల్-సాంస్కృతిక రంగంపై సామ్రాజ్యవాదుల దాడి' అనే అంశంపై కవి, విమర్శకులు అద్దేపల్లి రామ్మోహనరావు సుదీర్ఘ ప్రసంగం చేశారు. ఆర్.గోపాల్, తంగిరాల చక్రవర్తి, డాక్టర్ గజవెల్లి, కాలనీ సంక్షేమ సంఘం అధ్యక్షులు సదానందం, ఎం. కృష్ణమూర్తి, ఆర్. మురళీధర్, గణేష్ పాల్గొన్నారు. గాయకులు పి. లీలాభాస్కరరావు, సూర్యనారాయణ శర్మ, గజవెల్లి పాటలు ఆలపించారు.



హైదరాబాద్ జనప్రియ నగర్‌లో గురజాడ 44వ జయంతి సభలో పాల్గొన్న జ్వాలాముఖి, ఆర్.వి. రామారావు, మోతుకూరి నరహరి, తంగిరాల చక్రవర్తి, గోపాల్, సర్పంచ్ ఆర్. గౌతమి

## విజయవాడలో గురజాడ 90 వ వర్ధంతి

విజయవాడలో నవంబరు 30 న గురజాడ అప్పారావు 90 వర్ధంతి జరిగింది. సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి, సీనియర్ రచయిత పోలవరపు కోటేశ్వరరావు ప్రసంగించారు. సాహితీ స్రవంతి నాయకులు కె.కేశవరెడ్డి అధ్యక్షత వహించారు. మొదట నారాయణ స్వాగతం పలకగా చివరలో స్రవంతి నగర కన్వీనర్ సత్య రంజన్ వందన సమర్పణ చేశారు. తెలుగు భాషా సాహిత్యాలకు గురజాడ అందించిన దోహదాన్ని వక్తలు కొనియాడారు.

### కుకట్‌పల్లిలో..

హైదరాబాద్ కె.పి. హెచ్.బి. కాలనీ బ్రిలియంట్ గ్రామర్ స్కూలు ఆవరణలో సాహితీ స్రవంతి స్థానిక శాఖ ఆధ్వర్యాన గురజాడ అప్పారావు 90 వర్ధంతి సందర్భంగా 'తెలుగు-వెలుగు' కవితా గోష్ఠి జరిగింది. రచయిత, రంగారెడ్డి జిల్లా స్రవంతి కన్వీనర్ యాళ్ల అచ్యుత రామయ్య అధ్యక్షత వహించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి ముఖ్యఅతిధిగా విచ్చేసి గురజాడ జీవిత సాహిత్యాలను, తెలుగు భాషా సాహిత్యాల నేటి పరిస్థితిని వివరించారు. ఈ ప్రాంతంలో సాహితీ కార్యక్రమాలపై సూచనలు చేశారు. కో కన్వీనర్ వలి, ఎ.కృష్ణారావు మాట్లాడుతూ సాహితీ స్రవంతి కృషిని వివరించారు. సమావేశంలో పలువురు కవులు పాల్గొని కవితలు వినిపించారు. రచయిత గొరుసు జగదీశ్వరరెడ్డి మాట్లాడుతూ శాస్త్ర విజ్ఞాన ప్రచారంపైనా దృష్టి పెట్టాలన్నారు.



విప్లవ్‌దత్ శుక్లా "నిప్పురవ్వలు" పుస్తకం సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యాలయంలో కన్వీనర్ తెలకపల్లి రవి ఇటీవల ఆవిష్కరించిన చిత్రం. ఎడమ నుంచి విప్లవ్‌దత్ శుక్లా, రవి, సభాధ్యక్షులు ఎం. నరహరి, పరిచయకర్త ఎ. సత్యభాస్కర్

# కుంతనం



బి.వి.ఎన్. స్వామి

"కల్లు వంచు" కళ్ళు తేలిపోతుండగా అన్నాడతను.

"ర్యాక పట్టుకు సాతగానోనివి లొట్లకు, లొట్లు బోర్లేయవడితివి" నిష్టూరంగా అందామె.

"నేనెంత తాగుతేంది నీకు కల్లమ్ముడువోతె సాలు కదా"

"నాకు మనసు ఉండదా! లందు మొకపోనివి కాదైతివి. పెండ్లాం, పోరగాండ్లు ఉన్నోనివైతివి"

"ఏహే! ఆగహ ఏడికి పోయినా ఇదే బాగోతమా" అరిచాడు.

పెద్దగా అరుపు వినిపడేసరికి అటువైపు చూశాను. అతనివైపు ఆమె ఆదరంగా చూస్తుంది. తినడానికి తెచ్చుకున్న పుట్నాలను అక్కడి ఇసుకలో చల్లసాగాడు.

"కల్లు వంచు"

"ఇప్పుడే వంచితి అట్లపోయి మల్లచ్చి వంచుత"

"ఇగో ఆ బుడ్డిలది బొత్తిలకు వంచి పో మల్ల రాంగ ఓ బుంగ పట్టుకరా"

"మా ఇంటి పక్కోనివి. తమ్ముసోంటోనివి అని సెప్పుతున్న నిన్న నీ పెండ్లాం మా ఇంట్ల బియ్యం కొంచవోయింది. మరి ఇయ్యాలటి బువ్వకు బియ్యం ఉన్నయో? లేవో? ఈడ నువ్వు తాక్కుంటు కూసుంటె ఎట్ల?

"అక్కా! నీ దండం పెడత. నువ్వు మాట్లాడకు. నాకు అన్ని తెలుసు. ఏటికి ఎండ్రిక్కాయ పొక్కలెక్క నా మన్సుకు అన్నీ తూట్లున్నయి. అవన్నీ మర్సుటానికే ఈ తాగుడు. నీ కాల్మొక్త అక్కా, నువ్వు మల్ల రాకుంటెవాయె. ఇగపో" అంటూ తాటిచెట్టుకు జారగిలపడ్డాడు.

నెమ్మదిగా ఆమె అక్కడి నుండి వెళ్ళిపోయింది. ఇసుకలో చల్లిన పుట్నాలను ఏరుకుని తినసాగాడు. ఏరుకోవడంలోనే కాలం గడుపుతూ మెల్లిగా ఇసుకలో వాలిపోయాడు. ప్రధాన రహదారికి దగ్గరగా, ఊరికి దూరంగా ఉన్న ఆ ప్రాంతం అనేక తాటిచెట్లతో ప్రశాంతంగా ఉంది. తాటి వనం అందర్నీ అక్కున చేర్చుకుంది. ఆ ఒడిలో ఒకచోట హాస్యం, మరోచోట వేదాంతం, ఒక గుంపులో విచారం, కొందరి మాటల్లో బూతు, మరికొందరి మాటల్లో ఈర్ష్య, అసూయలు రాజ్యమేలసాగాయి. మొత్తంగా అక్కడ వ్యాపారం వర్ధిల్లుతుంది. అకస్మాత్తుగా చిన్న నవ్వు వినపడింది. అటువైపు చూశాను మెత్తగా అతను నవ్వుతున్నాడు. మత్తు అతణ్ణి కమ్మివేసింది. సగం మూసుకుపోయిన అతని కళ్ళు అతని సుప్త చేతనను సూచిస్తున్నాయి. ఆ నవ్వు కూనిరాగంగా మారింది. మరికాసేపట్లోనే రాగం పాటగా, నా చెవుల సోకింది.

ముస్కన్నపేట కాడ, మూడు గురుజుల కాడ మూడిండ్ల శాలోల్లు గూడిరట
మూడిండ్ల శాలోల్లు గూడిరట, వాల్లు మూడు తూముల తానం జేసేరట
మూడు తూముల తానం జేసిరట వాల్లు జంజాలు మెడకు ఏసీరట
జంజాలు మెడకు ఏసిరట వాల్లు పెండ్లాల ప్రేమతో పిలిసీరట
పెండ్లాల ప్రేమతో పిలిసిరట వాల్లు మొగ్గాము గుంటాల జొచ్చిరట

మొగ్గాము గుంటాల జొచ్చీరట వాల్లు దిడ్ల కేలి పొద్దు జూసీరట

పాట వినిపించడం లేదు. అతని పెదవులు కదులుతున్నాయి. పాట కోసం అతని దగ్గరగా వెళ్ళాను. నా రాకను అతను గుర్తించలేదు. పరిసరాల్ని మర్చిపోయాడు. కీచుగొంతుతో పాట మెల్లిగా విన్పించసాగింది.

దిడ్లకెల్లి పొద్దు జూసీరట వాల్లు దుబ్బ తాల్ల తొవ్వ పట్టీరట
దుబ్బతాల్ల తొవ్వ పట్టీరట వాల్లు జుట్టుకు లొట్టెడు తాగీరట
జుట్టుకు లొట్టెడు తాగీరట వాల్లు బక్క గొర్ల జాడపట్టీరట
బక్కగొర్ల జాడ పట్టీరట వాల్లు పావులకో యాటదెచ్చీరట
పావులకో యాట దెచ్చీరట వాల్లు ముబ్బాడకో పోగు ఏసీరట
ముబ్బాడకో పోగు ఏసీరట వాల్లు పెద్దశాల పోగు తప్పీరట

పెదాలకు పదాలకు పొంతన పోతుంది. రాగం ఖూనీ అవుతుంది. అయినా అతడు లో గొంతుకతో పాడుతూనే ఉన్నాడు.

పెద్దశాల పోగు తప్పీరట వాల్లు ల్యాక బద్దాలన్నీ గుంజీరట
ల్యాక బద్దాలన్నీ గుంజీరట వాల్లు దోనుగు మొద్దూ గుంజీరట

అతని గొంతు పూడుకుపోయింది. రెప్పలు వాలిపోయాయి. మత్తు మనిషిని పూర్తిగా ఆక్రమించింది. పాటలో యుద్ధం మొదలయ్యేసరికి, అతను అచేతనలోకి జారిపోయాడు. యుద్ధం తాలూకు క్రమం, ఫలితం పట్ల నాకు ఆసక్తి పెరిగింది. తెలుసుకొనే దారిలేక, నా దారి నేను పట్టాను.

* * *

"తీర్థం పెట్టండి" భక్తి ప్రపత్తులతో భక్తజనం

"అకాల మృత్యుహరణం, సర్వ వ్యాధి నివారణం
సమస్త పాపహరణం, శ్రీ విష్ణు పాదోదకం
పావనం – శుభం"

శ్లోకం చదువుతూ అయ్యవారు తీర్థం పెట్టసాగాడు.

"అయ్యగారు ప్రసాదం పెట్టండి"

"అరె! ఆగుండ్రి, మీదపడుతరా, పెట్టెదాక ఆగర, మడి ముట్టుకోకుండ్రి"

అందరికంటే ముందు వచ్చి తీర్థప్రసాదాలు తీసుకొని గుడి ముందున కూర్చున్న నేను అయ్యగారి అరుపుకు వెనుదిరిగి చూశాను. పిల్లలు, పెద్దలు గుంపులుగా ఉన్నారు. అందరికీ తీర్థప్రసాదాలు అందుతున్నాయి.

ఠంగ్... ఠంగ్.... ఠంగ్... గుడిగంటలు మోగుతున్నాయి.

వెళ్ళాలని నిలిచాను. గుడిలో మూల విగ్రహానికి దగ్గరగా, అయ్యవారి పక్కగా అతను. అతడే... పాటగాడు. కలవాలనిపించి ఆగిపోయాను. మెల్లమెల్లగా భక్తులందరూ వెళ్ళిపోయారు. అతను భార్యతో సహా గుళ్ళో కాస్త దూరంగా కూర్చున్నాడు. పూజారి ప్రసాదం వాళ్ళకిచ్చాడు. అతనికి, పూజారికి పరిచయం ఉన్నట్లుంది. వారికి కాస్త దూరంలో పూజారి కూర్చున్నాడు. నాకు పాట జ్ఞాపకం వచ్చింది. పాట కోసం, పరిచయం కోసం అతనికి దగ్గరగా వెళ్ళాను. వాళ్ళ మాటలు వినపడుతున్నాయి.

"నా గాచారం ఎట్లుందయ్యగారూ!"

"నువ్వు తాగుడు బంద్ చేసేదాక నీకు మంచిగుండది" భార్య సమాధానం.

"గ్రహచారానిదేముందిరా. ముందు నీవు చెడు అలవాట్లకు దూరంగా ఉండు."

"తాగుడు, తినుడు మా కులంల ఎన్కటి నుంచి వత్తున్నయి. తాగకపోతె తప్పు"

"ఎన్కటి రోజులు కాదు, ఎన్కటి సంపాదన కాదు. రోజులు ఎట్లుంటె అట్ల నడుచుకోవాలె"

"ఉన్న ఊర్లె పనిలేకపాయె. పొరుగూరికి పోయి వ్యాపారంల నష్టపోతి. అప్పుల పాలైతి. ఏం చేయమంటరు.'

"నీ కులకశ్వి చేసుకో"

"పనెక్కడిదయ్యగారు. ఇదివరకు ఒక్క మగ్గం మీద ముగ్గురికి పని దొరికేది. ఇప్పుడు మరమగ్గాలు వచ్చినయి. ప్రతి ఐదు మగ్గాలకు ఒకరికి మాత్రమే పని ఉంటుంది. మిగతా పధ్నాలుగు మంది గతేం కావాలె. వయసు పోరగాండ్లయితె ఈ పనిలకే వత్తలేరు. ఈ పని చేసెటోనికి మాత్రం ఏం ముదుతుంది. మహా అయితే నెలకు 1500 రూ॥లు సంపాయిస్తే ఎక్కువ. ఈ సంపాదనల కూడు, గుడ్డ, సదువులు అన్ని ఎల్లదీసుకోవాలె. పండగొచ్చినా, పానం మంచిగ లేకున్నా అప్పులు తెచ్చుకొనుడు, వాటికి వడ్డీలు కట్టుడు ఎప్పుడు ఉన్నదేనాయె. వ్యాపారంల దెబ్బతిని 30,000 రూ॥లు బాకిపడ్డ. ఎట్లదేర్పాలె. ఇద్దరు ఆడిపోరగాండ్లు గుండెల మీద కుంపటోలె ఉన్నరు. నా భార్య కూలికి పోయినా, నేను మగ్గం నేసినా నెల ఎల్లుడు కష్టమయితుంది. ప్రతి రోజు పని దొరుకుతదని గ్యారెంటీ లేదు. నూలు దొరకక కొంత, కరెంట్ కోత వల్ల పనిగంటలు తగ్గి కొంత, పని దొరుకుడు లేదు. ఈ సంసారం చేసుడు నా వల్లకాదు. సప్పుడు సేయక సత్తె అయిపోతది."

"ఆత్మహత్య మహాపాపం"

"అందర్ని గోసపుచ్చుకునుడు మంచిదా"

"నువ్వు చస్తే మా గతి ఏం కావాలె"

"ఇంట్లో కాని, బయట కాని మీరు ఇట్ల అనుకోవద్దు. పిల్లలు వింటే దీని ప్రభావం వాళ్ళ మనసుల మీద పడుతది."

"పిల్లలు పుట్టలేదని ఎన్నో ఊర్లు తిరిగినం. ఎందరో దేవుళ్ళకు మొక్కినం. ఆఖరుకు ఈ దేవునికి మొక్కులు కడితె పుట్టిరి. అసొంటోల్ల మీద మాకు పావురం ఉండదా! కాని వాల్లే ఇపుడు మాకు బరువు అనిపిత్తుండ్రు. పెద్ద పొల్లకు ఇంటి ఎవారం అంత తెలుసు. పొలగాండ్లు గోవులసంటోల్లు. ఏది పెడితే అది తింటరు. పంటరు."

"మీద తదాస్తు దేవతలుంటారు. ఊకె సత్త, సత్త అని అనకుమని చెప్పయ్యగారు."

"ఏ మనిషికైనా చావాలని కోరిక ఉండదు. కంటినిండా పైస కనపడుతది. కాని చేతికందది. తినడానికి తిండి, కట్టడానికి బట్ట కొరత లేదు. కాని అవి మనకు అందుబాటులో లేవు. అందుకోసం బాధ. అట్లని బాధ పడుకుంట కూర్చుంటె రోజులు గడువయి గదా. ధైర్యంగా ఉండాలె."

"పూజారి అంకుల్ తీర్థం పెట్టవా" ఒక కాన్వెంట్ పాప.

పూజారి లేచి వెళ్ళాడు. యాతన పడుతున్న అతణ్ణి పాట కోసం పరిచయం చేసుకోవాలనిపించలేదు.

* * *

ఒళ్ళంతా నొప్పులు. శరీర భాగాలన్నిటిని విరిచి అతుకుపెట్టినట్లుగా బాధ. మొదటి రోజే కదా. డాక్టర్ దగ్గరకెందుకు అదే తగ్గుతుందనే భావన. రోడ్డు రోలర్ కింద కంకర నలుగుతున్న చప్పుడు మోకాళ్ళలో ధ్వనిస్తుంది. మడమల్లో సూదులు దించిన అనుభూతి. రాత్రి వరకు జ్వరం నన్ను ఆక్రమించింది. అదే రాత్రి ఫోన్ ద్వారా స్నేహితుడికి కబురందించాను. డాక్టర్ అన్ని పరీక్షలు చేశాడు. డెంగ్యూనేమోననే భయం. మనషులతో పాటుగా దోమలు అభివృద్ధి చెందాయి. అక్కడే ఉన్న సోఫాలో పడుకున్నాను. నా పక్కకు స్నేహితుడు. నా సోఫా వెనుకనే ఉన్న కుర్చీల్లో అనేకమంది రోగులు. నింపాదిగా మాట్లాడుకుంటున్నరు. మాటలు స్పష్టంగా వినపడుతున్నాయి. చెవులు వాటి పని అవి చేస్తున్నాయి.

"నువ్వు తాగుడు బంద్ చేయాల్రా"

...............................

"ఇన్ని రోగాలు పెట్టుకొని, తాగుడెందుకురా"

"పొద్దున తొమ్మిది నుంచి సాయంత్రం ఐదు గంటల వరకు మగ్గం మీద ఒక్క తీర్గ కూసొని పనిచేస్తే పెయ్యి నొప్పులు పెట్టదా. కీల్లు లూజ్‌గావా? పెయ్యి నొప్పుల బాధ, అప్పుల బాధ, సంసారం బాధ ఇవన్నీ మరవడానికి చెట్ల కింద కూసొని తాగుడు. కడుపుల పుండుకు ఇప్పటికే పదివేల దాక పోసిన. మొత్తం నలభైవేల అప్పు ఉంది.

"డాక్టర్ చెప్పినట్లు మొదట్లనే ఆపరేషన్ చేయించుకుంటే అయిపోవు. ఇనకపోతివి."

"అంగి ఇడిత్తె బొక్కలు కనపడ్డట్లు, కడుపు చీరితే కనపడేటియి పేగులు కాదు, బాధలు.

కడుపు చీరిపిచ్చుకొని పంటె, పొంటె ఎట్ల గడవాలె? అయినా ఒక్కసారికి కుప్పలు ఎక్కడ దొరకాలె"

"నువ్వు ఎప్పుడన్న మంచిగ మాట్లాడినవా. ఎప్పుడు ఏడుపుగొట్టు మాటలె చెబుతవు."

"తక్కువ సంపాదన, ధరల పెరుగుడు, మంచి తిండి లేకపోవుడు, ఇవన్నీటి తోటి కాదా ఈ ఇబ్బందులు. ఇవి ఏడుపుగొట్టు మాటలెట్లయితయి.

సహేతుకంగా సాగుతున్న సంభాషణలు నాలో సహనాన్ని పెంచాయి.

ఓపికతో లేచి వారివైపు చూశాను. ఆశ్చర్యం. ఆ రోగి "అతనే". అతనితో పరిచయం కోసం లేచాను.

"మీరు పద్మశాలీలా" ముచ్చట మొదలుపెట్టాను.

"అవును"

"మీ కులపోళ్ళు చాలామంది ఆత్మహత్య చేసుకుంటున్నారు. చాలా బాధాకరం. ఒక్కమాట అంట. కోపానికి రావద్దు. మీరంతా సాంప్రదాయ సోమరులు. కొత్త డిజైనులు చేయలేరు. ప్రభుత్వ దయపైన బతుకుతున్నరు. ముందు మీరందరు పవర్‌లూమ్ రంగంలోకి మారండి. అప్పుడు బాగుపడతరు" ఆవేశంగా అన్నాను.

ఒక్క క్షణం మా మధ్య నిశ్శబ్దం రాజ్యమేలింది. నా వల్ల మా మొదటి పరిచయం పోట్లాటతో మొదలయినట్లయింది. నాలో గూడు కట్టుకున్న నిప్పు చల్లారినట్లనిపించింది.

"నువ్వు ఎవలవో కని మంచిగ మాట్లాడినవు. చేనేత బతుకుల గురించి నీకు జరంత తెలిసినట్లున్నది. అయితే పూర్తిగా నేను చెబుత. మరమగ్గం మీద నేసిన బట్టను, చేనేత బట్టగా చూపెట్టి అమ్ముకోవడం సోమరితనమా? నాగరికతనా? చే మగ్గం మీది బట్ట అత్యంత ఖరీదుగా మారి అందుబాటులో లేకపోవడానికి కారణం ఎవరు? సిరిసిల్ల ఆత్మహత్యల్లో మరమగ్గం కార్మికులు ఎంతమందున్నరో నీకు తెలుసా? బయటి దేశాల నుండి వచ్చే బట్ట అగ్గువకు దొరుకుతుంది. బయటి మాలును జనం కొంటున్నరు. ఎవర్ని మెప్పించడానికి సర్కారు బయటి బట్టను దేశంలకు తీసుకొచ్చింది? ఉన్నోనికి, లేనోనికి మధ్య వ్యాపారంల పోటీ ఎటు దారితీస్తదో తెల్వదా? ఆవులావులు కొట్టుకుంటె ల్యాగల కాల్లు ఇరిగినయట. మా బతుకు గట్లయింది. బయటి బట్టను కాలవెట్టడానికి ఒక్క గాంధీ సుత లేకపాయె. నీ మాటల్ల కోపం ఉంది. కోపం ఎనుక బాధ ఉంది. అది నాకు కనపడ్డది. కనపడేదంతా నిజం కాదు. చేనేత కార్మికులు చావడానికి చాలా కారణాలున్నాయి."

ఇంతలోనే పాథాలాజికల్ లాబ్ నుండి నా రిజల్ట్స్ రావడంతో అవి తీసుకొని డాక్టర్ రూమ్‌లో కెళ్ళాము. అతని ప్రశ్నలు వేధిస్తుండగా డాక్టర్ ముందు కూర్చున్నాను. డాక్టర్ రూం నుండి బయటికొచ్చేసరికి అతను లేడు. అన్యమనస్కంగా, అచేతనంగా స్నేహితుడు వెంటరాగా ఇంటికి బయల్దేరాను.

* * *

బడిలో చివరి గంట మోగింది. పిల్లలతో పాటు పెద్దలు ఉత్సాహంగా బయటికొచ్చారు. రెండు నిమిషాల్లో బడి బోసిపోయింది. బయల్దేరే ముందు బడి ఆవరణలోని చెట్లను చూస్తున్నాను.

"నమస్తే సార్"

"ఎటొచ్చినవు"

"నా చిన్న బిడ్డ దీంట్లనే పదోది సదువుతుంది"

"మరి ఎన్నడు కనపడలేదు"

"ఎప్పుడన్న అక్కరపడితే నా భార్య వస్తది"

"ఇప్పుడెందుకచ్చినవి"

"నేను ఇంటికాన్నె ఉన్న. బిడ్డ ఇంక ఇంటికి రాలేదని వచ్చిన"

"ఇంటి దగ్గర ఎందుకున్నవు"

"ఆపరేషన్ చేయించుకున్న. ఇంక పది రోజుల్దాక పనికి పోవద్దట. నా భార్య పనికి పోయింది"

"ఆపరేషన్‌కు ఎంత ఖర్చు అయింది"

"దావఖాన్ల నుంచి ఇంటికొచ్చేటాలకు పదిహేను వేలు అయింది"

"పైసలెల్లినయా మరి"

"ఇల్లమ్మిన. ఇదివరకే నలభైవేల అప్పుండె. మల్ల ఎవలిత్తరు. అన్నిపోంగ ఇరవై వేలు మిగిలినయి. ఇద్దరు ఆడ పోరగాండ్లు మిగిలిండ్రు"

"నువ్వు పాటలు మంచిగ పాడ్తవు గద"

"నాకు పాటలు రావు. తాగిన యాల్ల ఏం పాడుతనో ఏందో"

"తాగుడు బంద్ చేయలేదా"

"పనికి పోతలేను కదా, తాగుత లేను"

"ఆత్మహత్య చేసుకొన్న కార్మికుల్లో చాలామంది తాగుడుకు బానిసలైనవారే"

"తప్పు సార్. చచ్చినోల్లందరి చరిత్ర నాకు తెలుసు. కరెంట్ ఛార్జీలతో రాయితీల అమలు కాలేదు. పైగా అదనపు ఛార్జీల వసూలు, కరెంట్ కోత అమలైంది. దాంతో పనులు దొరకక కార్మికులు అప్పుల పాలైండ్రు. కుటుంబాలకు కుటుంబాలే ఆత్మహత్య చేసుకున్నరు"

"మీరు ఏం చేస్తే ఆత్మహత్యలు ఆపుతరో చెబుతవా"

"ప్రభుత్వ పథకాలు నేరుగా కార్మికునికి అందేటట్లుగ ఉండాలె. కూలి రేట్లు పెంచాలె. చేనేత పార్కులు ఏర్పాటు చేయాలె. ఇంక చాల ఉన్నాయి. నువ్వు, నేను అనుకుంటే అయితదా, మొసలి నోట్లె పడ్డ ఏనుగు కాలసొంటిది మా బతుకు. ఎవడో దేవుడు రావాలె. ఇయ్యాల రేపు దేవుల్లు ఎవలున్నరు?"

"బాపూ! ఎటుపోయినవు" అంటూ కూతురు ఎదురైంది.

"సార్, మీ ఇల్లు ఎక్కడ"

"గుడి దగ్గర"

"రేపు గుల్లె పూజలుంటయి. రాండ్రి. ఇగ నేను పోత" అంటూ వెళ్ళిపోయాడు.



* * *

శ్రావణ పూర్ణిమ. రాఖీ పండుగ. ఐచ్ఛిక సెలవు. మా ఇంటి దగ్గరున్న మార్కండేయుని గుడిలో పెద్ద ఎత్తున కార్యక్రమాలు జరుగుతున్నాయి. స్వచ్ఛంద సంస్థవారు ప్రతి ఒకరికి రాఖీలు కడుతున్నారు. సంస్థ సభ్యుడిగా నేను కార్యక్రమములో పాలుపంచుకున్నాను. అప్పటికే మా వాడకు చెందిన పద్మశాలీలు వచ్చి కూర్చున్నారు. ఆలయ పూజారి మార్కండేయ పూజ చేశాక యజ్ఞం నిర్వహించాడు. గాయత్రీ మంత్రోచ్ఛాటనల మధ్య పద్మశాలీలందరూ జంధ్యాలు వేసుకుంటున్నారు. నేను మాత్రం చివర కూర్చొని జరుగుతున్న తంతు చూస్తూ ఉన్నాను. నా పక్కనే కూర్చున్న వీరయ్య అనే వృద్ధుణ్ణి కదిలించాను.

"తాతా! ఆ పూజారిది ఏ కులం"

"పద్మశాలి"

"మీ కులపోళ్ళు పౌరోహిత్యం చేస్తరా?"

"మేము పద్మబ్రాహ్మలం. అయితే పౌరోహిత్యంలో వ్యాప్తి చెందలేదు. వస్త్రాలు నేయుటకే పరిమితమైనాము."

"పౌరోహిత్యాన్నే ప్రధాన వృత్తిగా ఎందుకు ఎంచుకోలేదు"

"మహర్షీణాంభృగురహమ్" అని శ్రీకృష్ణుడు చెప్పుకున్నాడు. అట్టి భృగువు మా మూలపురుషుడు. మృకండుని కుమారుడు మార్కండేయుడు. మార్కండేయ మహర్షి అనుగ్రహం చేత భావనా ఋషి యజ్ఞగుండం నుండి ఉదయించాడు. భావన ఋషి శ్రీహరి వద్ద నుండి మొదటిసారిగా నూలు తీసుకొని వస్త్రం తయారుచేశాడు. ప్రపంచానికి వస్త్రాన్ని అందించాడు. భృగుసూత్ర, ఋషి వంశజులమైన మేము పద్మబ్రాహ్మలం. పద్మశాలి, నేతకాని, నీలకంఠ, సాధనాసుర, కూనపులి అను ఐదు కులాలు కలిసి పద్మబ్రాహ్మలుగా పిలవబడ్డాం. అందులో పద్మశాలీలు పౌరోహిత్య, యజ్ఞయాగాది కర్మకాండలను చేయగల సమర్థులు. వస్త్ర తయారీ వల్ల సమయము చాలక, సత్కర్మలాచరించలేక, ముక్తి కోసం మిగతా కులాల నాశ్రయించవలసి వచ్చింది. అప్పుడే వారికంటే కింది వారమైనాము. ఆ విధంగా పౌరోహిత్యం మా చేతిలో నుండి పోయినది. "కూనపులులు", "సాధనాసురులు" మా ఉపకులాల వారు. వారిని సత్కరించి బతుకునిచ్చిన మేము, ఈ రోజు బతకడానికి కష్టపడుతున్నాం.

"మరి దానికి కారణం ఏంది?"

"బాగా తెలివి పెరిగింది. నలుగురి కోసం ఒక్కడు కాక, ఒక్కని కోసం నలుగురు అనే కాలం వచ్చింది."

పూజా కార్యక్రమాలు అయినట్లున్నవి. ఒక్కొక్కరే లేస్తున్నారు. ఇంతలో గుడి వెనుక వీధిలో నుండి ఏడుపులు వినిపించాయి. అందరితో బాటు నేను అటువైపు వెళ్ళాను. మరొకసారి చేనేత కార్మికుడి చావు కళ్ళారా జూశాను. ఎవరా అని దగ్గరగా వెళ్ళాను. అతనే... తలలో సునామీ రేగింది. ఎన్నో ప్రశ్నలు. ఒకదాని వెనుక ఒకటి, ఒక్కసారిగా అన్నీ వచ్చి తాకాయి. నిలవలేక ప్రక్కనే ఉన్న రాతిపై కూలబడిపోయాను. పోలీసు జీపు వచ్చి వాలింది. వారి కంటే ముందుగానే ప్రెస్ క్లిక్ మంది. పోస్టుమార్టమ్ కోసం అతణ్ణి తీసుకెళ్ళారు. అతను రాసిన ఉత్తరం, మరణవాంగ్మూలమైంది. జర్నలిస్టు మిత్రుని సహకారంతో ఉత్తరం నకలు సంపాదించి చదువసాగాను.

**భార్య నాగవ్వకు,**

చెప్పేదేమంటే, ఈ మధ్యన నాకు పానం మంచిగ ఉంటలేదనే సంగతి నీకెరుకె. దమ్ము, దగ్గుతోటి అవస్థయితుంది. మగ్గం నేసెటోల్లకు ఉల్లి తోటి శ్వాస సంబంధమైన దమ్ము, దగ్గు వస్తదని అందరికీ తెలిసిందే. అది ముదిరి టీబీకి దారి జూపుతదట. గుట్టకిందోనికి గట్లనే అయింది. నా సంగతి కూడ గట్లనే అయేతట్టు ఉంది. డాక్టరు కూడా చెప్పిండు. ఇల్లమ్మిన పైసలు అన్నీ ఊడ్చినట్లు అయిపోయినవి. పెద్ద పొల్లకు కుదిరిన సంబంధం కట్నం కాడ ఎత్తిపాయె. ఇగ నేను పని చేసి సంపాయించుడు కల్ల. నేను బతికుంటె మీకు భారం అవుడే తప్ప ఇంకోటి లేదు. నేను నైట్రోట్ సోడా తాగి సచ్చిపోతున్నా. నా చావుకు ఎవరు బాధ్యులు కాదు. నా సావుకు దయతలచి సర్కారు ఏమన్న పైసలిత్తె. ఆ పైసల తోటి పెద్ద పొల్లకు లగ్గం చెయ్యి. మీ అందరికి అన్యాయం చేత్తున్న అని తెలుసు. కాని బతికుంటే ఇంతకంటె ఎక్కువ అన్యాయం అయితం. మనసొంటి నేత కార్మికులకు వచ్చేది కట్టగాలం. బతుకుడు కట్టం. మధ్య వచ్చినోన్ని మధ్యలనే పోతన్న. నన్ను మన్నించు.

నీ భర్త
**పరంధాములు**

చదవడం పూర్తికాగానే, నా తలలో కలిగిన ఖాళీలో సుడిగాలి సుళ్ళు తిరగసాగింది. కార్య - కారణాలు, ప్రశ్న - జవాబులు, భూత - వర్తమానాలు, ఆకుల్లాగ ఆ గాలిలో ఎగరసాగాయి.

"ఒకరిద్దరు ఆత్మహత్య చేసుకుంటె, వ్యక్తిగత కారణాలని సరిపెట్టుకొనేవాళ్ళం. కాని చాలామంది చావులు, ఏదో ఒక సత్యాన్ని చెపుతున్నట్లనిపిస్తుంది" జర్నలిస్టు మిత్రుని సందేహం.

"అవును నిజమే" పొడిపొడిగా నా సమాధానం.

"ఏమై ఉంటుందని నీ ఊహ"

"ఈ చావులకు మూలాలు చరిత్రలో కనిపిస్తున్నాయి. పద్దెనిమిదవ శతాబ్దం మధ్యభాగంలో పారిశ్రామిక విప్లవం మొదలయింది. నేత పరిశ్రమలో మొట్టమొదట యంత్రం ప్రవేశించింది. అందువల్ల నూలు ఎక్కువ కావలసి వచ్చింది. అందుకోసం స్పిన్నింగ్ జెన్నీ లాంటి యంత్రాలు కనిపెట్టారు. 1785లో కార్ట్‌రైట్ కనుగొన్న మరమగ్గంతో నూలు, ఉన్ని, పట్టు పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. ఆ అభివృద్ధి నమూనా 1912 కల్లా చేనేతకు పుట్టినిల్లయిన భారతదేశంలో, నేతకారుల చేనేత మగ్గం పుట్టి ముంచుటకు తయారయింది. పారిశ్రామిక విప్లవం చేనేత రంగాన్ని ఉగ్గుపాలతో తొక్కేసింది. మిల్లు, మరమగ్గాల వీరంగంతో చేనేత మగ్గాలు అటకెక్కుతున్నాయి. వస్త్ర ఉత్పత్తిలో సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి వలన, కార్మికుల జీవనం అతలాకుతలం అయింది. ఉపాధి కోల్పోయిన కార్మికుల్లో అనేకమంది తినడానికి తిండి లేక ఆకలి చావుకు గురి అవుతున్నారు. మరికొందరు బాధలు పడలేక భవిష్యత్ అగమ్యగోచరమై ఆత్మహత్యలు చేసుకుంటున్నారు."

"స్థల, కాలాల స్పృహ లేని వ్యాపార దృష్టి వల్ల కలిగిన అనర్థం ఇది" జర్నలిస్టు మిత్రుని ఆవేదన.

"అనాదిగా పద్మశాలీల వికాసానికి దోహదపడ్డ నూలుపోగు ఈ రోజు ఉరితాడై వారి పతనాన్ని శాసిస్తుంది" అంటూ ఇంటి దారి పట్టాను.

*

---



# మాయమైన మౌనగీతం

డాక్టర్ వి.ఆర్. రాసాని

పాట ప్రవహించే రక్తం
పలవరించే పడుచుదాని పచ్చి ఊహ
నడకలు నేర్చిన బాల్యం
తల్లి వడిలో వెచ్చదనం పాట
ప్రేయసి కౌగిలిలో కరిగిపోయే యవ్వనం
ఉడిగిన మనసుకు ఊతం పాట
బక్కజీవుల బాధల గాథల్లో
పసిపాపల పలుకుల్లో
కన్నె పిల్లల కులుకుల్లో
కునారిల్లిన పాట
కార్పొరేట్ కాంక్రీటులకు
తల్లకిందులుగా వ్రేలాడే దబిసిపిట్ట
వరుని కన్నవారి వడిముల్లెలో అయింది
బందీ
గుడ్డి ఊహల్లో పంచవన్నెల ప్రపంచం పాట
ఒక వీరుని గొంతులో హత్య చేయబడి
వేల వీరుల నాదతంత్రులపై నర్తించే భావం
పాట
జీవాలతో నేస్తం కట్టి
అడవిలో అల్లాడి పగిలిపోయిన మురళిపాట
పల్లె పడుచుల పాదాల కిందబడి
బురదలో కూరుకుపోయి
పైరు కంకుల సుంకుగా తేలిన పాట
విసరాత్రి విసవిసల్లో విరగబడి
రోకటి పోటుల రోళ్ళలో దంచబడి
కపిల గొడ్ల కొమ్ముల్ని గుండెల్లో గ్రుచ్చుకొని
నిలువెల్లా గాయమైన గేయమై పోయింది
పాలధేనువుల మెడ పట్టీ గంటల్లో
గణగణపాట
బీడు బారిన గుండెల పగుళ్ళలో
చవుడు దేలిన నేల పర్రుల్లో
ఇంకిపోయిన పాట
రైతు కళ్ళల్లో పొంగిన పాతాళ గంగ
తాళం తప్పిన కళాకారుని కీర్తన
పోగు తెగిన మగ్గం పాట
పిల్ల పడకేసిన కొలిమి
భ్రమణం మరచిన సారె
ఉబ్బలో ఉడకని శిథిలశాటి పాటి
విరిగిన ఆరె
పగిలిన పలక
తెగిన వట్టిడోలు డొల్ల
నాదం చెదరిన సన్నాయి
ఋణ వటకుటజానికి వ్రేలాడే శవం పాట
మనిషి నీడగా ఊహలవాడగా
మనిషితో బాటు మనుగడ సాగించిన పాట
విద్యుద్దీపాల వెలవెలల్లో
మరమిషన్ల గరగరల్లో
పొగచూరి చూర్ణమై
గాలిలో కలిసిపోయింది
ఆకాశ రణ క్షేత్రంలో... తల తెగి
అణువుగా మారి
విషధూమాల బారినపడి
తమోనిల తోపుల మాటున
ఎటో మాయమై పోయింది
బలిభుక్కులు బలిసిన ఈ గడ్డపైన
ఎన్ని కోకిలలు పిలిస్తే మాత్రం
ఇక తిరిగొస్తుందా పాట?

# నానీలు

ఎం. నారాయణశర్మ




ధర్మదేవతకు
గంతలే నయం
అధర్మం వెక్కిరింతకు
బావురుమనేది

బొమ్మలకి
రంగులద్దాడు
రంగు వెలిసిన
బొమ్మగా మిగిలాడు

కొత్త పుస్తకాన్ని
పట్టుకున్నాను
పసిపిల్లాడ్ని
ఎత్తుకున్నంత సంతోషం

దేవుడిచ్చిన
ప్రసాదం దొరికింది
దరిద్రం
విడిచి వెళుతుందా?!

ఆకాశంలో
దూదిమేడల్లా మేఘాలు
ఎంత చూసినా
కళ్ళకెత్తలేరి

# "దీర్ఘాక్షరం"



జ్వాలాముఖి

పుస్తకానికి జన్మనిచ్చిన జ్ఞానం
ప్రకృతి పోరాటంలో పదునెక్కిన ఏకాగ్రత
మనుగడ మహాప్రస్థానంలో చరిత్ర గతి
గతి తర్కం గమనించిన కార్యకారణం

గుణపాఠాల గుణింతంలో
అక్షర అనుసంధానమే లిపి
అనుభవాల ఆరాటమే అభివ్యక్తి,
నుడికార మమకారమే జనభాష

చెదిరిన గాథలు చెలరేగిన బాధలు
సాహితీ సంతతి సంస్కార గీతలు

ఎన్నో భాషలు ఎన్నెన్నో భావాలు
కలిసిన చోట సహజీవన సాంగత్యాలు
బెడిసిన చోట వేరుయాసల వికారాలు
వైరుధ్యాల సమాజంలో విభక్తుల విరోధాలు

ఉనికి పోరాటాల ఆదిమ సమాజం చరిత్ర
మనిషి ఆరాటాల భావావేశం కవిత
చరిత్ర మేలు కొలుపులు పాడిన సాహిత్యం
వైతాళిక పాత్రలో చరిత్రకారుని చేవ్రాలు

మనిషినతిక్రమించిన పవిత్ర పుస్తకం
జిజ్ఞాసను చంపి అజ్ఞానాన్ని పెంచింది
గతాన్ని మోసిన వర్తమానం, భవిష్యత్తు కాలేదు
విశ్వాసానికీ, విజ్ఞతకూ ఎడతెగని పోరాటం

మతం హేతువును భూస్థాపితం చేసినా
భూపరిభ్రమణ నిత్య సత్యం భగ్గుమంది
ఆత్మప్రదక్షిణలో జ్ఞానోదయం
మూయని అంతరిక్ష చక్షువు

సూర్యుని చుట్టూ తిరిగే సౌర కుటుంబం
వసుధైక కుటుంబానికి ప్రేరణ
బల్లపరుపు పుక్కిటి పురాణం బద్దలై
భూగోళ ప్రత్యక్ష ప్రమాణం చూసింది
పరిణామ సిద్ధాంత ప్రవక్తగా పుస్తకం
నిజాల నిప్పులు తొక్కి వేకువ చాటింది

అభూత కల్పనల అనంత సృష్టిలో మనిషి ముష్టి కాదు
జీవ పరిణామ సంఘర్షణలో ప్రాణం నిత్య వికాసం
కట్టుకథల పుట్టలో కర్మ సిద్ధాంతం వేయి పడగల ఆసామి
సంపూర్ణ సూర్యగ్రహణం వీడాక పునర్జన్మ తగులబడింది

అక్షరాన్ని అణచజూచిన అజ్ఞానం
విజ్ఞాన విస్ఫోటనలో కుప్పలా కూలింది
జ్ఞాన కిరీటంగా వెలుగు వెలిగిన పుస్తకం
కష్టజీవుల భూపోరాటాలకు మకుటమైంది

తాళపత్రాలైనా తోలు వస్త్రాలైనా
శిలాఫలకాలైనా తాబేటి చిప్పలైనా
వెదురు బొంగులైనా తొడ ఎముకలైనా
రాగి రేకులైనా లోహ చెక్కడాలైనా
అక్షరం అంతటా శిల్ప రూప సాక్షాత్కారం
అభివ్యక్తి అంతటా అస్తిత్వ అకాంక్ష

లాభనష్టాల గణితంలో మనిషి 'శూన్యం'కాగా
'ఎరుక', చీకటి అఖాతంలోకి గాలంలా దిగి
'అదనపు విలువ'ను అమాంతంగా పైకి లాగి
'శ్రమ విలువ'కు ఖరీదు కట్టే షరాబుల్ని పట్టుకుంది –

పుస్తకం, యుగయుగాల జ్ఞాన సంచయం
పుస్తకం, పరిపూర్ణపు బతుకునిచ్చే సంజీవిని
నాగరికత, పోరాడి సాధించిన ఆలోచనల సంపుటి
సంస్కృతి నిర్వచనాల అనుభవ వైభవం

పుస్తకం, పారిశ్రామిక విప్లవం కన్నబిడ్డ
పుస్తకం, కార్మిక విప్లవం పోతుగడ్డ
"ప్రపంచాన్ని కదిలించిన పదిరోజుల పుస్తకం"
"మ్యానిఫెస్టో"గా నిలిచిన లక్ష్య లక్షణ చైతన్యం

రాజులు రారాజులు రాజ మార్తాండులు గండరగండలు
పుస్తకాన్ని బలవంతంగా, అంతఃపురాలకు లాక్కెళ్ళారు
ఏకాంత సేవలో "భోగినీ దండకం" రుచి చూశారు
రస నిష్పత్తిలో రాక్షస ప్రవృత్తిని రంగరించారు
శృంగారంలో నిండా మునిగిన రసలుబ్ధుల్ని
సంస్కారంలో పుటం పెట్టాయి శతక నీతులు

సన్యాసులు పుస్తకాన్ని శ్మశాన వైరాగ్యం చేశారు
'నిష్కామకర్మ'లో బ్రహ్మానందాన్ని చవిచూశారు
'కర్మయోగాన్ని' నమ్మిన నిత్య సత్య కర్మవీరులు
పుస్తకాన్ని ధర్మపోరాటం చేసి చూపారు
పుస్తకం చావుపుటకల విభజన గీత
పుస్తకం బతుకు పోరాటాల మహాభాష్యం

రమణీయ శాకుంతలం రస నిష్పత్తి కన్నా
రాజకీయ 'మృచ్ఛకటికం' ప్రజల పతాక సన్నివేశం
తిరుగుబాటు అర్థ గౌరవాన్ని చాటుతూనే వుంది
విప్లవాల భవిష్యద్దర్శనాలు పుస్తక ప్రపంచాలు

వాల్మీకీ వ్యాసుడు శూద్రకుడు భారవి
లోకానికి అక్షరమిచ్చి అక్షరానికి చక్షువునిచ్చారు
రసానుభూతిలో రాజకీయాలు రాజుకున్నాయి

సామాజిక సంఘర్షణలో సాహిత్యం ధర్మ పక్షపాతి
ప్రక్షిప్తాలు నిక్షిప్తాలు గ్రంథసాంగుల వికృతాలు
మధ్యయుగాల రాగద్వేషాలు విరోధాభాసాలు
రాచరికాల దుర్మార్గాలు పాలకవర్గాల కుటిల నీతులు
బింబ ప్రతిబింబాలై దర్పణాన్ని శాసించాయి

టాల్‌స్టాయ్ గోర్కీ ఠాగూర్ శరత్
ప్రేమ్‌చంద్, మగ్దూం, గురజాడ, శ్రీశ్రీ
యుద్ధమూ శాంతి అమ్మ గీతాంజలి
గోదాన్ శేష ప్రశ్న తోకచుక్క మహాప్రస్థానం
సుర్ఖ్ సవేరా, దేఖ్ కబీరా, విశ్వదాభిరామ
గాథానుభూతుల గాయాల్లో ప్రళయగాంధర్వం
ఇన్‌క్విలాబ్ జిందాబాద్! జీనాహైతో మర్నాసీఖో!

"ప్రజల చేత ప్రజల కొరకు ఏర్పడే
ప్రజల యొక్క ప్రజాస్వామ్యం...!"
ధనస్వామ్యమై నిలువు దోపిడీ చేసినా
'పచ్చి ప్రపంచీకరణ' అదనపు శిక్షగా
జీవితాన్ని లొంగదీసి కుంగదీసి సరుకు చేసినా
ప్రజల ప్రజాస్వామ్యాన్ని రాజేసేది యుగ పుస్తకం -

రాబందుల రాజ్యాన్ని నిలదీస్తే
దొంగ ప్రజాస్వామ్యాన్ని కూలదోస్తే
"రక్తాక్షరాలు" రాజకీయాల్ని తిరగరాస్తే
నిజాలు నిషిద్ధ పుస్తకాలై కారాగారం చేర్తాయి
ఉరికంబాలెక్కి ఉనికి పాటలు పాడతాయి -
నిషిద్ధాక్షరాలు నిశ్శబ్ద రహస్యోద్యమాలు
స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ఆకాంక్ష ఎప్పుడూ తిరుగుబాటే -

నిషేధాలు నిర్బంధాలు
చిత్రహింసలు అజ్ఞాతవధలు
చరిత్రగతిని ఆపలేవు
పుస్తకం కాలం కాపలాదారు -

పుస్తకాల్లో మనిషి పుస్తకాలు వేరు
మనిషిని 'బైఖాతా' చేసే దస్తరాలు వేరు
మనిషిని వస్తువును చేసే 'బుక్కీపింగ్'లు వేరు
బందీఖానాల చట్టాలు వేరు చుట్టాలు వేరు
ఉరి శిరస్సు చెప్పిన "రాజ్యాంగమూ - విప్లవము" వేరు
భగత్‌సింగ్ స్వప్నాలు వేరు 'ఐటీ-వాటాలు' వేరు
కరుణావీరాల్ని కొల్లగొట్టే బీభత్సాలు వేరు
వర్గ విభజనను ఆపజూపే అబద్ధాలు వేరు -

'ప్రపంచీకరణ' మాయావరణంలో
'పాట'కొచ్చిన దౌర్భాగ్యం మాతృభాష
మాయాజూదంలో పణం పద్ద పాంచాలి ఘోష
దళారి రాజ్యంలో తలారి నీతి శుక్ర నీతి -

పదహారచ్చులు రెండింతల హల్లులకు ప్రాణాలు
'ఉభయాక్షరాలే' మధ్యతరగతి చంచల ప్రమాణాలు
'అరసున్నలు' అడ్డం పడే శ్రాద్ధకర్మలు
'బండి రాలు' అజంత భాష పిరమిడ్లు
అచ్చుల్ని మచ్చిక చేసుకునే ఇంటి దొంగ
హల్లుల్ని ఆడించే కంప్యూటర్ మౌజ్

మారని రుతువులో అక్షర క్రతువులో
పుస్తకం హస్తవాసి అమృతం అంతేవాసి
అస్మదీయుల ఆశీర్వాదాల్ని
తస్మదీయుల తథాస్తుల్ని
పసిగడ్తూనే వుంది ప్రజల బతుకు పుస్తకం
అది పెద్ద ప్రజాస్వామ్యం పెద్ద బాలశిక్ష
తరతరాల అణచివేతల్ని మార్చే విముక్తి ఆకాంక్ష

ఇప్పుడు పుస్తకం త్రికాలదర్శిని
అవి హృదయ ఘోష బుద్ధి భాష
పృథ్వి సూక్తం మనిషి సుశ్లోకం
కంప్యూటర్ ఆట కట్టించే హస్తవాసి

# ఖమ్మం జిల్లాలో సాహితీ స్రవంతి ప్రస్థానం

**కె. ఆనందాచారి**

ఆరు వసంతాలు పూర్తి చేసుకుని నిరంతర చైతన్యంతో సాగిపోతున్న సాహితీ స్రవంతి ఖమ్మం జిల్లాలో ప్రగతిశీల సాహిత్య ప్రభావాన్ని కలిగించడంలో అగ్రభాగాన నిలిచింది. 1999లో ప్రారంభమైన స్రవంతి వైవిధ్యభరిత కార్యక్రమాలతో, వినూత్నమైన రీతిలో జిల్లాలో ఒక నూతన ఉత్సాహాన్ని నింపుతూ సాహితీ మిత్రులకు ఉత్తేజాన్ని అందించింది. కొత్తగా సాహిత్య సృజన చేస్తున్న వారికి ప్రేరణనిచ్చి ప్రోత్సహించింది. కలాలకు విశ్రాంతి నిచ్చి, వాతావరణ లేమితో నిరాసక్తతలో పడిపోయిన సాహితీ సృజన శీలురులను మరోమారు కదిలించింది. మొత్తంగా జిల్లాలో సాహిత్య ఉద్యమాల ఉనికిపోయి, వ్యక్తులుగా మిగిలి, స్తబ్దత పరుచుకున్న తరుణంలో సమష్టి సాహితీ ప్రయాణానికి ఒక ప్రారంభానిచ్చింది.

ఖమ్మం జిల్లాకున్న రాజకీయ, సామాజికోద్యమాల చారిత్రక నేపథ్యమూ, నేటికినీ చైతన్య ఉద్యమాలకు కేంద్రంగా ఉండటమూ, అభ్యుదయ సాహితీ వారసత్వమూ ఇక్కడ సాహితీ స్రవంతి ముందుకు పోవడానికి దోహదపడుతోంది.

**కార్యక్రమాలు :**

స్రవంతి కార్యక్రమాలు జిల్లా కేంద్రానికేకాక జిల్లాలోని వివిధ ప్రాంతాలలో ముఖ్యంగా భద్రాచలం, పాల్వంచ, కొత్తగూడెం, ఇల్లందు పట్టణాలలో కార్యక్రమాలు నిర్వహిస్తూ, స్థానిక బృందాలనూ చురుకైన కార్యకర్తలనూ కలిగి వుంది.

చేపట్టిన కార్యక్రమాలే రచయితలను, కార్యకర్తలను గుర్తించేట్లుగా చేసింది వారితో కొనసాగించుతున్న నిరంతర సంబంధాలు కార్యక్రమాల విజయవంతానికి కారణమవుతున్నది.

వైవిధ్యమైన కార్యక్రమాలు కూడా స్రవంతిని ఆకర్షించడానికి మరో కారణం. వేద సాహిత్యం నుండి కవిత్వం పుట్టుక - పరిణామంపై చర్చ మొదలుకొని బాల కవి సమ్మేళనాల వరకు నిర్వహించాము. గేయ రచయితలను సమీకరించి పాట పుట్టుక పరిణామంపై గోష్టి పాటల రచయితలను గుర్తించేందుకు తోడ్పడింది. తెలుగు సాహిత్యంపై అత్యధిక ప్రభావాన్ని కలిగించిన గురజాడ, శ్రీశ్రీ, ఆరుద్ర, జాషువ వర్థంతులు, జయంతుల సందర్భంగా వారి సాహిత్యంపై చర్చతోపాటు సమకాలీనత దాన్ని అన్వయించి వివరించే సదస్సుల నిర్వహణ అందరి ఆదరణకు పాత్రమైంది.

ఉగాది, దీపావళి, సంక్రాంతి, ఆగస్టు 15, జనవరి 26, మేడే సందర్భాలలో కవి సమ్మేళనాలు క్రమం తప్పకుండా జరుపుతున్నాము. అంతేకాక కాళోజి, ముల్కరాజ్ ఆనంద్, ఇస్మాయిల్ మొదలైన ప్రముఖ కవులు, రచయితలు మరణించినపుడు సంస్మరణ సభలూ పెట్టాం. ఖమ్మంలో ప్రతినెలా రెండవ శనివారం సమావేశమవుతూ వివిధ సాహిత్య అంశాలపై చర్చలు, కవితా పఠనాలు నిర్వహించాము.

ఇక జిల్లా స్థాయిలో కథ, కవితల పోటీలు నిర్వహించి రచయితల్లో ఉత్సాహాన్ని పెంచాము. కళాశాల విద్యార్థుల్లో నిబిడీకృతమైవుండే కవితాశక్తిని వెలికి తీసేందుకు జిల్లాలోని నలభై కళాశాలల్లో 'పొయెట్రీ బాక్సు'లు పెట్టి కవితల్ని ఆహ్వానించగా మూడు వందల కవితలు వచ్చాయి. ప్రతికళాశాలకు మూడు బహుమతుల చొప్పున వారందరినీ పిలిచి అందించాము. ఆ కవితల్లో వస్తువు ప్రధానంగా 'ప్రేమ', 'అమ్మ', 'కులమతతత్వాల'పై వ్యతిరేకత గురించి వున్నాయి. కళాశాల విద్యార్థులకు సాహితీ క్విజ్ నిర్వహించడం కూడా మంచి వాతావరణం కలిగించింది.

రాష్ట్రస్థాయి సాహిత్య ఉత్సవంగా నిర్వహించిన చేరా అభినందన సభ సాహితీ స్రవంతిపట్ల సద్భావాన్ని పెంచింది. ఈ సందర్భంగా భాషా సాహిత్యాలు సంస్కృతులపై చర్చ అందరినీ ఆలోచింపచేసింది. చక్కటి వ్యాసాలతో అభినందన సంచిక వెలువరించి ప్రశంసలు పొందాము.

కేవలం సభలు, చర్చలు, సమ్మేళనాలే కాక ప్రచురణలు కూడా చేపట్టింది. మొదటి వార్షికోత్సవం నాటికి ప్రపంచ ప్రఖ్యాత సాహిత్య విమర్శకుడు క్రిష్టఫర్ కాడ్వెల్ 'భ్రమ - వాస్తవం' పుస్తకాన్ని తెలుగులోకి తెచ్చింది. ఇంకా 'ఒక వేకువ కోసం', 'మరో సంగమం', 'మార్పు', 'భద్రాద్రి కలాలు', 'వేకువపిట్ట', 'అలవోకలు', 'నగారా', 'కన్నీళ్ళను పంచుకుందాం' మొదలైన కవితా సంకలనాలను వెలువరించాము. చేరా సభ సందర్భంగా స్పాన్సర్ల సహకారంతో చేరాగారి కొన్ని పుస్తకాలను తిరిగి సాహితీ స్రవంతి పేర వేసాము. ఇలా విశాల దృక్పథంతో నిర్మాణము, నిర్వహణ, ప్రచురణ అనే మూడూ నిరంతరంగా జరుగుతూ వుండడం జిల్లాలో సాహితీ స్రవంతి పట్ల నమ్మకాన్ని పెంచింది.

జిల్లాలో సా.స్ర. ప్రారంభమైనప్పటి నుంచీ ప్రతి సంవత్సరం వార్షికోత్సవాన్ని ప్రాంతాల వారీగా నిర్వహిస్తున్నాము. ఆ సందర్భంగా మారుతున్న సాహిత్య పరిస్థితులను, సామాజిక పరిణామాన్ని చర్చిస్తూ నూతన కమిటీలను ఎన్నుకోవడంతో సాహితీ స్రవంతి ఒక నిర్మాణయుత బృందంగా మారింది.

మా ఈ నిరంతర కార్యక్రమాలలో మహిళలు పాల్గొనడం పెరిగింది. రచయితలుగా కవయిత్రులుగా కూడా ఎదిగారు. స్రవంతి బాధ్యులుగా వున్న వారు రాష్ట్ర స్థాయిల్లో అవార్డులు, రివార్డులు పొందారు. ఇటీవలనే మా జిల్లా అధ్యక్షులు ఉగాది సందర్భంగా ఢిల్లీలో సాహితీ సేవా పురస్కారాన్ని పొందారు.

ఈ మధ్యనే ఇల్లందులో జరిగిన ఆరవ వార్షికోత్సవం సందర్భంగా బొగ్గుగని కార్మికులకు కవిత, కథ పోటీలు నిర్వహించగా కార్మికులు నుండి మంచి స్పందన వచ్చింది. పోటీల్లో పాల్గొని వార్షికోత్సవానికి వచ్చిన కార్మిక రచయితలు మా మణుగూరులో సాహితీ స్రవంతిని ఏర్పాటు చేస్తామంటూ ముందుకు రావడం మా కృషికి గొప్ప ఫలితంగా భావిస్తున్నాము. ఇక ఇదే సభలో ఒక అంధుడైన యువకుడు బ్రెయిలీ లిపిలో కవిత రాసి చదవడం స్పందింపచేసింది.

కార్యక్రమాల నిర్వహణను భవంలో ముఖ్యంగా ఒక ప్రాంతానికి ఒకరు లేదా ఇద్దరు ఆసక్తి వున్న కార్యకర్తలు పూనుకుంటే మంచి సాహిత్య వాతావరణాన్ని సృష్టించవచ్చు.

ప్రారంభం కష్టంకాని, కొనసాగింపు తేలికా. స్రవంతికి ఆదరణ పెరగటానికి ముఖ్యమైన కారణాల్లో ఒకటి ఒక విశాల ప్రాతిపదికన లౌకిక ప్రజాస్వామిక భావాలు గలవారినీ, ప్రపంచీకరణ దుష్ప్రభావాలను వ్యతిరేకించే వారినందరినీ కలుపుకుపోయే విధానం అందరికీ ఆమోదయోగ్యంగా వుంది.

సమీకరణకు కృషి చేయగలిగితే వచ్చే సాహితీ ప్రియులకు కొదవలేదు. అయితే వారిని గుర్తించి పరిచయాల్ని కొనసాగించే ప్రయత్నం చేయాలి. ఇక కార్యక్రమాలు నిర్వహించేటప్పుడు సమయం చాలా ముఖ్యమైనది. కవులు, సాహిత్య సభలంటే విపరీతంగా సాగుతూ విసుగు కలిగిస్తాయనే అభిప్రాయం వుంది. దానికి భిన్నంగా చాలాక్లుప్తంగా ప్రేరణ, ఉత్సాహం ఇచ్చే వక్తల ఎంపికతో సమయపాలన పాటించే విధంగా చూస్తున్నాము.

అన్నింటికన్నా ముఖ్యమైన విషయం ఆర్థిక వనరు సమకూర్చుకోవడం. సాహితీకారులు కాకపోయినా అభిరుచి, అధ్యయనం చేసే కొంత మంది ప్రోత్సహించే వారుంటారు. వారిని గుర్తించాలి. కార్యక్రమాల సందర్భంగానే వనరులను సమీకరించు కోవడం కొంత ఇబ్బందిగా వున్నా తప్పడం లేదు. ఒక సంవత్సర కాలానికి చేసే కార్యక్రమాలను, సమన్వయానికి సరిపడే నిధిని వసూలు చేసుకొని ఒక నిధిని ఏర్పాటు చేసుకోవడం అవసరం.

ఏ కార్యక్రమమైనా అందుబాటులోని నలుగురు కార్యకర్తలం చర్చించి, ఎలా నిర్వహించాలో పని విభజన చేసుకుని అవసరమైన సందర్భాలలో రాష్ట్ర కేంద్రం సహకారం తీసుకుని ముందుకు పోసున్నాము. జిల్లాలోని కవులు, రచయితలు కూడా మా కృషికి మంచి సహకారం అందిస్తున్నారు. కొన్ని ఇబ్బందులు చిన్న చిన్న ఆటంకాలు ఎదురౌతున్నా ఒక నిబద్ధ ఆలోచన మమ్మల్ని ముందుకు తీసుకుపోతోంది.

---

# "నిరాయుధ పోరు"



- గరికపాటి మణీందర్

యుద్ధం నిత్యం అనివార్యం
సర్వకాలాలందు
సకల దేశాలందు
దేహాలయందు
సృష్టి యావత్తులో
ఈ యుద్ధంలో
ఈటెలు కత్తులు
బాణాలు, బల్లేలు
స్కడ్, మిస్సైల్స్, రాకెట్ లాంచర్స్
మారణాయుధాలేవీ వుండవు
నిరాయుధుడిగానే
నిర్బంధంగానే
మన ప్రమేయమేమీ లేకుండానే
బ్రతుకు యుద్ధంలో
ప్రత్యక్ష భాగస్వాములం
విశ్వవిజేతగా కలలుగన్న
అలెగ్జాండరైనా
విశ్వ విఖ్యాత రాజు అశోకుడైనా
ఇందుకు మినహాయింపు కాదు
దేని మీద యుద్ధం చేస్తున్నామో
దేని కొరకు చేస్తున్నామో లక్ష్యం
అస్పష్టం అగమ్యం
జాతి, కుల, వర్ణ లింగభేదం లేదు
పశువు పక్షి
పిపీలికం శలభం
ప్రతిదీ దీని ప్రభావంతో బ్రతకాల్సిందే
ఇది చూపే ప్రలోభాలకు లొంగాల్సిందే
ఫలితం ప్రతికూలము కాదు
అలాగని అనుకూలము కాదు
ఒక్కొక్కసారి
కొన్నివేల సార్లు గాయపడతాం
నిరుత్తరుడిలా ఏమీ చేయలేని
మానసిక వికలాంగులమవుతాం
మరోమారు జవసత్వాలు కూడగట్టుకొని
పంటి బిగువున చిరుతలమై చెలరేగిపోతాం
ఒక్కో క్షణం
కొన్ని కోట్ల సార్లు మరణిస్తాం
ఓదార్పు మాటల మృత సంజీవనితో
శతకోటి పునరుత్థానాలు పొందుతాం
కాలం బ్రతుకు నాటకానికి
భరతవాక్యం పలుకుతుంది
మనిషి మానవత్వపు పరిమళంతో
దిగంతాల వరకు పరివ్యాప్తమవుతు
కాలం కొసలపై నిలబడి
యశఃకాయంతో
జిలుగుతారలా వెలుగుతాడు




**కర్నూలు కథ**

డా॥ ఎం. హరికిషన్

వెల : రు.200




**కొమ్మలు రెమ్మలు**

కూర్పు : మో & స్మైల్

వెల : రు.50




**నల్లగేటు నందివర్ధనం చెట్టు**

శిఖామణి

వెల : రు.60




**అనగనగా ఒక రాజద్రోహం**

అట్టాడ అప్పల్నాయుడు

వెల : రు.50




**పాటల చెట్టు**

ఎన్. అరుణ

వెల : రు.50




**గరుడస్తంభం**

జి. వెంకటకృష్ణ

వెల : రు.50




**జలగీతం**

వైజ్ఞానిక, మానవీయ, తాత్విక దర్శనం

ఎం. ధనంజయ్ నాయక్

వెల : రు.75




**అతను చరిత్ర**

కె. శివారెడ్డి

వెల : రు.40




**ఎరుపెక్కిన పత్తిపూలు**

పత్తి శివప్రసాద్

వెల : రు.50




**ఎరుక**

పెన్నా శివరామకృష్ణ

వెల : రు.50




**మంకమ్మ తోట లేబర్ అడ్డా**

అన్నవరం దేవేందర్

వెల : రు.75




**రేపటిలోకి**

పెనుగొండ లక్ష్మీనారాయణ

వెల : రు.15



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20, Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad, Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**



# మృత్యుగీత



ఆ మృతదేహం ఎక్కడ కనుగొన్నారు?
ఆ మృతదేహాన్ని ముందుగా కనుగొన్నదెవరు?
ఆ మృతదేహాన్ని చూసినపుడు మృతి చెందిందా?
ఆ మృతదేహం ఎలా కనిపించింది?

ఆ మృతదేహం మృతి చెందిందా?

ఆ మృత పరిచ్యుత దేహానికి
తండ్రి లేదా కూతురు లేదా సోదరుడు
లేదా మామయ్య లేదా సోదరి లేదా కొడుకు ఎవరైనా వున్నారా?

ఆ మృత దేహాన్ని వదిలివెళ్లినప్పటికే
మృతి చెందిందా?
దాన్ని వదిలేసి వెళ్లారా?
దాన్ని అలా వదిలేసి వెళ్లిన వారెవరు?

ఆ మృతదేహం దిశమొలతో వుందా
ఆ లేక దుస్తులేసుకొని వెళ్తున్నట్టుందా?

ఆ మృతదేహం మృతి చెందిందని మీరు ప్రకటించడమెందుకు?
ఆ మృతదేహం మృతి చెందినట్టు మీరు ప్రకటించారా?
ఆ మృతదేహం మీకేమాత్రం తెలుసు?
ఆ మృతదేహం మృతి చెందిన సంగతి మీకెలా తెలిసింది?

మీరు ఆ మృతదేహాన్ని శుభ్రపరచారా?
మీరు దాని కనురెప్పలు మూసేశారా?
మీరు దాన్ని మట్టిచేశారా?
మీరు దాన్ని అక్కడే వదిలొచ్చారా?
మీరు దాన్ని ముద్దాడారా?

(నోబుల్ పురస్కార ప్రదానం సందర్భంగా పంపిన
వీడియో ప్రసంగంలో ఉటంకించింది)

**హెరాల్డ్ పింటర్**

ముఖపత్రం : ఆలోచనా సాగరంలో పింటర్

## [illegible]ధ్యాయులు, తల్లితండ్రులు చదువవలసిన పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల | క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|---|---|---|
| 1. | పిల్లలు నేర్చుకోవడంలో ఎలా వెనకబడతారు? | 60.00 | 13. | నల్లబల్ల వెనుక | 25.00 |
| 2. | పిల్లలు ఎలా నేర్చుకుంటారు | 60.00 | 14. | చదువు సంధ్యలు | 25.00 |
| 3. | టీచర్ | 40.00 | 15. | మహోజ్వల స్మృతులు | 35.00 |
| 4. | విముక్తి-విద్య | 40.00 | 16. | మనిషి కథ | 40.00 |
| 5. | టీచర్లకు ఉత్తరం | 40.00 | 17. | చార్లీచాప్లిన్ | 25.00 |
| 6. | మాస్టారూ...! | 10.00 | 18. | పరిణామక్రమంలో విద్యా వ్యవస్థ 1833-2003 | 15.00 |
| 7. | మీ ఒడిలో | 10.00 | 19. | వేదభూమి | 10.00 |
| 8. | కథలే పాఠాలు | 25.00 | 20. | సమాజం-సైన్స్- సంప్రదాయం | 15.00 |
| 9. | బోధన-శోధన | 30.00 | 21. | సైన్సు చరిత్రలో సామాజికాంశాలు | 10.00 |
| 10. | విభిన్న విద్యా సంస్థలు | 25.00 | 22. | పిల్లల అలవాట్లు | 25.00 |
| 11. | భాష-భావం | 20.00 | 23. | భారతదేశ చరిత్ర | 25.00 |
| 12. | మీరు - మీ పిల్లలు | 15.00 | 24 | పిల్లల భాష - ఉపాధ్యాయుడు | 25.00 |

## పిల్లలు చదివే పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల | క్ర.స | పుస్తకం పేరు | వెల | క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | మహావిశ్వం మన భూమి | 20.00 | 34. | మూడు కథలు | 10.00 | 67. | యముని దర్బారు | 10.00 |
| 2. | ఆదర్శబాల్యం | 25.00 | 35. | నత్తగుల్ల స్వార్థం-బంగారుచేపగర్వం | 15.00 | 68. | బంగారు జింక | 15.00 |
| 3. | విలియం షేక్స్పియర్ | 15.00 | 36. | అద్భుతాలనియం-నీరు | 10.00 | 69. | మూడు ఏనుగులు | 15.00 |
| 4. | హైడీ | 20.00 | 37. | నేయా | 10.00 | 70. | బొబక్ నేర్పిన పాఠం | 15.00 |
| 5. | విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞులు | 15.00 | 38. | బద్ధకం వదిలింది | 15.00 | 71. | పులి-తాబేలు | 10.00 |
| 6. | విదేశీ కథలు | 15.00 | 39. | బుడిబుడికథలు | 40.00 | 72. | పింకి-పిల్లి | 10.00 |
| 7. | విజ్ఞాన శిఖరాలు | 15.00 | 40. | పిల్లల ప్రశ్న-సైన్స్ జవాబు | 15.00 | 73. | సైన్యాధిపతి గర్వభంగం | 15.00 |
| 8. | చైనా నీతి కథలు | 15.00 | 41. | మేమొచ్చేశాం | 20.00 | 74. | కుడి-ఎడమ | 10.00 |
| 9. | భారతీయ శాస్త్రవేత్తలు | 15.00 | 42. | నిర్జీవం-జీవపరిణామం | 30.00 | 75. | నాతప్పేమిటో! | 15.00 |
| 10. | అందాల పార్కు | 15.00 | 43. | సరదాసరదా లెక్కలు | 30.00 | 76. | నందువంట-నేస్తంతంటా | 10.00 |
| 11. | పిల్లల గణితం | 15.00 | 44. | విశ్వం-విజ్ఞానం | 25.00 | 77. | వంశీధర్ నిజాయితీ | 10.00 |
| 12. | పిల్లలు-పిడుగులు | 20.00 | 45. | ప్రకృతిలో అద్భుతాలు-విజ్ఞానవిశేషాలు | 45.00 | 78. | జమిందారు వేట | 10.00 |
| 13. | సరదా సరదా చదువులు | 15.00 | 46. | కాలిక్యులేటర్ గేమ్స్ | 20.00 | 79. | అద్దంలో సింహం | 15.00 |
| 14. | తరగతిలో తమాషాలు | 15.00 | 47. | అలెగ్జాండర్ గ్రాహంబెల్ | 10.00 | 80. | సముద్ర నేస్తాలు | 15.00 |
| 15. | వానరుడు - నరావతరణ | 25.00 | 48. | మేకపిల్ల మెడగంట-చిట్టెలుక కృతజ్ఞత | 15.00 | 81. | కప్పకల | 15.00 |
| 16. | ఒవ[illegible]టే మూడోకన్ను | 25.00 | 49. | మంచిగా వుందాం | 30.00 | 82. | కథలంటే మాకిష్టం-1 | 25.00 |
| [illegible] | పా[illegible] ఓ తెలుగువాడా | 15.00 | 50. | భలేకథలు | 10.00 | 83. | కథలంటే మాకిష్టం-2 | 25.00 |
| [illegible] | పిల్ల[illegible] సంరక్షణ | 25.00 | 51. | తోకతెగిన తోడేలు | 15.00 | 84. | రాబిన్‌సన్‌క్రూసో | 45.00 |
| [illegible] | అక్షరాలతో ఆటలు | 30.00 | 52. | బల్బు వెలిగింది | 20.00 | 85. | నల్లగుర్రం | 25.00 |
| [illegible] | నేర్చుకోడం మాకిష్టం | 20.00 | 53. | రవీంద్రనాథ్ ఠాగూర్ | 15.00 | 86. | పెన్సిల్‌బాక్స్ | 15.00 |
| 21. | కథలంటే మాకిష్టం | 40.00 | 54. | వినయంలేని వీరుడు | 25.00 | 87. | మంచి అమ్మ | 15.00 |
| 22. | ఆటలంటే మాకిష్టం | 30.00 | 55. | బండి నుంచి మోటారుకు | 20.00 | 88. | కోతి ఫొటో | 25.00 |
| 23. | పాటలంటే మాకిష్టం | 20.00 | 56. | చెట్టు | 15.00 | 89. | కథ కాని కథ | 15.00 |
| 24. | పాడుకొందాం | 25.00 | 57. | చిటపట చినుకులు | 20.00 | 90. | లోకంచుట్టిన వీరుడు | 40.00 |
| 25. | తేటతెలుగు-1 | 30.00 | 58. | చిట్టిరాకుమారి-చందమామ | 10.00 | 91. | చివరి ఆకు | 10.00 |
| [illegible] | తేటతెలుగు-2 | 30.00 | 59. | గుడ్డు నుంచి పిల్ల | 20.00 | 92. | పెద్దల మాయం-పిల్లలరాజ్యం | 20.00 |
| [illegible] | కొత్తబ్యాగ్ | 10.00 | 60. | కుకూ భూరీల కథ | 20.00 | 93. | నెలవంక | 25.00 |
| [illegible] | బొటనవేలితోబొమ్మలు | 10.00 | 61. | మన కథ | 20.00 | 94. | సాయపడే చేతులు | 20.00 |
| 29. | పొడుపుకథలు-చింగ్‌చదువు | 15.00 | 62. | నడిచేటి నావకథ | 20.00 | 95. | నీళ్ళు ఎందుకు తడిగాఉంటాయి? | 15.00 |
| 30. | డంభాలమారి డాన్ క్విక్సాట్ | 25.00 | 63. | రహస్యం | 10.00 | 96. | బడి-బ్రతుకు | 25.00 |
| 31. | గణితసూత్రదీపిక | 20.00 | 64. | ఎద్దు | 20.00 | 97. | హిరోషిమా అగ్నిజ్వాలలు | 25.00 |
| 32. | జంతువుల వింతభాష | 10.00 | 65. | మనమూ రాద్దామా? | 10.00 | 98. | సిసింద్రీలు | 20.00 |
| 33. | జంతువుల వింతరుచులు | 10.00 | 66. | బుచ్చిబాబు-బొమ్మకారు | 15.00 | 99. | అద్దాలతో ఆటలు | 15.00 |



| మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A118 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |